శ్రీః

శ్రీరఙ్గనాథాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీగుణరత్నకోశః

(శ్రీ పరాశర భట్టరు)



ప్రకాశకులు

ఉభయ వేదాన్త సభ

పెంటపాడు-534 166

శ్రీః

శ్రీరఙ్గనాథాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీగుణరత్నకోశః

(శ్రీ పరాశర భట్టరు)



సంస్కృత 'వసురాశి' వ్యాఖ్యా

(వాత్స్యకులతిలక శ్రీ వీరరాఘవాచార్యులు)

*

ఆంధ్ర 'రత్నదీపికా' వ్యాఖ్య

(ఉ.వే. శ్రీమాన్ కె. వి. ఆర్. నరసింహాచార్యులు)

ప్రకాశకులు

## ఉభయ వేదాన్త సభ

పెంటపాడు-534 166

శ్రీగుణరత్నకోశః - శ్రీపరాశర భట్టరు
సంస్కృత వసురాశి వ్యాఖ్యా - వాత్స్యకులతిలక శ్రీవీరరాఘవాచార్యులు
ఆంధ్ర రత్నదీపికా వ్యాఖ్య - ఉ.వే. శ్రీమాన్ కె.వి.ఆర్. నరసింహాచార్యులు

ప్రథమ ముద్రణ : ఏప్రియల్ 1984, ప్రతులు : 1000
ద్వితీయ ముద్రణ : శ్రీరామనవమి, 1993, ప్రతులు : 1000
తృతీయ ముద్రణ : 02-04-2001 వృష సం॥ చైత్రమాసము - సోమవారము
ప్రతులు : 1000

వెల : రూ. 20/-



ప్రతులకు : 1) ఉభయ వేదాన్త సభ, పెంటపాడు - 534 166 ప.గో. జిల్లా.
2) సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201

First Edition : April 1984 Copies : 1000
Second Edition : Sreeramanavami 1993 Copies : 1000
Third Edition : Sreeramanavami 2001 Copies : 1000

Price Rs. : 20/-

DTP by
R. MOHAN RAO
4-103, I.L.T.D. Colony
Kothapeta, Chirala - 523 157
Ph: 34054

Printed at
SRI VIJAYALAKSHMI OFFSET PRINTERS
NAAZ COMPLEX
Chirala - 523 157
Ph : 33057

# శ్రీః

# శ్రీసూక్తము

1. హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజత స్రజామ్ ।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥

2. తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం విన్దేయం గా మశ్వం పురుషా నహమ్ ॥

3. అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాద ప్రబోధినీమ్ ।
శ్రియం దేవీ ముపహ్వయే శ్రీ ర్మా దేవీ ర్జుషతామ్ ॥

4. కాంసోస్మితాం హిరణ్యప్రాకారా మార్ద్రాం జ్వలన్తీం తృప్తాం తర్పయన్తీమ్ ।
పద్మే స్థితాం పద్మవర్ణాం త్వా మిహో పహ్వయే శ్రియమ్ ॥

5. చంద్రాం ప్రభాసాం యశసాజ్వలన్తీం శ్రియం లోకేదేవజుష్టా ముదారామ్ ।
తాం పద్మనీ మీం శరణమహం ప్రపద్యేఽలక్ష్మీ ర్మే నశ్యతాం త్వాం వృణే॥

6. ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో వనస్పతి స్తవ వృక్షోఽథ బిల్వః ।
తస్య ఫలాని తపసా నుదన్తు మాయాన్తరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥

7. ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ ।
ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే ॥

8. క్షుత్పిపాసామలాం జ్యేష్ఠా మలక్ష్మీం నాశయామ్యహమ్ ।
అభూతి మసమృద్ధిం చ సర్వాం నిర్ణుద మే గృహాత్ ॥

9. గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ॥
ఈశ్వరీగ్ం సర్వభూతానాం త్వా మిహోపహ్వయే శ్రియమ్ ॥

10. మనసః కామ మాకూతిం వాచస్సత్య మశీమహి ।
పశూనాగ్ం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః ॥

11. కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ ।
శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥

12. ఆపస్సృజన్తు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే ।
నిచ దేవీం మాతరగ్ం శ్రియం వాసయ మే కులే ॥

13. ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగలాం పద్మమాలినీమ్ ।
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥

14. ఆర్ద్రాం యః కరిణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్ ।
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాత వేదో మ ఆవహ ॥

15. తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్ ।
యస్యాం హిరణ్యం ప్రభూతం గావోదాస్యోఽశ్వాన్ విన్దేయం పురుషా నహమ్।

16. యః శుచిః ప్రయతో భూత్వా జుహుయా దాజ్య మన్వహమ్।
శ్రియః పంచదశర్చం చ శ్రీకామ స్సతతం జపేత్ ॥

శ్రీః

# గరుడ ప్రార్థన

శ్లో॥ కుంకుమాంకిత వర్ణాయ కుందేందు ధవళాయ చ।
విష్ణువాహ నమస్తుభ్యం పక్షిరాజాయ తే నమః ॥

శ్లో॥ వైనతేయో మహావీర్యః। కాశ్యపోఽగ్ని సమప్రభః।
విష్ణువాహనం ఖగేశం। వందేహం గరుడం దేవమ్॥

శ్రీః



## కృతజ్ఞతాంజలి

శ్రియై సమస్త చిదచిద్విధాన వ్యసనం హరేః ।
అంగీకారిభిరాలోకైః స్సార్థయన్త్యై కృతోఞ్జలిః ॥

శ్రీ పరాశరభట్టారకులు శ్రీలక్ష్మీదేవి విషయమై అనుగ్రహించిన ఈ శ్రీగుణ రత్నకోశము నిత్యానుసంధేయ స్తోత్రమై యలరారుచున్నది. శ్రియః పతి విషయమైన స్తోత్రములలో స్తోత్రరత్నమువలె శ్రీలక్ష్మీదేవి విషయమైన స్తోత్రములలో శ్రీ గుణరత్నకోశము తలమానికమైనది.

శ్రీపరాశర భట్టారకులు అనుగ్రహించిన మరియొక స్తోత్రము శ్రీరంగరాజ స్తవము. ఈ శ్రీగుణరత్నకోశ, శ్రీరంగరాజ స్తవములు రెండును ద్వయార్థమును వివరించుచున్నవి. ద్వయమంత్రములోని శ్రీశబ్ద వివరణయే శ్రీగుణరత్నకోశము.

ఇందు పదియవ శ్లోకమున 'దేవి ! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః త్వత్సద్గుణౌఘ మణికోశగృహం గృణన్తి' అని వేదములు లక్ష్మీదేవియొక్క గుణములనెడి రత్నములకు కోశములని చెప్పుచు తమ గ్రంథమునకు శ్రీగుణరత్నకోశమని పేరిడినారు. మరియు దానికి వేదసామ్యమును సూచించినారు.

శ్రియఃపతి శ్రీరామచంద్రుడుగా నవతరించినప్పుడు వేదము రామాయణముగా అవతరించినట్లు, శ్రీలక్ష్మీదేవి శ్రీరంగనాయకిగా అవతరించినప్పుడు వేదము శ్రీగుణరత్నకోశముగా అవతరించినది. 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' అనునట్లు వేదార్థమును వివరించుటకు ఇతిహాస పురాణము లెట్లు సహాయభూతములో ఈ స్తోత్రార్థమును తెలిసికొనుటకు కూడ ఇవి ఆవశ్యకములు.

అట్టి అర్హత కలవారు మన ఉ.వే. శ్రీమాన్ కందాళ వేంకటరామ నరసింహాచార్య స్వామివారు. వీరు శ్రీలక్ష్మీదేవి యొక్క పరిపూర్ణమైన అనుగ్రహమునకు పాత్రులు. కావుననే శ్రీవాత్స్యకులతిలక వీర రాఘవాచార్య స్వామి సంస్కృత భాషలో అనుగ్రహించిన వసురాశిని ప్రకాశవంత మొనరించి మనకు చూపించు రత్నదీపికగా నీ రత్నదీపికా వ్యాఖ్యానమును అనుగ్రహించినారు. వీరు వృత్తిరీత్యా ఉపన్యాసకులగుటచే వీరి వ్యాఖ్యానము అత్యంత సులభ శైలిలో నుండుటయే గాక ప్రామాణికమై యున్నది.

శ్రీ నరసింహాచార్యస్వామి వారు ఆళవందార్ స్తోత్రము; గద్య త్రయము; గోదాస్తవము; లక్ష్మీస్తోత్రమణిమంజరి మున్నగు స్తోత్రములకు ఆంధ్రభాషలో సరసమైన వ్యాఖ్యానముల ననుగ్రహించి యున్నారు. ఆంధ్ర పాఠకలోకము వీరికి ఋణపడియున్నది. వీరి లేఖిని నుండి మరిన్ని స్తోత్ర వ్యాఖ్యలు వెలువడగలవని ఆశించుచు అట్టి శక్తియుక్తులను ప్రసాదించు గాకయని శ్రియఃపతిని ప్రార్థించుచున్నాను.

ఇతః పూర్వము ఈ వ్యాఖ్య సంస్కృత వసురాశితో కలిపి 1984 సం॥లో వ్యాఖ్యాతచేతనే ఆంధ్రపాఠకలోకమునకు అందింపబడినది. పిమ్మట ఉభయవేదాన్త సభద్వారా 1993లో ద్వితీయ ముద్రణ కావింపబడినది. ఆ సమయమున ఉ.వే. శ్రీమాన్ కె.వి.ఆర్. నరసింహాచార్య స్వామివారు తమ వ్యాఖ్య ఉభయవేదాన్త సభ ద్వారా ప్రచురించుటకు అనుమతించుటయేగాక అందుకు తగిన ఆర్థిక సహాయ్యమును కూడ సమకూర్చిరి.

శ్రీమద్వేదాన్త దేశికుల స్తోత్రములనిన అత్యన్త ఆదరముగల శ్రీమతి రావి కృష్ణకుమారి, కొత్తపేట, చీరాల వారు ఈ శ్రీగుణరత్నకోశ తృతీయ ముద్రణకు మూలమగుట ముదావహము. వీరికి శ్రియఃపతి సమస్త సన్మంగళమును కలిగించు గాక యని యాశించుచున్నాడను.

సర్వులు ఈ శ్రీగుణరత్నకోశమును చదివి అర్థముచేసుకొని శ్రీ శ్రియఃపతుల అనుగ్రహమునకు పాత్రులగుదురని ఆశించుచున్నాడను.

ఇట్లు
భాగవత వశంవదుడు
యన్. వి. యల్. యన్. రామానుజాచార్యులు

పెంటపాడు
01-01-01

# ఆముఖము

సాహిత్య విద్యాప్రవీణ, భాషాప్రవీణ,
శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామివారు, ఎమ్. ఏ.,
'డిప్యూటీ స్థానాచార్య'
శ్రీ ఆదికేశవ ఎంబెరు మానార్‌స్వామివారి దేవస్థానం
నరసాపురం

అవాప్త సమస్తకాముడు కరుణాసింధువు సర్వస్వామియునగు సర్వేశ్వరుడు సంసారిచేతనోద్ధరణమునకై సదసద్వివేచనరూపమైన శాస్త్రము నను ప్రసాదించెను. అందు భగవంతుని చేరుటకు కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తి, యోగములు వివరింపబడినవి. దేశకాల, అధికారాది, నియమములచే కర్మ యోగము; అవ బోధన సామర్థ్యము, ధారణ, అధికారాది సాపేక్షచే జ్ఞాన యోగము; తదేక స్మృతియు, భగవంతుని వీడియుండ లేమను భావన, మొదలగు వాని అపేక్షచే భక్తియోగము; ఇతరోపాయ త్యాగపూర్వక మహా విశ్వాస నియమముచే ప్రపత్తి యోగము; సంసారిచేతనులకు భగవత్ప్రాప్తికి ఉపయోగింపవు.

కావున మన పూర్వాచార్యులు కృత్యాకరణ అకృత్యకరణ పరులగు చేతనులను దిద్దుబాటు చేసి భగవన్ముఖోల్లాసమును కలిగించుటకై స్తోత్రమును ఒక విలక్షణరూప పద్ధతిని కనుగొనిరి. స్తోత్రముచేయుటకు అధికారి సాపేక్షగాని, పూర్వోత్తర కృత్యములుగాని, తదేక ధ్యానాదులుగాని అవసరము లేకపోవుటచే స్తోత్రపద్ధతి కర్మయోగాదులకంటె విశిష్టమైనది. 'కలౌ సంకీర్త్య కేశవమ్' అను శాస్త్రవిధికూడ నీస్తోత్ర పద్ధతికి కలదు. వేదపురాణాదులలో నీ పద్ధతి విరివిగానున్నను ఒక నిష్కృష్టరూపమున దీనిని సాయించినవారు పరమాచార్యులైన యామున మునులు, వారి పద్ధతిని భగవద్రామానుజాదులు అవలంబించిరి.

భగవత్తత్త్వము కూడ శ్రీదేవి సాపేక్షమగుటచే మన పూర్వాచార్యులలో నొకరును, కృపామాత్ర ప్రసన్నాచార్యులును, జ్ఞానభక్తి వైరాగ్యాదులు మూర్తీభవించిన వారును అగు పరాశరభట్టపాదులు స్వానుభవపరీవాహ రూప మైన శ్రీదేవి స్తుతిని రచించి దానికి 'శ్రీగుణరత్నకోశ' మని అన్వర్థనామ ధేయ ముంచినారు. పూర్వోత్తర భాగద్వయాత్మకమగు కృత్స్నవేదము వేదోప బృంహణములైన శ్రీరామాయణాదులను శ్రీదేవి స్వరూపరూప గుణ విభవాదు లను తెలిపి సార్థకములగుచున్నవి. భగవన్నిరూపిక యగు శ్రీదేవి స్వరూప స్వభావాదు లెట్టివో తెలియవలసిన ఆవశ్యకము ముముక్షువునకు గలదు.

శ్రీ శబ్దమునకుగల షడ్విధవ్యుత్పత్తులలో రెండుపరమ విలక్షణములైనవి
అందు మొదటిది :-'శ్రయతే చ పరం' సర్వేశ్వరుని ఆశ్రయించి స్వరూప లాభమును పొందునది అని అర్థము. ఈమెవలన ఆయనకు స్వరూప సిద్ధి. సర్వేశ్వరుని 'ఇదంత్వ ఇత్థంత్వ' ప్రకారావబోధిక శ్రీ యని అర్థము. 'స్వరూపం స్వాతంత్ర్యం భగవత ఇదం చంద్రవదనే! త్వదాశ్లేషోత్కర్షాత్ భవతి ఖలు నిష్కర్షసమయే' అని ఈ భట్టపాదుల దివ్యసూక్తి, అనపగామినీం అను శ్రీ సూక్తము, 'అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభాయథా' అనన్యాహి మయయా సీతాభాస్కరేణ ప్రభాయథా' అను శ్రీరామాయణమునందలి సీతారాముల వచనములు, 'అగల గిల్లేయన్ ఇరయుం' అను పరాంకుశుల దివ్యసూక్తి శ్రీ శ్రియః పతుల సంబంధము నిత్యమని తెలుపుచున్నవి. ఈమె సంబంధము చేతనే వస్తువునకు సదసచ్ఛబ్దవాచ్యత్వము' అస్తి వస్త్విదమిత్థంత్వ ప్రసంఖ్యాన పరాఙ్ముఖం' ఇదంత్వ ఇత్థంత్వాకారములతో చెప్పసాధ్యముకాని తత్త్వమని ఈ భట్టపాదులే శ్రీరంగరాజస్తవమున ముందుగా పేర్కొనిరి. అనిర్వచనీయత్వ వస్తువునకు తుచ్ఛత్వము రాదా? అనిన, అట్లుగాదు 'లక్ష్మీపద లాక్షైకలక్షణము'అని సర్వేశ్వరుని అస్తిత్వమును ఈమె సాన్నిహిత్యముచే నిర్ధారించిరి. శ్రీమత్ శబ్దము నందలి మతుప్ ప్రత్యయము నిత్యయోగము నందలిది కావున, సర్వేశ్వరునికి ఒక్కనికే శ్రీసంబంధముచే నిత్యత్వము, మిగిలిన వారియందు శ్రీ శ్రీమత్ శబ్దప్రయోగములు లక్షణావృత్తిచే మాత్రమే. అనేకార్థకల్పనా యోగముచే భగవచ్ఛబ్దమును అందరకును ఉపయోగించునట్లు శ్రీ తత్త్వావబోధకములైన ఈ విషయములన్నియు తవ స్పర్శాదీశం, అపాంగా భూయాంసః, స్వతః శ్రీ స్త్వం విష్ణోః స్వమపి ఇత్యాది శ్లోకముల యందు హృద్యముగా నిరూపింపబడినవి.

శ్రీదేవి గుణస్వరూపము :- శ్రీదేవి నామములలో కరుణయనునది ఒకటి. పరదుఃఖదుఃఖిత్వము కరుణ. 'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః' అని పేరు పొందిన రాముని దయకూడ కాకాసురాది రక్షణ ఘట్టమున సోపాధికమే యగుచున్నది. కాని శ్రీవిషయమున (సీతాదేవిగా) 'పాపానాంవా శుభానాంవా వధార్హాణాం' అనురీతి నిరుపాధికమగుచున్నది.

భగవంతుడు చేతనులకు తండ్రికూడ కావున పితృత్వప్రయుక్త హిత కాముడై అప్పుడప్పుడు 'క్షిపామి' నక్షమామి అనును. అప్పుడు శ్రీదేవి 'న కశ్చిన్నాపరాధ్యతి' (తప్పుచేయనివాడెవ్వడు?) అని భగవంతుని హెచ్చరించి, 'దుష్టుడైనను శరణాగతి చేసిన వానిని క్షమించవలసినది, తద్భిన్నుల విషయము

న 'క్షిసామి' అనుశాస్త్రమును ఉపయోగించవలసినది'. అని బోధించును. 'అందువలన మీ దయకుగాని శాస్త్రమునకు గాని వైయర్థ్యము రాదు' అనును. ఇదియే, పురుషకార కృత్యము.

'దోషోయద్యపి తస్య స్యాత్ సతామేత దగర్హితం'

'అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్।

సాధురేవ సమన్తవ్యః (బహుమన్తవ్యః) సమ్యక్వ్యవసితోహిసః'

అని తానే రామకృష్ణాద్యవతారములలో వాక్రుచ్చెను కదా। ఈ అనర్థ విషయములన్నియు 'పితేవ త్వత్ప్రేయాన్ మాతర్మైథిలి రాక్షసీః' మున్నగు శ్లోకములలో సయుక్తికముగ వివరింపబడినవి 'శ్రీయతే' (అందరిచేత ఆశ్రయింపబడునది) అను కరణే వ్యుత్పత్తిని వివరించుచున్నవి.

'ధ్యాయీత-ఉపాసీత' అని చెప్పబడిన శ్రీమన్నారాయణుడు పరవ్యూహ విభవ అర్చ అన్తర్యామి రూపమున చేతన సమాశ్రయణమునకై వెలసి యున్నాడు. దేశకాల కరణ విప్రకర్షాదులచే పరత్వాదులు మనకు దుర్లభములు. పిపాసితునకు కరస్థోదకమువలె ఆశ్రయణ సౌకర్యాపాదకము లైన వాత్సల్య సౌలభ్య సౌశీల్యాదులు, ఆశ్రిత కార్యాపాదకములైన జ్ఞాన శక్త్యాదులు 'ఓం పూర్ణం' అను శ్రుత్యుక్త ప్రకారముగాను, 'అడియో ముక్కి ఎంబెరుమానల్లో నీర్' అను పరకాల దివ్యసూక్త్యనుసారము అర్చావతారము నందేగలవు. శౌనకమహర్షి అర్చావతారమునుతప్ప సర్వేశ్వరుని పరత్వాది రూపమును స్మరించలేదు. ఈ అర్చావతారము భక్తి నిష్ఠులకు జ్ఞానాధికులకు అజ్ఞాన స్వరూపులకు కూడలి. అర్చాస్థలములో ప్రధానమై సాక్షాత్ పరమపదముగా పేరు పొందిన శ్రీరంగమునందలి శ్రీదేవిని ప్రణమిల్లుట తప్ప ఈ చేతనుడు చేయదగిన కృత్యములేదు.

శ్రీదేవి పుట్టినిల్లు అనుకారణముచే క్షీరాబ్ధిని ఎక్కువగా అభిమానించును. దయితప్రేమచే పరమపదమును అభివృద్ధినొందించును. ఆ రెండింటిని మరచి సంతానమైన అస్మదాదుల రక్షణకై 'అవ్విడం శ్రీరంగ నాచ్చియారుక్కు నృత్తస్థానం' అనునట్లు మోదించునట. 'జనన భవనప్రీత్యా....' ఇందలి భావము ఎట్టిరాతిగుండెనైనను కదల్చివేయును.

జీవాత్మస్వరూపము శేషత్వ జ్ఞానానందాది లక్షణయుక్తమైనది. ఇందు అంతరంగ ధర్మము శేషత్వము. శేషత్వమనగా 'పరగతాతిశయాధానచ్ఛేయా యస్య స్వరూపం.. సశేషః, పరశ్శేషీ' చందనకుసుమాదులవలె ప్రత్యేకముగా నుండుటయేగాక పరప్రయోజనమునకు ఉపయోగపడుట. ఈ ఉపయోగ

పడుటలో కూడ ఫలసంగకర్తృత్వరహితముగా నుపయోగపడవలెను. 'ఉనక్కే నామాట్చెయ్‌వోం, మత్తనం కామంగళ్‌మాత్తే' అని గోదాసూక్తి తెలుపుచున్నది. ఈ విషయమును బాగుగా నెరింగినగాని నమః పదార్థము తెలిసినట్లు కాదు. 'భవాంస్తు సహవైదేహ్యా గిరిసానుషు రంస్యతే। అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చతే' ॥ అని లక్ష్మీ సంపన్నులైన లక్ష్మణస్వామి;

'ఒళివిల్‌కాలమెల్లాం.... అడిమైశెయ్యవేండునాం' అని శఠకోపసూరి;

'నివాసశయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః' అని యామునమునులు;

'సుందరస్యవనశైలవాసినః భోగమేవ నిజ భోగమాభజన్।
శేష ఏష ఇతి శేషతాకృతేః ప్రీతిమానహిపతిః స్వనామని'

అని కూరేశమిశ్రులు సాయించియున్నారు.

అష్టాక్షరీ మహామంత్రములోని చతుర్థికి నిత్యకైంకర్య ప్రార్థనయే అర్థము. 'పరంజ్యోతి రూప సంపద్యా స్వేనరూపేణ అభినిష్పద్యతే' అని శ్రుతివాక్యము. ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతిక దుఃఖములు ముక్తాత్మకు లేక పోవుటచే భగవత్సంకల్పముచేతను, తన సంకల్పముచేతను, 'శెన్నాల్ కుడయాం' అను రూపమున నానావిధ పరిచర్యా భాగ్యము కల్గునని సూచించు చున్నది.

ఇట్టి చేతనుని నిష్కృష్టస్వరూపమైన నిత్య కైంకర్యరూపమగు పరమ పురుషార్థము 'పశ్యేమ ప్రతియామ యామచ పరీచారాన్ ప్రహ్వాష్యేమచ ' 'నిర్దుఃఖం సుసుఖంచ దాస్యరసికాం భుక్త్వా సమృద్ధిం పరాం' మున్నగు శ్లోకరూపముగా, వివరింపబడినది. శ్రీ శ్రియఃపతుల రూపవిభూత్యాదులను వివరించు శ్లోకములున్నను విస్తరభీతిచే వానిని వివరించుటలేదు.

వాత్సల్య శాలినియగు శ్రీతోగూడిన నారాయణుని నిత్యకైంకర్యమును చేయక శబ్దాది విషయ లంపటుడై యుండుటకు కారణము 'లోకవత్తు లీలాకైవల్యమ్' అను రీతిని, సర్వేశ్వరుని ప్రపంచనిర్మాణాది క్రీడయే అని 'శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య' అను శ్లోకమున నుడివిరి.

'జ్ఞానాత్ మోక్షః' జ్ఞానాత్ అర్థపంచక జ్ఞానాత్, ఆ అర్థపంచకములు అయిదును :-

1) పరస్వరూపము : దోషరహితాది కృపావాత్సల్యాది కళ్యాణగుణ గణ విశిష్టుడగు శ్రియఃపతి. ఈ అర్థము 'స్వరూపం స్వాతంత్ర్యం' స్వతః శ్రీస్త్వం విష్ణోః స్వమసి 'ప్రశకన బలజ్యోతిః' ఇత్యాది శ్లోకముల యందు వివరింపబడినది.

**2)** స్వస్వరూపము : శేషత్వ జ్ఞానానందాదులతో కూడిన చేతనుడు. ఇది 'మాతర్లక్ష్మి' శ్రీరంగే శరదశ్శతం' మొదలగు శ్లోకములయందు ప్రతిపాదింపబడినది.

**3)** ఉపాయస్వరూపము : 'సర్వ ధర్మాన్ పరిత్యజ్య' అను రీతి ఉపాయాంతరములను సవాసనగా విడచి సర్వేశ్వరుని చరణ ద్వంద్వమును ఉపాయోపేయములుగా వరించుట. 'జ్ఞానక్రియా భజన సంపత్ ఇత్యుక్తి కైతవ శతేన' ఇత్యాది శ్లోకములయందు చెప్పబడినది.

**4)** ఫలస్వరూపము : నిత్యకైంకర్యప్రాప్తి 'శ్రీరంగే శరదశ్శతం' మొదలగు శ్లోకములు తెలుపుచున్నవి.

**5)** విరోధి స్వరూపము : ప్రకృతి సంబంధము, అస్థానస్నేహ, కారుణ్యాదులు, అహంకార మమకారాదులు దీనిని 'శబ్దాదీన్ విషయాన్' మొదలైన శ్లోకములు ప్రతిపాదించుచున్నవి.

ఈ విధముగా ఈ స్తోత్రము అర్థపంచక ప్రతిపాదకము కావున మితమతులకు కూడ శాస్త్రాభ్యాసావసరము లేకయే దానివలన తరింప వీలగు చున్నది.

పరాశర భట్టపాదుల శ్రీ సూక్తులు అనర్ఘభావ గర్భితములు. 'నామూలం లిఖ్యతే కించిత్ నానపేక్షితముచ్యతే' అను రీతిలో నుండును. ఉపమాన చాతుర్యములో కాళిదాసుని, శయ్యాసౌభాగ్యములో దండి భట్టబాణులను, అనర్ఘ సూక్తి రచనలో మాఘుని, భావగాంభీర్యములో భవభూతిని అతిశయించి యుండును. సమస్త సంస్కృత సాహిత్యములో ఇట్టి రచన లేదనుట సాహసము కానేరదు. దానికి ఒకటే కారణము. వారందరును ప్రాకృత విషయములను భావనచేసి, కవితా రచన గావించిరి. వీరు అచార్య కటాక్షముచే అప్రాకృత విషయములను అనుభవించి తత్పరీవాహ రూపముగా సర్వేశ్వరుని నిర్హేతుక కటాక్షముచే తమ శ్రీసూక్తులను వర్షించిరి. వేదవేదాంగములయందు చతుర్దశ విద్యలయందు, వీరికిగల అపార శేముషీ వైభవమునకు శ్రీ విష్ణు సహస్ర నామభాష్య, (భగవద్గుణ దర్పణము), శ్రీరంగరాజస్తవ శ్రీగుణరత్న కోశాదులు, భగవద్విషయమున వారుచూపు యోజనలే నికషోపలములు.

సంస్కృతమున శ్రీ వీరరాఘవ మనీషి అనుగ్రహించిన వ్యాఖ్యానమాధారముగ శ్రీగుణ రత్నకోశమునకు అరవమున తెనుగున అనేక వ్యాఖ్యలు వెలసినవి. తెనుగున అనేక కవులు దీనిని పద్యరూపమున వెలయించిరి.

సాహిత్య విద్యాప్రవీణ శ్రీమాన్ కె.వి. ఆర్. నరసింహాచార్యులు, ఎం.ఏ., వారు, (లెక్చరర్- ఎల్.బి.ఎస్. గవర్నమెంటు ఓరియంటల్ డిగ్రీ కాలేజి,

చిననిం(డకొలను) దీనిని శ్రీ వీరరాఘవ మనీషి వ్యాఖ్యను ప్రధానముగచేసికొని ఆంధ్రీకరించినారు. పాఠకులకు సుబోధకముగానుండుటకై ప్రతిపదార్థ తాత్పర్యాదులుకూడ ఇందు చేర్చబడినవి. భట్టపాదుల పదప్రయోగ వైచిత్రి సమాసరచన చాలా విలక్షణమైనది. వ్యాకరణ శాస్త్ర మర్మజ్ఞులకు గాని అందలి లోతు తెలియదు. ప్రతిపదార్థము తెలిసికొన్నంత మాత్రమున వారి సూక్తి స్వారస్యమును గ్రహింపలేము. 'ఆపాతాళ నిమగ్న పీవరతనుః' అనునట్లు అందు మునిగి భావనచేసినవారికే ఆలోతు తెలియును. నవ రత్నములు నిధులు లభించును. ఈ క్లిష్ట కార్యమునుచేసి మనకు శ్రీదేవి గుణ రత్నములను తేట తెల్లముగా అందించిన శ్రీమాన్ నరసింహాచార్యస్వామి అభినందనీయులు.

'పరిచితమివాథాపి గహనం' అని గ్రంథకర్త తెలిపినట్లు వారి శ్రీసూక్తి లోని లోతు పరిచయముగలవారికే గహనము. అపరిచితుడను జ్ఞానలవలేశ దుర్విదగ్ధుడను అగు నేను, కోరిన తడవుగా 'సత్సంప్రదాయసారసర్వస్వ' మయిన దీనికి పీఠిక వ్రాయుట హాస్యాస్పదము. మరి దానికి ఏలఖూనితి ననగా- 'అస్మదమర్షణీయఫణితి స్వీకారతస్తేగుణాః, జాన్త్యౌదార్య దయాదయో భగవతి! స్వాం ప్రస్నువీరన్ ప్రథాం' దోషయుక్తములైన అస్మత్కావచనములను స్వీకరించుటలో ఆమె దయయే కారణమగుచున్నది. ఇంతకంటె వేరు కారణము లేదు.

పుష్పమంటప నిత్యవాసుడు, కరుణావరుణాలయుడు నగు శ్రీనివాసుడు ఈ ఆంధ్రీకర్తచే మరికొన్ని గ్రంథ పూజా పుష్పములను, స్వీకరించుగాక! అని ఆశించుచు విరమించుచున్నాడను.

'దోషాన్ క్షంతుమర్హంతి సంతః'

నరసాపురం
14-7-1982

ఇట్లు
సుధీజన విధేయుడు
కిడాంబి వెంకటాచార్య



శ్లో॥ లక్ష్మీ బిల్వవనే కదంబకుసుమే వైశ్యాలయే కుంజరే
శ్వేతాశ్వే వృషభే శుభే చ ధవళే ఛత్రే ధ్వజే చామరే।
శంఖే పద్మసరే నరేంద్రభవనే గంగాజలే గోకులే
నిత్యం శౌచకరే సలక్షణగృహే శ్రీవిష్ణువక్షస్స్థలే॥

# శ్రీః

శ్లో॥ శ్రీ లక్ష్మీం త్వాం నమామి స్మితలలిత ముఖీం శుద్ధజాంబూనదాభాం
శాంతాం నారాయణీం భూషణమణిమకుటాలంకృతాం శ్వేతవస్త్రామ్
భక్తాభీష్టప్రదాత్రీ మభయవరకరాం పద్మహస్తాం శరణ్యాం
శ్రీం కారధ్యేయమూర్తిం సురగణ వినుతాం విష్ణువక్షస్థలస్థామ్॥

అ- స్మితలలితముఖీమ్- చిరునవ్వుతో నందమైన ముఖము కలదియు, శుద్ధ జాంబూనదాభామ్- మేలిమి బంగారు వంటి శరీరము కలదియు, శాంతామ్- శాంతి కలదియు, నారాయణీమ్- నారాయణుని భార్యయు, భూషణ- నగలతోడను, మణి- మణులుగల, మకుట అలంకృతామ్ - కిరీటముతోడను నలంకరింపబడినదియ, శ్వేతవస్త్రామ్- తెల్లని వస్త్రము కలదియు, భక్త- భక్తులకు, అభీష్ట ప్రదాత్రీమ్ - కోరికల నిచ్చునదియు, అభయవరకరామ్- అభయహస్తమును, వరదహస్తము కలదియు, పద్మ హస్తామ్- పద్మము చేతియందు కలదియు, శరణ్యామ్- రక్షకురాలును, శ్రీం కారధ్యేయ మూర్తిమ్- శ్రీంకారముచే ధ్యానింపదగిన ఆకారము గలదియు, సురగణవినుతామ్- దేవతలచేత వినుతింపబడునదియు, విష్ణువక్ష స్థల స్థామ్ - విష్ణువు యొక్క వక్షస్థలముపై నుండునదియునగు, శ్రీ లక్ష్మీమ్ - శ్రీమహాలక్ష్మివగు, త్వామ్- నిన్ను, నమామి- నమస్కరించు చున్నాను.

# శ్రీః

# శ్రీగుణరత్నకోశః

( శ్రీ పరాశరభట్టరు )

(సంస్కృత వసురాశి వ్యాఖ్య మరియు ఆంధ్ర రత్నదీపికా వ్యాఖ్య)

*శ్లో॥ శ్రియై సమస్త చిదచి ద్విధాన వ్యసనం హరేః।*

*అఙ్గీకారిభి రాలోకైః సార్థయన్త్యై కృతోఽఞ్జలిః॥ ౧*

అ:- హరేః= విష్ణువు యొక్క, సమస్త చిదచిద్విధానవ్యసనమ్= జడచేతన సృష్ట్యాది విధానమునందలి పట్టుదలను, అంగీకారిభిః= అంగీకరించునట్టి, ఆలోకైః= చూపులతో, (కటాక్షములతో) సార్థయన్త్యై= సార్థకముచేయుచున్నట్టి, శ్రియై= లక్ష్మీ దేవి కొఱకు, అంజలిః= నమస్కారము, కృతః= చేయబడినది.

తా:- విష్ణుమూర్తి చేయునట్టి సృష్టి స్థితిలయాత్మకములైన కార్యముల నన్నింటిని తన ఆలోకముచేతనే సార్థకపరచుచున్నట్టి లక్ష్మీదేవిని నమస్కరించుచున్నాను.

వి: - ఒక ఉద్యోగి తాను చేసిన పనిని తన పై యధికారికి చూపించినచో ఆ యధికారి దాని నామోదించును. అప్పుడా ఉద్యోగి తాను కృతకృత్యుడైనట్లు భావించును. అట్లే శ్రీమహావిష్ణువు చేసిన పనులన్నింటికిని లక్ష్మీదేవి తన కటాక్షముల తోనే అంగీకారము ను తెలుపును. అపుడు శ్రీమహావిష్ణువు తాను కృతకృత్యుడైనట్లు భావించును. ఈ విధముగా స్వామికంటే లక్ష్మీదేవికి పరత్వము చెప్పబడినది. ఈ స్తోత్రము శ్రీపరాశర భట్టరులచే అనుగ్రహింపబడినది. వీరు భగవద్రామానుజుల యంతేవాసియగు కూరేశుల పుత్రులు. శ్రీరంగరాజ పురోహితులు. శ్రీమద్రామానుజుల యనుగ్రహము చే శ్రీభాష్యాది పరిచయము నొందినవారు. ద్రవిడ వేదమునకు గంభీరమైన అర్థమును వివరించినవారు. శ్రీరంగధాముని కరుణా విశేషమున శ్రీరంగమున బ్రహ్మరథ వైభవము నందినవారు కూడ. వీరు జగన్మాతయు, శ్రీరంగధామేశ్వరియు అయిన శ్రీదేవి యొక్క అనుగ్రహమును పొంది, ఆమె యొక్క మహోపకారమును స్తుతించుట కుపక్రమించుచు గ్రంథాదిని విఘ్నరాహిత్యమునకై శిష్టాచార పరంపరా ప్రాప్తమైన (నమస్కారరూప) మంగళముతో ఆమెనే ప్రార్థించుచున్నారు.

ఇక ఈ శ్లోకమునందలి పదముల సార్థక్యమును పరిశీలింపుడు :-

1. హరేః :- (1) హరి యనగా హరించువాడు అని అర్థము. 'హరి ర్హరతి పాపాని దుష్ట చిత్తైరపి స్మృతః। దుర్మార్గులచేత స్మరింపబడినప్పటికిని వారి యొక్క

పాపములను కూడ హరించువాడు హరి. అనగా తనను ఆశ్రయించిన వారలకు తనను పొందుటకు ప్రతిబంధకముగా నున్న పాపములను పోగొట్టుటయు, మోక్షము నిచ్చుటయు, జ్ఞానము, శక్తి, కృప, క్షమ, మొదలగు కల్యాణ గుణములకు స్థానమ్మై యుండుటయు, దీనిచే సూచింపబడినది. (2) అట్లే 'హరతి ఇతి హరిః' ప్రపంచమును తన వశములో నుంచుకొనువాడు కావున 'హరి' అనబడుచున్నాడు, 'హరిం ప్రహరన్త మనుయంతి దేవాః' (హరిని దేవతలు అనుసరించుచున్నారు) అను శ్రుతియు.

శ్లో॥ బ్రహ్మాణ మీశం రుద్రంచ యమం వరుణమేవచ ।
ప్రసహ్య హరతే యస్మాత్ తస్మాద్ధరిరిహోచ్యతే ॥

(బ్రహ్మరుద్ర యమేంద్రాదులను కూడ హరించువాడు కావున హరి యని చెప్పబడు చున్నాడు) అను నిర్వచనమున్ను విష్ణువునకు బ్రహ్మ రుద్రాదుల కంటె యాధిక్యమును చెప్పుచున్నవి. అందువలన వారల నందరను తన యధీనములో నుంచు కొనువాడును, వారందరికంటె నధికుడును అయి ఉన్నాడు. ఈ యర్థమున 'శ్రీ మహావిష్ణువు అందరకంటె నధికుడు' అని తేలుచున్నది. (3) ఉపహరతీతి హరిః :- 'తాను సృజించిన జగత్తును శ్రీదేవికి కానుక నొసంగువాడు హరి' అనికూడ ఈ హరిశబ్దమున కర్థము చెప్పుకొనవచ్చును. 'శబ్దాదీన్ విషయాన్' అను 20వ శ్లోకమున 'ఈ సృష్టి యంతయు లక్ష్మీదేవి యొుక్క విలాసము కొరకే' అను విషయము వివరింపబడినది. ఇందు మూడవది సువర్ణ కుంచికాకారుల యభిప్రాయము.

**2.** సమస్త చిదచిద్విధానవ్యసనమ్ :- ఇందు సమస్త, చిత్, అచిత్, విధాన, వ్యసనమ్ అను పదములున్నవి. ఇచ్చట 'సమస్త' పదముచేత బ్రహ్మనుండి పిపీలిక వరకు నుండు చేతన సమూహమున్ను, ప్రకృతి తత్కార్య జాతమున్ను చెప్పబడు చున్నవి. 'విధాన' శబ్దము కరణ కళేబరాది నిర్మాణము మొదలగు సృష్టినంతను తెలుపు చున్నది. దీని వలన 'స్థితి లయ, అను నీ రెండునుకూడ చెప్పబడినవి. 'వ్యసన' శబ్దము పట్టుదలను కార్యదీక్షను చెప్పుచున్నది. 'చిదచిచ్ఛబ్దములు' సృష్టియోగ్యులైన సంసారులగు చేతనులను, మిశ్ర సత్త్వమును తెలుపును. లేదా బద్ధ, నిత్య, ముక్త రూపులైన చేతనులు, శుద్ధసత్త్వ మిశ్రసత్త్వ, సత్త్వశూన్య, కలాముహూర్తాది అచేతనములు ఈ శబ్దములవలన చెప్పబడును. అట్లే ప్రాణి అప్రాణిరూపములైన 'జంగమ స్థావర' ములను కూడ ఈ చిదచిచ్ఛబ్దములు తెలుపుచున్నవి.

**3.** సార్థయన్త్యై :- తాను చూచి ఆమోదించనిచో శ్రీ మహావిష్ణువు తన కార్యము లను నెరవేర్చికొనలేడని భావము. ఆమె కటాక్షముచేతనే ఆయనయొుక్క కార్యములు సార్థకములగును.

4. శ్రియై.. శ్రీ.. అందరిచేతను ఆశ్రయింపబడునట్టి యామె. ఈ శ్రీ శబ్దమునకు ఆరు రకములుగా వ్యుత్పత్తి చెప్పబడినది.

శ్లో ॥ శ్రితాస్యన్యైః సర్వైః, శ్రయసి రమణం, సంశ్రితగిరః
శృణోషి, ప్రేయాంసం, శ్రితజనవచః శ్రావయసిచ।
శృణాస్యేత ద్దోషాన్ జనని నిఖిలాన్, సర్వజగతీం
గుణైః శ్రీణాసిత్వం, తదిహ భవతీం శ్రీరితి విదుః। (శ్రీ గుణసుధాలహరీ)

1) ఇతరులందరి చేత ఆశ్రయింపబడి యున్నావు.
2) ప్రియుడైన విష్ణువును ఆశ్రయించుచున్నావు.
3) ఆశ్రితుల మాటలను వినుచున్నావు.
4) ఆశ్రితుల యార్తులను (భర్తకు) వినిపించుచున్నావు.
5) దోషములను పోగొట్టు చున్నావు.
6) ప్రపంచము నంతటిని గుణములతో ఆశ్రయించి యున్నావు.

అందువలన నిన్ను 'శ్రీః' అని అనిరి. అని శ్రీశబ్దమునకు ఆరు రకములైన వ్యుత్పత్తి సామాన్యముగా నీ గ్రంథమున నీ యారురకములును వివరింపబడినవి. అయినను అందరిచేతను ఆమె ఆశ్రయింపబడుట, ఆమె శ్రీమహావిష్ణువును ఆశ్రయించుట అనునవి ప్రధానములు.'శ్రీరిత్యేవచనామతే భగవతి' (ఓ భగవతీ! నీకు శ్రీః అని పేరు) అని కాంతాస్తోత్రము. పై వివరణములను బట్టి శ్రీశబ్దమే లక్ష్మీదేవి యొక్క గొప్పదనమును చాటు చున్నది.

5. అంజలిః :- ఈ శబ్దము చేత నమస్కార రూపమైన మంగళము చెప్పబడుట యేగాక - మానసిక, వాచిక, కాయిక నమస్కారములు మూడును కూడ సూచింపబడినవి. ఎవరు అందరికన్న గొప్పవారో వారికి నమస్కరించుట సముచితము. కావున లక్ష్మి యొక్క ఆధిక్యమును, కవియొక్క దాసత్వము (లేక) శేషత్వమును సూచించునదియే ఈ అంజలిపదము.

6.1) విశేషములలో మొదట చెప్పుకొన్నట్లుగా ఇచట లక్ష్మీనారాయణుల వృత్తాంతము వలన లౌకికమైన -'ఉద్యోగి - అధికారుల' వృత్తాంతము వ్యంగ్యమగుచున్నది. కావున 'ధ్వని' ఆ విధముగా ఈ స్తోత్రమునకు ఉత్తమ కావ్యత్వము కూడ సిద్ధించినది.2) రోగ ఫలకమైన జగణము ముందు ప్రయోగింపబడినను దేవతా వాచకమైన శ్రీ శబ్ద ప్రయోగము వలన ఆ దోషము నివారించబడినది.

శ్లోక సారము:- సారాంశముగా ఈ శ్లోకమున భగవంతుడగు శ్రీమన్నారాయణుడే జగజ్జన్మాది కారణమనియు లక్ష్మీదేవి ప్రరోచక ప్రమాణమనియు చెప్పబడినది.

శ్లో ॥ హరిణీ ప్రేక్షణా యత్ర గృహిణీ నవిలోక్యతే।
సేవితం సర్వ సంపద్భిరపి తద్భువనం వనమ్ ॥

(ఎచట హరిణీ ప్రేక్షణయగు గృహిణి కనుపించదో, సమస్త సంపదలకు ఆకరమ్మైనను ఆ భవనము వనముతో సమానము) 'నగృహం గృహమిత్యాహుః గృహిణీ గృహ ముచ్యతే' (కేవలము గృహము గృహముకాదు. గృహిణియే గృహము) అను ఈ లౌకిక వాక్యములు కూడ గృహిణియొక్క ప్రాధాన్యమును చెప్పుచున్నవి.

శ్రీపరాశర భట్టర్ యొక్క పితృపాదులైన శ్రీవత్సాంక మిశ్రుల (కూరేశుల) యొక్క శ్రీస్తవమునందలి ఈ మొదటి శ్లోకమును పరిశీలించినచో మన కవిగారి యభిప్రాయము దానికి సరియైనదిగా నున్నదని వేరుగా చెప్పనక్కరలేదు.

శ్లో॥ స్వస్తిశ్రీర్దిశతా దశేషజగతాం సర్గోపసర్గస్థితీః
స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వంచ కుర్వన్ హరిః।
యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలం
క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదాస్యాదైకరస్యాత్తయా ॥

(విష్ణుమూర్తి లక్ష్మియొక్క ముఖమును తదేక దీక్షగా చూచుచు ఆమెయొక్క ఇంగిత పరాధీనుడై స్వర్గ నరక మోక్షాది రూపమ్మైన మరియు సృష్టి స్థితి లయాత్మకమ్మైన జగత్తు ను చేయుచున్నాడు. అట్టి లక్ష్మీదేవి మంగళమును కలుగజేయునుగాక.) ఈ విధముగా ఈ శ్లోకమున లక్ష్మీదేవియొక్క పరత్వ సౌలభ్యములు వర్ణింపబడినవి. 'శ్రియః శ్రీ రంగేశయ' అను (9వ) శ్లోకమున లక్ష్మీదేవిని స్వామికంటె ఎక్కువగా వర్ణించు చున్నామని కోప పడవలదనియు, అది స్వామికే హర్షోత్కర్ష దాయకమనియు స్తుతించుట గమనించిన చో 'న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే' (స్వామివారితో సమానమ్మైనవారు గాని ఎక్కువైన వారు గాని లేరు) అను శ్రుతితో విరోధమునకు అవకాశములేదు. మనము ఎవరిని వర్ణించెదమో వారు అందరికన్న అధికులు కాబట్టిన్నీ, తన ప్రేయసిని తనకంటె మిన్నగా వర్ణించుట తన యుత్కర్షకే కారణము కాబట్టిన్నీ - మరియు 30వ శ్లోకమును గమనించినచో బ్రహ్మేంద్రాదుల ప్రశస్తిని వర్ణించుట పరోక్షముగా లక్ష్మియొక్క ప్రశస్తికి కారణమని చెప్పబడినది. అట్లే ఇచట కూడ లక్ష్మియొక్క ఉత్కర్షవర్ణన శ్రీమ న్నారాయణుని ఉత్కర్ష వర్ణనకే హేతువగు నని కూడ చెప్పుకొనవచ్చును. ఆ విధము గా కూడ పై శ్రుతితో విరోధము రాదు. కావున ఇచట సృష్టికర్త విష్ణువు. అంగీకారిణి లక్ష్మి.

సంస్కృత వసురాశి వ్యాఖ్యా

శ్లో॥ శ్రీ గురు పంక్తి పాద సరసీరుహ సంవినతః।
శ్రీ గుణరత్న కోశ వివృతిం వసురాశ్యభిధామ్ ॥

శ్లో॥ శ్రీ నగదేశేంద్రతనయః శుభ వాత్స్యకులః
శ్రీయుత వీరరాఘవగురు ర్వితనోతితరామ్ ॥

శ్లో ॥ శ్రీ మన్మహా హరిత వంశ విశుద్ధ వృత్త
ముక్తామణిః సకల శాస్త్ర విదగ్రగణ్యః ।
భట్టారకో విరచయన్ గుణరత్న కోశం
స్తోత్రం శ్రియో నమతి తామిహ విఘ్న శాంత్యై ॥

అ :- శ్రీమత్కూరకుల పయః పారావార సుధాకర శ్రీమద్రామానుజ మునీంద్ర కృపాలబ్ధ శ్రీభాష్యాది ప్రబంధ పరిచయ మహిమోల్లాస బుద్ధిః, ద్రవి డోపనిషద్గభీరార్థ వివరణ శ్రీరంగరాజ కమలాపతి లాలితః, శ్రీ రంగనాథ దివ్యాజ్ఞాలబ్ధ పరాశర భట్టారక నామధేయః, కైశిక పురాణ శ్రవణ సముదిత మహిమోల్లాస భాసుర రంగరమణ కరుణా ప్రసాద సమాసాదిత బ్రహ్మరథ వైభవః, యతివర చరణాంభో రుహ ప్రవణాంతేవాసి జనాగ్రేసర కూరేశతనూభవః, సకల శాస్త్రవి దగ్రేసరః, శ్రీభట్టాఖ్యదేశికః, నిఖిల జగదుదయ విభవ లయ లీలాశాలీ భగవత్ప్రాపక భూతాం శ్రియం తత్కృత మహోపకారాతిశయానుసంధానేన దయా వాత్సల్యాది గుణాతిశయ పరిశీలనేన, స్తోతుకామః, ప్రారీప్సిత గ్రంథనిర్విఘ్న పరిసమాప్త్యర్థం శిష్టాచారపరం పరాప్రాప్తం మంగళమాచరం స్తామేవ స్తౌతి ॥

శ్రియాఇతి :- హరేః హరతి పరిహరతి స్వాసంశ్లిష్టాన్ కరోతి పాప్మన ఇతి హరిః । 'అపహతపాప్మా' ఇతిశ్రుతేః । అనేన హేయగుణ ప్రతిభటత్వముక్తం భవతి। హరత్యాశ్రిత పాపానీతివా హరిః। 'హరిర్హరతిపాపాని' ఇతిస్మృతేః। అనేన సంశ్రితానాం స్వప్రాప్తి విరోధి సర్వపాపహరణోక్త్యా మోక్షప్రదత్వం పాపహరణస్య తద్ జ్ఞాన తన్నివర్తక కృపాక్షమాదిసాపేక్షత్వేన కల్యాణ గుణాకరత్వంచ, ఫలితమ్ । హరతి సర్వం స్వవశీకరోతీతివా హరిః। 'సర్వస్యవశీ' 'యత్రకామగమోవశీ' ఇతిస్మృత్యోస్సద్భావాత్ । వశీత్యస్య 'సర్వం వశే యస్య స వశీ' ఇతి శ్రుతప్రకాశికాచార్యై ర్వ్యాఖ్యానం కృతమ్ । అనేన ఉభయవిభూతి యోగః ఫలితః । 'హరిం ప్రహరన్త మనుయన్తి దేవాః ॥ బ్రహ్మాణమీశం రుద్రంచ యమం వరుణమేవచ । ప్రసహ్య హరతే యస్మా త్తస్మా ద్ధరిరిహోచ్యతే ॥ ఇతిశ్రుతి నిర్వచనాభ్యాం భగవతః సర్వస్మాత్పరత్వం సర్వదేవ నియంతృత్వం చ సిద్ధమ్ । తస్య సమస్తచిదచిద్విధానవ్యసనం - అత్ర చిదచిచ్ఛబ్దాభ్యాం 'అచిదవిశేషితాన్ ప్రలయసీమని సంసరతః। కరణ కలేబరైర్ఘటయితుం దయమానమనాః । వరదనిజేచ్ఛయైవ పరవానకరోః । ప్రకృతిం మహదభిమాన భూతకరణావళి కోరకిణీమ్ । ఇత్యుక్త సృష్టియోగ్య సంసారచేతన మిశ్రసత్త్వేగృహ్యేతే । సమస్త శబ్దేన బ్రహ్మాది పిపీలికాన్తం చేతనజాతం చతుర్వింశతి తత్త్వాత్మకం ప్రకృతి తత్కార్య జాతంచ వివక్షితమ్ । తేషాం సమస్త చిదచితాం విధానం కరణ కళేబర యోజన లక్షణా, తదర్థం మహదహంకార భూతకరణ గ్రామోత్పాదన లక్షణాచ సృష్టిః స్థితిలయయోరప్యే తదుపలక్షణమ్ । యద్వా సమస్త చిద చితాం బద్ధముక్త నిత్యరూపాణాం చేతనానాం

శుద్ధసత్త్వ మిశ్రసత్త్వ సత్త్వశూన్య లక్షణానాం అచేతనానాం చ విధానమ్। 'ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థసత్తా నిత్యం ప్రియాస్తవతు కేచన తే హి నిత్యాః।' ఇతి శ్రీవత్సాంక శ్రీ సూక్తి ప్రకారేణ భగవతో నిత్యేచ్ఛయా నిత్య సూరిణాం నిత్యాసంకుచిత జ్ఞానతయా సంకల్పనమ్। ముక్తానా మావిర్భూతాపహతపాప్మత్వాది గుణాష్టకతయా సంకల్పనమ్। బద్ధానాంకరణాది ప్రదానకర్మ తారతమ్య జ్ఞానోత్పాదనాదిచ । ఏవం చేతన విషయే విధానం వేదితవ్యమ్। అచేతన విషయేతు శుద్ధ సత్త్వస్య స్వేచ్ఛయా నిత్య విభూతే విమాన గోపుర మంటప ప్రాసాదాది రూపేణ పరిణమయితృత్వమ్। మిశ్రసత్త్వస్య సంసారి చేతనాన్ ప్రతి భోగ్య భోగోపకరణ భోగస్థాన రూపేణాండ తదావరణ చతుర్దశ భువన సమస్త దేహేంద్రియాది రూపేణ చోత్పాదనమ్ । సత్త్వ శూన్యస్య కాలస్య చేతన కర్మాను గుణ్యేన కలాకాష్ఠాముహూర్తయామ దిన పక్ష మాసాయన సంవత్సరాది రూపేణ పరిణమయితృత్వంచ విధానమ్ ।

తత్ర వ్యసనమభినివేశమాయాసంవా । అంగీకార ఏషా మస్తీత్యంగీకారిణః తైః అంగీకార సూచకై రిత్యర్థః । ఆలోకైః కటాక్షైః 'స్మిత వికసిత గండం వ్రీడ విభ్రాన్త నేత్రం ముఖమవనమయన్తీ స్పష్టమాచష్ట సీతా' ఇతి తన్నయన లీలయై వాంగీకారః సూచ్యతే । నతు 'పూర్వోక్తాద్దక్షిణాపథాః, ఇతివత్ ఏవమేవ కార్యమితి స్పష్టోక్త్యేత్యర్థః । సార్థయన్త్యై స్వానుమోదేన సఫలం కుర్వత్యై । స్వానుమోదా జననే హరేః జగత్ సృష్ట్యాదిలీలా విరసా స్యాత్ । తదుక్తం శ్రీస్తవే 'క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదా స్యాదేకరస్యాత్తయా' ఇతి । అనేన భగవత ఏవ జగజ్జన్మాది కారణత్వమ్ । శ్రియస్తు తదనుమోదేన తదుత్తంభకత్వమాత్రం సూచితమ్ । ఏవం పరత్వ ముక్తమ్ । సౌలభ్య మాహ। శ్రియా ఇతి శ్రియై తత్పురుషార్థ లాభాయ సర్వసంశ్రయణీయాయై శ్రీరంగ నాయక్యై । అత్ర శ్రీశబ్దస్య షోఢావ్యుత్పత్తిర్ద్రష్టవ్యా । తతో ఘటకత్వసిద్ధిః । వ్యుత్పత్తి షట్కంచ మదీయే శ్రీగుణసుధాసారలహరీస్తోత్రే ప్రదర్శితమ్।

శ్లో ॥ శ్రితాస్యన్యైస్సర్వైః శ్రయసి రమణం సంశ్రిత గిరః
శృణోషి ప్రేయాంసం శ్రితజనవచః శ్రావయసిచ ।
శృణాస్యేత ద్దోషాన్ జనని నిఖిలాన్ సర్వజగతీం
గుణైః శ్రీణాసిత్వం, తదిహభవతీం శ్రీరితి విదుః ॥

అంజలిః స్వశేషత్వ సూచకస్సుకరః క్షిప్రప్రసాదహేతుశ్చ । 'అంజలిః పరమా ముద్రాక్షిప్రందేవ ప్రసాదినీ' ఇత్యుక్తేః । కృతః కృతోభవతి । మయేతి శేషః ।అత్ర సమస్త చిదచిద్విధానవ్యసనమాలోకై స్సార్థయన్త్యా ఇతి వస్తునా యథా కస్య చిత్ ప్రభోః ప్రీత్యై కేనచిత్ ప్రయత్నసాధ్యే కర్మణికృతే, ప్రభుణా తద్దర్శన తదనుమోదనే కర్తు ర్మహానందో భవతి, తథా సమస్త చిదచిద్విధానవ్యసనినో హరేరపి తత్ప్రయత్నే

శ్రియాదర్శనే నానుమోదితే తస్యాపి మహానందో భవతీతి వస్తుధ్వన్యత ఇత్యస్య స్తోత్రస్యోత్తమత్వం సూచితమ్। 'ధ్వనిప్రధానతా యత్ర తదుత్తమ ముదాహృతం' ఇతి లక్షణాత్ ॥ అంజలిరితి కమలముకులాకార కరతల యుగల యోగ రూపాంజల్యుక్త్యా కాయిక నమస్కారః కృత ఇతి, వాచాతదనువాదేన వాచిక నమస్కారః, 'మనః పూర్వోవాగుత్తరః' ఇతి మనః ప్రసరణ పూర్వకత్వాత్ వాచః మానసిక నమస్కారశ్చ కృత ఇతి మంతవ్యమ్ ॥

మంగళారంభ సంభవాయ స్తోత్రాదౌ శ్రీశబ్ద ప్రయోగః। 'దేవతా వాచకా శ్శబ్దాః యేచ భద్రాది వాచకాః। తే సర్వేనైవ నింద్యాః స్యుః లిపితోగణతోఽపివా' ఇత్యుక్తేరాదౌ రోగఫలక జగణ ప్రయోగ దోషోనేతి ధ్యేయమ్ ॥

అ :- మహాప్రబంధ నిర్మాణే విఘ్న భూయస్త్వశంకయా తన్నివృత్త్యై మంగళ బాహుళ్యాయ దేవతా వశీకరణే సుకరోపాయం నమస్కారాత్మక మంగళాంతర మాచరతి ॥

శ్లో ॥ ఉల్లాస పల్లవిత పాలిత సప్తలోకీ -
నిర్వాహ కోరకిత నేమ కటాక్ష లీలామ్ ।
శ్రీరఙ్గహర్మ్య తల మఙ్గళదీప రేఖాం
శ్రీరఙ్గరాజమహిషీం శ్రియ మాశ్రయామః ॥ ౨

అ :- ఉల్లాస....లీలామ్, ఉల్లాస=ఉదయము వలన (సృష్టివలన), పల్లవిత=చిగురు తొడిగినట్లును, పాలిత=పరిపాలింపబడిన, సప్తలోకీ= ఏడు లోకములయొక్క, నిర్వాహ=నిర్వహణము వలన, (స్థితివలన) కోరకిత =మొగ్గ తొడిగినట్లును ఉన్న, నేమ=సగమైన, కటాక్షలీలామ్= కటాక్షవములయొక్క విలాసములు కలిగినట్టి, శ్రీరంగ...రేఖామ్, శ్రీరంగ= శ్రీరంగము నందలి, హర్మ్యతల =దివ్యవిమానము యొక్క, మంగళదీప రేఖామ్=మంగళప్రదమైన దీపరేఖయైనట్టి, శ్రీరంగరాజ మహిషీమ్=శ్రీరంగ ధాముని పట్టమహిషియైనట్టి, శ్రియమ్=లక్ష్మీదేవిని, ఆశ్రయామః=ఆశ్రయించుచున్నాము.

తా :- సమస్త లోకముల యొక్క సృష్టిచేత పల్లవితము లైనట్లును నిర్వహణముచేత కోరకితము లైనట్లును కనుపించు కటాక్ష విలాసములు కల, శ్రీరంగ హర్మ్యమునకు మంగళదీప రేఖయైన, శ్రీరంగరాజ పట్టమహిషియగు లక్ష్మిని ఆశ్రయించుచున్నాము.

వి :- ఇచట సృష్టిస్థితులు లక్ష్మీదేవి యొక్క కటాక్షము వలననే జరుగు చున్నట్లుగా వర్ణింపబడినది. అందు సృష్టి పల్లవితత్వావస్థగాను, స్థితి కోరకితత్వావస్థ గాను వర్ణించబడినది. ఆ కటాక్షము కూడా సగమే. ఇందు లక్ష్మీదేవికి లతతో

రూపణము అర్థవశమున సిద్ధించుచున్నది. పాలసముద్రము యోగుల హృదయము మొదలగు వానికంటె భగవంతుడు స్వయముగా వరించి నివసించునది శ్రీరంగము. అందలి హర్మ్యము అనగా లక్ష్మీ నివసించు భవనము. (శ్రీ, రంగము, అనగా లక్ష్మీ నాట్యముచేయు రంగస్థలము, నిత్య నివాసము చేయు చోటు అని అర్థము) అట్టి శ్రీరంగహర్మ్యమునకు ఈ లక్ష్మీ మంగళదీపరేఖ అనుటవలన సామాన్య దీపముకంటె ఆమె యందు ఔజ్జ్వల్యము సౌలభ్యము వ్యక్తమగుచున్నవి. మరియు దీపము తాను ప్రకాశించుచు తన సమీపమున నున్న వస్తువులను ప్రకాశింపచేయునట్లే ఈ లక్ష్మీ కూడ తాను విష్ణువు నాశ్రయించుచు తనను ఆశ్రయించిన వారలను విష్ణువుయొద్దకు చేర్చును. అందుకనియే ఆమె ఆశ్రయణీయ-''శ్రీః'' అని చెప్పబడినది. ఆశ్రయణము అనగా శరణాగతి. ఆ విధమైన శరణాగతివలన ఆమె మనలను రక్షించును. మంగళ దీపరేఖయనగా గాలికి ఆరిపోవు దీపముకంటె విలక్షణమై మంగళకరమైనదని యర్థము. శ్రీరంగరాజమహిషి-'కృతాభిషేకా మహిషీ'-విశ్వ రక్షణ కార్యమున విష్ణువుతో కలిసి పట్టాభిషిక్తురాలైనది. శేష శేషాశనాది-పరివారమునంతను ఆయా భగవంతుని సేవలయందు ఆజ్ఞాపించునది' అను శ్రీమద్రామానుజుల గద్యము కూడ ఆమె మహిషీత్వమును చాటి చెప్పుచున్నది. ఈ విధముగ మొదటి శ్లోకమున చెప్పబడిన పరత్వ సౌలభ్యములే ఇందును మరియొక విధముగా వివరింపబడినవి. ఇందును నమస్కారరూపమైన మంగళము చేయబడినది. వరుసగా కొన్ని శ్లోకములలో మంగళాచరణము విఘ్న బాహుళ్యనివృత్తి కొరకును ఇష్టదేవతా ప్రసాదసిద్ధి కొరకును అని తెలియనగును.

సంస్కృత వ్యాఖ్య :- ఉల్లాసేతి అత్ర ఉల్లాస పదాన్వయాయ సప్తలోక్యా ఇతి షష్ఠ్యన్తం పదం లభ్యతే । తథాచ సప్తలోక్యా ఉల్లాసేన ఉదయేన పల్లవితా సంజాత పల్లవా, పాలితాయా రక్షితాయా స్సప్తలోక్యా, నిర్వాహేణ స్థిత్యా, కోరకితా సంజాత కోరకా-పల్లవిత కోరకితే త్యుభయత్రాపి 'తదస్య సంజాతం' ఇతి తారకాదిత్వాది తచ్ ప్రత్యయః । నేమ కటాక్షోఽర్ధవీక్షణమ్ । నేమ ఇత్యర్థే ఇతి సిద్ధాంత కౌముద్యామ్ । తస్య తథాభూతా లీలా విలాసో యస్యాస్తామ్। ఉల్లాస పల్లవితే త్యనేన లక్ష్మీ కటాక్ష లీలాయాః జగదుత్పత్తి ప్రాక్కాలాపేక్షయా భూయస్త్వమ్ తే నిర్వాహ కోరకితేత్యనేన ఉత్పన్న జగత్ స్థితి జనిత హర్షేణ తతోఽపి భూయస్త్వం చ గమ్యతే। అనేన లక్ష్మ్యా జగదుత్పత్తి స్థితి ప్రయోజకత్వ ముక్తమ్। తతః పరత్వం ఫలితమ్। శ్రీరంగేతి। శ్రీరంగే దివ్యనగరే హర్మ్యతలస్య దివ్య విమాన ప్రదేశస్య శ్రీరంగాఖ్య దివ్య విమాన ప్రదేశస్యవా మంగళ దీపరేఖాం శోభనదీప కలికామివ శ్రీరంగ విమానాంతః ప్రకాశికామితి భావః । మంగళేత్యనేన అనుష్ఠత్వద్యోతనాత్ ప్రసిద్ధ దీపాపేక్షయా వ్యావృత్తిః । దీపరేఖా

మిత్యౌజ్జ్వల్యంచ ద్యోత్యతే । శ్రీరంగరాజ మహిషీం శ్రీరంగరాజేన సహ విశ్వరక్షణే కృతాభిషేకాం 'కృతాభిషేకా మహిషీ' ఇత్యమరః । శ్రియం సర్వ సమాశ్రయణీయాం లక్ష్మీం ఆశ్రయామః శరణం గచ్ఛామః । కటాక్షలేశ లీలాకల్పిత జగదుత్పత్తిస్థితికాం సర్వ సంశ్రయణీయత్వాయ శ్రీరంగే కృతనిత్యవాసాం శ్రీరంగేశ్వరవల్లభామ్ అతఏవ శ్రియం శరణం గచ్ఛామ ఇతి భావః ।

అత్ర సప్తలోక్యుత్పత్తి స్థిత్యోః లక్ష్మీ నేమ కటాక్ష లీలా పల్లవ కోరకత్వ రూపణాత్ కటాక్షలీలా లతాత్వమర్థ సిద్ధమితి సావయవ రూపకమలంకారః । ఏకదేశ రూపణే సర్వరూపణ మప్యర్థ సిద్ధమ్ । 'ప్రౌఢ మౌక్తిక రుచః పయోముచాం బిందవః కుటజ పుష్పబంధవః । విద్యుతాం నభసి నాట్యమండపే కుర్వతేస్మ కుసుమాంజలి శ్రియః' ఇత్యత్ర పయోముచాం బిందవో నభసి నాట్య మండపే కుర్వతేస్మ కుసుమాంజలి శ్రియః కుర్వత ఇత్యనేన విద్యుతాం నటీనామిత్యర్థ సిద్ధమితి సాహిత్య చింతామణి కారోక్తేః । శ్రీరంగ హర్మ్యతల మంగళ దీపరేఖా మిత్యత్ర నిరవయరూపకమలంకార ఇతి సావయవ నిరవయవ రూపకయో స్సంసృష్టిః । 'భేదేనావస్థి తిర్యేషాం సా సంసృష్టి రుదాహృతా' ఇతి లక్షణాత్ ॥

అ :- అథ మంగళ భూయస్త్వ సిద్ధ్యా ఏవ శ్లోకద్వయేన స్వస్మిన్ లక్ష్మీ కటాక్ష ప్రార్థనేన ఆశీర్వాద మంగళ మాచరతి ।

శ్లో ॥ అనుకల తను కాణ్డాలిఙ్గ నారమ్భ శుమ్భత్
ప్రతిదిశ భుజశాఖ శ్రీసఖానోకహర్ధిః ।
స్తన నయనగుళుచ్ఛ స్ఫారపుష్ప ద్విరేఫా
రచయతు మయి లక్ష్మీ కల్పవల్లీ కటాక్షాన్ ॥ 3

అ :- అను.. హర్ధిః, అనుకల= అనుక్షణము, తనుకాండ= కాండము వంటి శరీరముతో, ఆలింగన ఆరంభ= ఆలింగన ప్రయత్నము చేత, శుంభత్= ప్రకాశించు చున్న, ప్రతిదిశ= అన్ని దిక్కులకు వ్యాపించిన, భుజశాఖ= శాఖలవంటి భుజములు కల, శ్రీసఖ అనోకహ= కల్పవృక్షమగు విష్ణువుయొక్క, ఋద్ధిః= ఐశ్వర్యము కలదియు, స్తన .. ద్విరేఫా, స్తననయన= స్తనములు నేత్రములు అనెడి, గుళుచ్ఛ= గుచ్ఛములు, స్ఫారపుష్ప= వికసించినపుష్పములు, ద్విరేఫా= తుమ్మెదలు కలిగినట్టిదియునగు, లక్ష్మీకల్పవల్లీ= కల్పలతవంటి లక్ష్మీదేవి, మయి= నాయందు, కటాక్షాన్= కరుణా దృష్టి లను, రచయతు= ప్రసరింప చేయుగాక

తా :- ఎల్లప్పుడు శ్రీమహావిష్ణువు అనెడి వృక్షమునే ఆశ్రయించి, స్తన నేత్రాద్యవయవ సౌందర్యముచే, పూలగుత్తుల పుష్పముల తుమ్మెదల సౌందర్యముచే నందమగు కల్పలతతో సమానమైన, లక్ష్మీదేవి తన కరుణా కటాక్ష వీక్షణముతో నన్ను అనుగ్రహించునుగాక.

వి:- ఈ శ్లోకమున ఆశీర్వాద రూపమైన మంగళము చేయబడినది. ఇచట లక్ష్మి కల్పలతతో పోల్చబడినది. కల్పలత కోరినవాని నన్నింటిని ఇచ్చును. అట్లే లక్ష్మీదేవి కూడ కోరిన కోరికలన్నిటి నిచ్చును. కల్పలత కల్పవృక్షము నల్లుకొని ప్రకాశింప చేయును. లక్ష్మీదేవి కల్పవృక్షమువంటి శ్రీమహావిష్ణువు నాలింగనము చేసికొని (వక్షః స్థలమున నుండి) ప్రకాశింప చేయును. 'విష్ణోర్వక్షః స్థలాలయే' (విష్ణువుయొక్క వక్షఃస్థలమే నివాసముగా గలదానా) అనియు, 'శ్రియమున్నిద్ర పద్మాక్షీం విష్ణు వక్షః స్థలస్థితాం' (వికసించిన పద్మము వంటి నేత్రములు కలది, విష్ణువు యొక్క వక్షఃస్థలమున నున్నది) అనియు శ్రీస్తుతి-(విష్ణుపురాణము) మరియు ఇచట విష్ణుమూర్తియొక్క నాలుగు భుజములు నాలుగు దిక్కులకు వ్యాపించిన శాఖలుగా చెప్పబడినవి. దీని వలన భుజములకు ఆయతత్వము (అంతటను వ్యాపించియుండుట) సూచింపబడినది. 'శ్రీసఖ' శబ్దము ఇద్దరి యొక్క అన్యోన్య తను నియత సాహచర్యమును సూచించుచున్నది. లక్ష్మియొక్క శరీరమునందు కాండత్వారోపము ఆమె శరీరమునందలి ఋజుత్వమును తెలుపుచున్నది.

కల్పలతతో సమానమైన లక్ష్మి యొక్క ఆలింగమువలన ప్రకాశించునది వృక్షముతో సమానమైన విష్ణువుయొక్క ఐశ్వర్యము. ఇచట ఋద్ధి పదముచేత జ్ఞానము, శక్తి, మొదలగు ఆత్మగుణములును, ఔజ్జ్వల్యము, సౌగంధ్యము సౌందర్యము, సౌకుమార్యము మొదలైన శరీర గుణము లును చెప్పబడుచున్నవి. విష్ణువునకు వృక్షముతో ఉపమానము శ్రుతి ప్రమాణసిద్ధము. వృక్ష ఇవ స్తబ్ధోదివి తిష్ఠత్యేకః అను శ్రుతి విష్ణువునకు లక్ష్మియొక్క ఆలింగనము వలన వచ్చిన ఆనందాతిరేకమువలన వచ్చినదే స్తబ్ధత్వము. ఇది వృక్షమునకు కూడ సమానము. లత యొక్క ఆలింగనము అచట కారణము.'వాసుదేవ తరుచ్ఛాయా నాతిశీతా నఘర్మదా' (అతి శీతలము, అత్యుష్ణమును కానిది వాసుదేవుడను వృక్షము యొక్కచ్ఛాయ) అనెడి స్మృతికూడ ఇక్కడ ప్రమాణము. సంసారమనెడి మార్గము లో ప్రయాణము చేసి అలసిన సంసారులను బాటసారులకు ఈ వాసుదేవు డను వృక్షము యొక్క నీడయే ఆశ్రయమునకు యోగ్యమైనది. కాబట్టి మోక్ష మిచ్చునది జనార్దనుడు. ఇప్పించునది లక్ష్మీదేవి. ఈ విధముగా ఆమెయొక్క స్వాధీన పతికాత్వము, పారతంత్ర్యముకూడ వ్యక్తమగుచున్నది. ఇక 'లక్ష్మీకల్పవల్లికి' స్తనములే పూలగుత్తులు. నేత్రములే వికసించిన పుష్పములు. కనుపాపలే తుమ్మెదలు. ఈ విధముగా స్తనసౌందర్యము, నేత్రవైశాల్య వికాసములు, తారక (కనుపాప)ల స్నిగ్ధత్వ నైల్యములతోపాటు ఆమెయొక్క సర్వాంగ సౌందర్యముకూడ వ్యక్తమగుచున్నది.

శ్లో ॥ యస్యాః కటాక్ష వీక్షా క్షణ లక్షం లక్షితా మహేశాస్స్యుః ।
శ్రీరంగరాజమహిషీ సామామపి వీక్షతాం లక్ష్మీః ॥

(ఏ లక్ష్మియొక్క కరుణా కటాక్ష వీక్షణములు సర్వసంపత్ప్రదాయకములో ఆ లక్ష్మి నన్నుకూడ అనుగ్రహించునుగాక) అనెడి శ్రీవత్సాంక మిశ్రుల వాక్యమును

'కాత్వన్యాత్వామృతే దేవి సర్వయజ్ఞమయం వపుః।
అధ్యాస్తే దేవదేవస్య యోగిచింత్యం గదాభృతః॥'

(ఓ లక్ష్మీదేవి! సర్వయజ్ఞమయ మైనట్టిదియు, యోగులచేత ధ్యానింపబడు చున్నట్టిదియు అయిన దేవదేవుడైన శ్రీమహావిష్ణువుయొక్క శరీరమును అధిష్ఠించినది నీవుకాక మరెవ్వరు?) అనెడి శ్రీస్తుతియు ఇచట అనుసంధేయములు.

సంస్కృత వ్యాఖ్య:- అనుకలేతి॥ అనుకలం అనుక్షణం, ఇదం శుంభదితి ప్రకాశనే అన్వేతి। తనుఃకాండ ఇవ తనుకాండః। కాండో దండః। 'కాండోఽస్త్రీ దండబాణార్వ వర్గావసరవారిషు॥ ఇత్యమరః॥ తస్య తను కాండస్యాలింగనారంభేణ తనుకాండేనాలింగ నారంభేవా శుంభంతీ ప్రకాశమానా। దిశాసు దిశాసు ప్రతిదిశమ్। 'అవ్యయం విభక్తి' తి సప్తమ్యర్థేఽవ్యయీభావః॥ సర్వాసు దిశాస్వీత్యర్థః। భుజాః శాఖాఇవ భుజశాఖాః॥ ప్రతిదిశం భుజశాఖాయస్య సతథోక్తః॥ శ్రియస్సఖా శ్రీసఖః॥ 'రాజాహస్సఖిభ్యష్టచ్॥ ఇతిటచ్ ప్రత్యయాన్త తయా శ్రీసఖ శబ్దోఽకారాన్తః॥ శ్రీ సఖః అనోకహ ఇవ శ్రీసఖానోకహః। ప్రతిదిశ భుజశాఖశ్చాసౌ శ్రీసఖానోకహశ్చ స తథోక్తః॥ తస్య ఋద్ధిః జ్ఞాన శక్త్యాదీనామాత్మ గుణానాం, ఔజ్జ్వల్య సౌన్దర్య, సౌగంధ్య, సౌకుమార్యాదీనాం విగ్రహగుణానాంచ సంపత్। అనుకల తనుకాండాలింగనారంభ శుంభంతీ ప్రతిదిశ భుజశాఖ శ్రీసఖానోకహర్ధిః యస్యాస్సేతి బహువ్రీహిః॥ స్వాలింగనారంభ ప్రతికల ప్రకాశమాన భగవత్స్వరూప రూపగుణ సమృద్ధి రిత్యర్థః॥ లక్ష్మీతనోః కాండౌపమ్యా దార్ఢ్యం సూచితమ్ ప్రతిదిశ శబ్దేన భగవద్భుజేషు చతుష్ట్వమ్, భుజాః శాఖాఇవేత్యనేన భుజానాం శాఖౌపమ్యాదాయతత్వం సూచితమ్। శ్రీ సఖ ఇత్యనేన సర్వస్మాత్ పరత్వమ్, అనోకహ ఇత్యనేన శ్రీ తనుకాండాలింగన సుఖజనితం వైవశ్యంచ ద్యోతితమ్। భగవతః శ్రీసఖ ఇతిరూఢ్యా శ్రియో భగవత్ స్వరూప నిరూపకత్వేనచ ప్రయోగః॥ అనోకహ ఇతి భగవతః ఆనంద నిర్భరత్వేన స్తబ్ధతయా అవస్థానాత్ వృక్షౌపమ్యమ్। 'వృక్ష ఇవస్తబ్ధోదివి తిష్ఠత్యేకః' ఇతిశ్రుతేః॥ భవాధ్వశ్రాన్త విశ్రాన్తి పదత్వేనవా వృక్షౌపమ్యమ్। 'వాసుదేవతరుచ్ఛాయా నాతిశీతా నఘర్మదా' ఇతి స్మృతేః॥ ఏవం లక్ష్మ్యాః విగ్రహ సౌన్దర్యం స్వాధీనపతి కాత్వం చోక్తమ్ ।అథావయవ సౌందర్య మాహ- స్తననయనేతి॥ స్తనౌచ నయనేచ స్తననయనం గులుచ్ఛౌగుచ్ఛౌ, స్ఫారపుష్ప యో ర్వికచ పుష్పయోః ద్విరేఫౌ భ్రమరౌ స్ఫారపుష్ప ద్విరేఫౌ, గులుచ్ఛౌచ స్ఫారపుష్ప ద్విరేఫౌచ గులుచ్ఛ స్ఫారపుష్ప ద్విరేఫం స్తననయనం గులుచ్ఛస్ఫారపుష్ప ద్విరేఫమివ యస్యాస్సా తథోక్తా। స్తనయోః గులుచ్ఛోపమ్యేన సౌందర్యమ్। నయనయోః స్ఫార

పుష్పోపమ్యేన వికాసో వైపుల్యంచ గమ్యతే। కనీనికయోః ద్విరేఫోపమ్యేన నైల్యం స్నిగ్ధతే ద్యోతితే లక్ష్మీ కల్పవల్లీవ లక్ష్మీ కల్పవల్లీ । పుష్పాది తుల్యావయవ యోగేన, సర్వాభీష్ట ప్రదత్వేనచ లక్ష్మ్యాః కల్పవల్ల్యోపమ్యమ్। మయి స్తుత్యుద్యతే। కటాక్షాన్ రచయతు। మాం కటాక్షలక్ష్యం కరోత్విత్యర్థః। అత్ర ఇవేత్యుపమావాచకప్రయోగా ద్వాచక లుప్తోప మాలంకారః॥ నన్వత్ర తనౌ కాండత్వరూపణం, తదాలింగనారంభశోభిషు శ్రీసఖ. భుజేషు నానా దిగ్వ్యాపి శాఖాత్వరూపణం, తద్వతి శ్రీసఖే వృక్షత్వరూపణం, స్తనయో ర్గులుచ్ఛత్వ రూపణం, సతారకనయనయోః సభ్రమరవికచ పుష్పత్వ రూపణం, లక్ష్మ్యాం కల్పవల్లీత్వరూపణంచేతి - సావయవరూపకమేవాలంకారోఽస్తు స్ఫుటత్వా చ్చారు తాతిశయావహత్వాచ్చేతిచేత్ - న। అర్థబాధేస్ఫుటత్వ చారుతాతిశ యావహ త్వయో రకించిత్కరత్వాత్। లక్ష్మీకల్పవల్లీ కటాక్షాన్ రచయత్విత్యత్ర లక్ష్మ్యాం కల్పవల్లీత్వ రూపణే కల్పవల్ల్యాః కటాక్ష రచనానుపపత్తేః । నహి లక్ష్మ్యా ఇవ కల్పవల్ల్యాః కటాక్షా స్సంభవన్తి, స్థావర జాతీయత్వాత్ । నచ కల్పవల్ల్యాః సర్వఫల ప్రదత్వేన కటాక్ష రచనమపి యుజ్యత ఇతి వాచ్యమ్ । విచిత్ర వసనాభరణాద్యపేక్షితప్రదత్వేఽపి తస్యాః కటాక్ష సద్భావేమానాభావాదితిదిక్ । న చ తదుపపత్త్యై పరిణామ ఏవాత్రాలంకారో ఽస్త్వితి వాచ్యమ్ । తనుకాండేత్యాది సర్వవిశేషణ వైయర్థ్య ప్రసంగాత్ । లక్ష్మీకల్పవల్లీతి విశేష్యమాత్రే కటాక్షరచనౌచిత్యాయ పరిణామప్రాప్తేః । తస్మాత్ వాచక లుప్తోప మైవాలంకార ఇతి తత్త్వమ్ ॥

అ:- భగవతః స్థావర జంగమ తరతమభావసృష్టినియామక భ్రూవిక్షేపా, శ్రుతి శిరసామపి పరతత్త్వ సంశయనివర్తక పాదరాగా, స్వభోగోపక్రమ లీలాత్వీకృత భగవ ద్వైశ్వరూప్యవిభవా లక్ష్మీః సుధాతరంగాంతరంగైః కటాక్షైః అస్మానభిషించతు ఇత్యాశాస్తే।

శ్లో ॥ యద్ భ్రూభఙ్గాః ప్రమాణం స్థిర చర రచనా తారతమ్యే మురారేః
వేదాన్తా స్తత్త్వచిన్తా మ్మురభిదురసి యత్పాదచిహ్నై స్తరన్తి ।
భోగోపోద్ఘాత కేళీ చులుకిత భగవద్వైశ్వరూప్యానుభావా
సా న శ్శ్రీ రాస్తృణీతా మమృతలహరిధీ లఙ్ఘనీయైః కటాక్షైః ॥ ౪

అ:- మురారేః= మురవైరియైన విష్ణువుయొక్క, స్థిరచర రచనా తారతమ్యే= స్థావర జంగమాత్మకమైన సృష్టియొక్క ఉచ్చనీచభావమునందు, యద్ భ్రూభంగాః= ఏ లక్ష్మియొక్క భ్రూవిక్షేపములు, ప్రమాణమ్= ప్రమాణమో, వేదాంతాః= ఉపనిషత్తులు తత్త్వచింతామ్= పరతత్త్వవిషయక సందేహమును, మురభిద్+ ఉరసి= విష్ణువు యొక్క వక్షస్థలమునందలి, యత్ పాదచిహ్నైః= ఏ లక్ష్మి యొక్క పాదాంకములతో, తరన్తి= నివృత్తిచేసికొనుచున్నవో, భోగో... భావా, భోగోపోద్ఘాతకేళీ= విష్ణువు యొక్క సకల

కల్యాణ గుణానుభవోపక్రమ మనెడి లీలచేత, చుళుకిత=అల్పముగా చేయబడిన, భగవత్=శ్రీమహావిష్ణువుయొక్క, వైశ్వరూప్యానుభావా= విశ్వరూపము యొక్క మాహాత్మ్యము కలదియో, సాశ్రీః= ఆలక్ష్మి, అమృతలహరిధీ లంఘనీయైః= అమృత ప్రవాహబుద్ధిని అతిక్రమించిన, కటాక్షైః=కటాక్షములతో, నః=మనలను, ఆస్నుణీతామ్=అభిషేకించుగాక, (మన యందు కరుణాకటాక్ష ప్రసరణము చేయు గాక).

తా :- బ్రహ్మసృష్టికి వేదములు ప్రమాణములైనట్లుగా, విష్ణువు యొక్క చరాచర తారతమ్యభావప్రతిపాదికమ్మైన సృష్టికి ఈ లక్ష్మియొక్క భ్రూ విక్షేపములే ప్రమాణము లగు చున్నవి. పరతత్త్వము ఎవరు? బ్రహ్మయా? శివుడా? విష్ణువా? అను సందేహము వచ్చినపుడు ఉపనిషత్తులచేతగాని, వేదాంతులచేతగాని విష్ణువుయొక్క వక్షస్థలము నందు లక్ష్మియొక్క పాదచిహ్నముల కారణముగా విష్ణువే పరతత్త్వమని నిర్ణయము చేయబడినది. తనయొక్క అనుభవములో తక్కువైనదిగా చేయబడిన విష్ణుమూర్తి యొక్క విశ్వరూప మాహాత్మ్యము కలది, (విష్ణువు యొక్క విశ్వరూపమును మించిన రూపము మాహాత్మ్యము కలది.) అట్టి లక్ష్మీదేవి అమృత ప్రవాహమును మించిన తన కటాక్షములను మనపై ప్రసరింపచేయునుగాక.

వి :- 1) లక్ష్మీదేవియొక్క భ్రూభంగము (కనుబొమల ఉచ్చ నీచభావము- అనగా పైకి క్రిందకు కదలుట) విష్ణువుయొక్క స్థావర జంగమాత్మకమైన సృష్టియొక్క తారతమ్యములో అనగా ఉచ్చ నీచ భావములో కారణము. అదేప్రమాణము. ఆమె భ్రూభంగమునందలి తారతమ్యమును చూచియే విష్ణువు ఈసృష్టిని చేయుచున్నాడని యర్థము. ఎట్లనగా స్థావరసృష్టిలో తారతమ్యము- వృక్షములలో ఫలవృక్షములకు ఉచ్చత్వము, కంటక వృక్షములకు నీచత్వము. ఇట్లే పర్వతాదుల విషయమునకూడ. ఇక జంగమసృష్టియందు దేవతల ఉచ్చత్వము, మానవుల నీచత్వము. మానవుల యందు కూడ ఉచ్చనీచభావము, చాతుర్వర్ణ్యమున పరస్పరరోచ్చనీచ భావము మరియు ధనిక దరిద్రాదిభేదములు. అట్లే మానవులకు ఉచ్చత్వము పశు పక్ష్యాదులకు నీచత్వము. వానిలోకూడ పశువులలో సింహగజాదుల ఉచ్చత్వము గార్ధభ శున కాదుల నీచత్వము. పక్షులలోకూడ హంసశుకాదుల ఉచ్చత్వము, కాక గృధ్రాదుల నీచత్వము. ఇవి తారతమ్యరూపమైన సృష్టికి నిదర్శనములు. ఈ తారతమ్యము వారివారి కర్మల ననుసరించి వచ్చినదేయైనను ఆ కర్మకు ప్రేరకములు లక్ష్మీదేవి భ్రూభంగములని భావము. అందువలననే ఇచట 'మురారి' పదము సార్థకమగు చున్నది. మురారి పదమునకు మురుడను రాక్షసుని చంపినవాడని అర్థము. అనగా రాక్షస సంహారమున లక్ష్మియొక్క ఆవశ్యకత ఎక్కువగా లేక పోయినను, సృష్టి

కార్యమున ఆమె శ్రీహరికి తోడుగా లేనిదే ఆ కార్యక్రమము జరుగు నవకాశము లేదను భావము మనసున నుంచికొనియే ఈ పదము ప్రయోగింప బడినది. 2) బ్రహ్మ, రుద్ర, అచ్యుతులలో పరతత్త్వము ఎవరు? అను సందేహము వచ్చినప్పుడు అందరకు సమానత్వమును ప్రతిపాదించు 'హిరణ్యగర్భ స్సమవర్త తాగ్రే' (మొదట బ్రహ్మ ఒక్కడే ఉండెను); 'విశ్వాధికో రుద్రో మహర్షిః'(రుద్రుడొక్కడే విశ్వాధికుడు) 'ఏకో హవై నారాయణ ఆసీత్' (నారాయణు డొక్కడే మొదట ఉండెను), అను శ్రుతులున్నప్పటికిని, 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' 'శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్' అను వాక్యముల వలన పత్నియై వక్షః స్థలమున నున్న లక్ష్మియొక్క చరణలాక్షా చిహ్నములచేత నారాయణుడే పరతత్త్వము అని నిర్ణయింప బడినది... (అంతే గాక 'లక్ష్మి నాట్యమాడుటకు తగిన విశాలమైన వక్షస్థలము కలవాడు. శ్రీమహావిష్ణువు' అను విషయముకూడ నిందు ప్రతిపాదింపబడినది). ఈ వాక్యమువలన లక్ష్మికి వేదాంతవేద్యత్వము ప్రతిపాదిత మగుటయేగాక పరతత్త్వ నిర్ణయము చేయునది లక్ష్మీతత్త్వమే అని తెలుచున్నది. 'లక్ష్మీచరణ లాక్షాంక సాక్షి శ్రీవత్స వక్షసే' అను శ్లోకముకూడ దీనినే సమర్థించుచున్నది. 3) మరియు 'సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్' అని శ్రీమహావిష్ణువు యొుక్క విశ్వరూపత్వము వర్ణించబడినది. లక్ష్మికి కూడ 'దశశత పాణిపాద' అను (55వ) శ్లోకమున విశ్వ రూపత్వము వర్ణితము. 'విష్ణోర్దేహాను రూపాం వై కరోత్యేషాత్మన స్తనుమ్' (విష్ణువు యొుక్క దేహమునకు అనురూపముగా ఆమె తన శరీరమును సృజించును.) అని శ్రీస్తుతిలో కూడ చెప్పబడినది. అట్టి తనయొుక్క స్వరూపముతో విష్ణువుయొుక్క విశ్వ రూపమునుకూడ తక్కువ చేయునట్టిది. 'స్వవైశ్వ రూప్యేణ సదానుభూతయా ప్యపూర్వవ ద్విస్మయ మాదధానయా' (తనయొుక్క విశ్వరూపముతో ఆమెయొుక్క సౌందర్యము నారాధించినను అపూర్వమగుదానివలె విస్మయము నొందించుచున్నది లేదా కలిగించు చున్నది.) అను శ్రీయామునాచార్యుల వాక్యముకూడ ఈ విషయము నే స్పష్టము చేయుచున్నది. ఇందుకూడ లక్ష్మియొుక్క ఆధిక్యము వర్ణింపబడినది. 4) ఈ మూడు పాదములలోను కూడ లక్ష్మియొుక్క పరత్వము సూచింపబడినది. అట్టి లక్ష్మి తన కటాక్షములతో మనలను అభిషేకించునుగాక-ఎటువంటివి కటాక్షములు? అమృత ప్రవాహమును తిరస్కరించునట్టివి. అమృతము అమరత్వమును సంపాదించునది. ఈ కటాక్షములు ఆ అమృతమును తిరస్కరించు నట్టివి అనుటలో వాని యందు కూడ అమరత్వ సంపాదకత్వము సిద్ధించినది మరియు అభిషేకమనునది కటాక్షములచేత కంటె అమృతముచేతనే సాధ్యము. కావున ఇచ్చట కటాక్షములు అమృత ప్రవాహముగా మారి అభిషేకించుటలో ఉపయోగపడుచున్నవి. మొత్తము

మీద ఆమె తన కటాక్షములను మనపై ప్రసరింపచేసి మనకు అమృత తరంగముల యందలి ఆశను ఆసక్తిని పోగొట్టుచున్నది అనునది ఫలితమైన అర్థము. 5) కావున సారాంశముగా అమృతమువలె చల్లనివైన సర్వేంద్రియాహ్లాదన సమర్థము లైన సర్వశక్తి యుతములైన కటాక్షములుకలది లక్ష్మీదేవి అని తేలినది. ఆమె యే భగవన్ని రూపక ప్రమాణమని చెప్పుటవలన ఆమె యొక్క పరత్వ సౌలభ్యములతో పాటు భూనీళాది దేవేరులకంటె యా మెయందు వైశిష్ట్యమును చెప్పబడినది.

సంస్కృత వ్యాఖ్య :- యద్ భ్రూ భంగా ఇతి। మురారేః మురద్విషః శ్రీరంగరాజస్య స్థిరచరరచనా తారతమ్యే స్థావరజంగమ సృష్టినీచోచ్చభావే స్థావర సృష్టౌ నీచోచ్చ భావః- కల్పవృక్ష చందనరసాలాశ్వత్థ నారికేళాద్యపేక్షయా స్నుహి ఖర్జురార్క కంటకి ద్రుమాణాం నీచభావః, తత్ ప్రతియోగినా ముక్తానాంకల్పవృక్షాదీనాం ఉచ్చభావః॥ చరసృష్టి నీచోచ్చభావస్తు దేవాపేక్షయా మనుష్యాణాం చమనుష్యేషుచ బ్రాహ్మణా పేక్షయా క్షత్రియాణాం, తదపేక్షయా వైశ్యానాం తదపేక్షయా శూద్రాదీనాంచ నీచభావః, తదపేక్షయా తిరశ్చాం, తేష్వపి హంస గరుడ శుక శారికా మయూర కోకిలాద్యపేక్షయా కంక గృధ్ర కాక ఘూకాదీనాం నీచభావః తత్ ప్రతి యోగినా ముక్తానాం దేవాదీనా ముచ్చభావశ్చేతి బోధ్యమ్, తత్ర యస్యాః లక్ష్మ్యాః భ్రూ భంగాః భ్రూవిక్షేపాః ప్రమాణం నియామకాః శ్రీభ్రూ భంగ తారతమ్యం దృష్ట్వా హరిః స్థావరజంగమాత్మకం జగత్ తరతమ భావేన సృజతీతి భావః। శ్రీభ్రూ భంగ తారతమ్యేచ తత్తత్కర్మ తారతమ్యం హేతురితి శ్రియోవైషమ్య నైర్ఘృణ్యప్రసంగః । భ్రూ భంగాః ప్రమాణమిత్యనేన ధాతుః జగత్ సృష్టౌ యథా వేదాః ప్రమాణం తథా భగవతోఽపి స్థిర చర రచనాతారతమ్యే శ్రీభ్రూ భంగాః ప్రమాణమితిభావః॥ వేదాంతాః ఉపనిషదః తత్త్వచిన్తాం బ్రహ్మా శివో విష్ణుర్వా పరతత్త్వ మితిసంశయం మురభిదురసి శ్రీరంగేశవక్షసి యత్పాదచిహ్నైః యస్యాః శ్రియః పాదచిహ్నైః పాదాలక్తకాంకైః, తరన్తి నిరతిశయ దీప్త్యాపాదక శ్రీపదముద్రిత శ్రీరంగరాజ ఏవ పరతత్త్వమితి నిర్ణయేన నివృత్తసంశయా భవన్తి। అత్ర వేదాంతశబ్దేన చైతన్యయోగినః తదధిష్ఠాతృపురుషాః ఉచ్యన్తే। తేషామేవ తత్త్వచింతాయాః దేవతాంతరాసంభవ న్మురభిద్వక్షోనిష్ఠ లక్ష్మీచరణ లాక్షా చిహ్న దర్శనస్య తత స్తదంకితో మురభిదేవ పరతత్త్వ మితి నివృత్తసంశయత్వస్య చోపపత్తేః। 'అతశ్చ వేదాన్తపురుషా వేదేషు' నకిరిన్ద్ర త్వదుత్తరః॥ 'అగ్నిరగ్రే ప్రథమో దేవతానామ్॥ ఏక ఏవ రుద్రో నద్వితీయా యతస్థేః విశ్వాధికో రుద్రో మహర్షిః, హిరణ్యగర్భ స్సమవర్త తాగ్రే॥ ఇతి నానాదేవతా పారమ్య ప్రతిపాదనాత్। 'ఏకో హ వై నారాయణ అసీత్' అగ్నిరవమో దేవతానాం విష్ణుః పరమః' ఇతి తత్సాధారణ్యేన విష్ణుపారమ్యస్యాపి ప్రతిపాదనాత్। ఉక్తేష్వేతేషు కః పరతత్త్వ మితి సంశయేసతి స్వయం నిర్ణేతు మసమర్థాః

శ్రీరంగధామని మురభిదం శ్రీరంగరాజమూసేవ్య తదురస్యసాధారణ శ్రీపదలాక్షా లాంఛనదర్శనేన అయమేవ పరతత్త్వమితి నిశ్చిన్వతే ।ఇతి భగవతః శ్రీపరాశరభట్టార్యస్య తాత్పర్యమ్। యద్వా వేదాంతాః ఉపనిషదః తత్త్వచింతామ్ 'నకిరిన్ద్రత్వదుత్తరః' ఇత్యాద్యుక్తరీత్యా స్వైర్నానాదేవపారమ్య ప్రతిపాదనేషు కః పరతత్త్వమితి పరతత్త్వవిషయే శ్రోతృ సంశయజనన నిమిత్తాం చింతాం ఖేదం మురభిదురసి భగవద్వక్షసి యత్పాద చిహ్నై రిత్యనేన లక్ష్మీసంబంధో లక్ష్యతే । తరన్తి అతివర్తన్తే ప్రాశస్త్య ప్రతిపాదన సాధారణ్యేఽపి కారణవాక్యేషు। 'ఏకోహ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మా నేశానః' ఇతీతర నిషేధపూర్వకం భగవతః ప్రళయసమయావస్థితిం ప్రతిపాద్యా 'అథ పురుషో హ వై నారాయణోఽకామయత, ప్రజాస్సృజేయతి' ఇత్యాదినా తస్యపురుష శబ్ద వాచ్యతాం జగత్ సృష్ట్యాది కర్తృతాంచ ప్రతిపాద్య 'సహస్రశీర్షాపురుషః'.. ఇత్యారభ్య 'తస్యధీరాః పరిజానన్తి యోనిమ్' ఇత్యనేన వాక్యజాతేన నారాయణ పురుష శబ్ద వాచ్యస్య సహస్రశిరః పాదాదిమత్త్వ, విశ్వశరీరత్వ, మోక్షప్రదత్వ, మహామహిమత్త్వ, సర్వతోజ్యాయస్త్వ, సర్వభూతైక పాదత్వ, త్రిపాద్విభూతిమత్త్వ విశ్వాక్రమణకర్తృత్వ । చరాచరోత్పాదక నానావయవత్వ, తమః పారవర్తిత్వ, సర్వ నామరూప వ్యాకర్తృత్వ, కర్మకృత జన్మరహితత్వ, స్వేచ్ఛాకృతాఽనేకావతారత్వ, తదవతార హేత్వపార కారుణికత్వాని ప్రతిపాద్య, ఏవం విభవో నారాయణశబ్దవా చ్యశ్చ 'క' ఇత్యపేక్షాయాం 'హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ' శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్' ఇతి తస్య లక్ష్మీపతిత్వ ప్రతిపాదనాత్ లక్ష్మీపతిరేవ నారాయణ పురుష శబ్దవాచ్యః పూర్వోక్త సర్వవైభవయుక్తః పరతత్త్వంచేతి నిశ్చినియు స్తతో నాస్మాభి శ్చింతాకార్యా ఇతి ఖేదం ముంచంతీత్యర్థః। తరన్తీత్యనేన మాతాపితృ సహస్రేభ్యో వత్సలతరతయా వేదాన్తానాం తత్ ఖేదస్య దుస్తరత్వం సూచితమ్ అనేన లక్ష్మ్యా వేదాన్త వేద్యత్వం సూచితమ్। భోగోపోద్ఘాతకేళీ చుళుకిత భగవద్వైశ్వరూప్యానుభావా భోగస్య శ్రీవిషయస్య భగవత్కృత స్యాలింగన చుంబనాలోకన శ్లాఘనాది రూపోపోద్ఘాత ఉపక్రమః తస్మిన్ కేల్యాలీలయా చులుకితః ప్రస్తుతిపీతోఽల్పీకృతోవా భగవద్వైశ్వరూప్యస్య విశ్వశరీరత్వస్య అనంత భుజవక్త్రనేత్ర శీర్షత్వరూపస్య అనుభావో మాహాత్మ్యం యస్యా స్సా తథోక్తా స్వాలింగన చుంబనాద్యుపక్రమ కేల్యపర్యాప్త భగవద్విశ్వవిగ్రహ విభవేత్యర్థః। తదుక్తం యామునాచార్యైః 'స్వవైశ్వరూప్యేణ సదానుభూతయాప్యపూర్వవ ద్విస్మయ మాదధానయా' ఇతి వక్ష్యతిచాయం దశశత పాణిపాదేత్యాదినా॥ యద్వా భోగస్య శ్రీకృత స్వభగవత్ స్వరూప రూప గుణ విభూత్యనుభవస్య ఉపోద్ఘాతకేళ్యాదేః పూర్వవదర్థః। పూర్వ యోజనాయాం స్వానుభవ సాధనత్వాపర్యాప్త భగవద్విశ్వవిగ్రహ విభవత్వమ్। ద్వితీయ యోజనాయాం స్వానుభవ విషయాపర్యాప్త భగద్విశ్వవిగ్రహ విభవత్వం

చార్థ ఇతి భేదః॥ పూర్వ యోజనాయాం లక్ష్మ్యాః సౌందర్యాతిశయః సూచితః॥ ద్వితీయ యోజనాయాం తద్ జ్ఞానశక్తిచాతుర్యాది వైలక్షణ్యం సూచితమ్। సా పూర్వోక్త గుణవిశిష్టా భగవత్ స్వరూప నిరూపకత్వేన ప్రసిద్ధావా పాదత్రయేణాపి పరత్వముక్తమ్ । అథ సౌలభ్య మాహ స్వైతరైః శ్రీయత ఇతి శ్రీః॥ అమృతలహరిధీ లంఘనీయ్యైః అమృత లహరీ ధియా అమీ అమృతతరంగా ఇతి బుద్ధ్యా లంఘనీయ్యైః ప్రాప్యైః । లఘిః గత్యర్థత్వాత్। స్వేషు అమృతతరంగబుద్ధి జనకై రిత్యర్థః॥ యద్వా అమృతలహరిధీః అమృత తరంగ బుద్ధిః తదపేక్షయా లంఘనీయా త్యాజ్యా యైస్తైః ప్రయోజకైః సర్వేషా మితిశేషఃఅమృతతరంగేభ్యో ఽప్యతిమధుర తయా సర్వేషామమృతతరంగాశా నివర్తకై రిత్యర్థః। అపాంగైఃకటాక్షైః నఃఅస్మాన్ ఆస్నుణీతామ్ ఆచ్ఛాదయతు అభిషించతు ఇత్యర్థః ఆఙ్ పూర్వాత్ 'స్నుఞ్ ఆచ్ఛాదనే ఇత్యస్మాద్ధాతోః 'స్నా' ప్రత్యయే ' ఈహల్యఘోః' ఇతీత్వే లోడాత్మనేపద ప్రథమ పురుషైక వచనమ్ ॥

అ :- శ్లోకద్వయ ప్రార్థితప్రకారేణ లక్ష్మీకటాక్షామృత వీచివిశదీకృత విజ్ఞాన విషయీ కృత తత్స్వరూపరూపగుణ విభూతిః బ్రహ్మాద్యశక్యస్తవం తద్వైభవ వైపుల్యం స్వవాక్ ఫల్గుతాం చానుసంధాయ తత్ స్తుతిసాహస ప్రవృత్తస్య స్వస్యవాక్ ప్రశస్త్యై స్వస్తీతి సాభిప్రాయమాహ।

శ్లో ॥ యద్యావ త్తవ వైభవం తదుచితస్తోత్రాయ దూరేస్పృహా
స్తోతుం తే వయ మిత్యదశ్చ జగృహుః ప్రాఞ్చో విరిఞ్చ్యాదయః ।
అప్యేవం తవ దేవి వాఙ్మనసయో ర్భాషానభిజ్ఞం పదం
కావాచః ప్రయతామహే కవయితుం స్వస్తి ప్రశస్త్యైగిరామ్ ॥ ౫

అ:- హే దేవి= ఓ శ్రీరంగరాజ్యలక్ష్మీ, తవ=నీయొక్క, వైభవమ్= మాహాత్మ్యము, యత్=ఏదియో, యావత్=ఎంతమాత్రమో, తదుచిత స్తోత్రాయ= ఈ రెండురకముల స్తోత్రముకొరకైన, స్పృహా=కోరిక, దూరే=దూరముగా నున్నది (చాలనిది), ప్రాంచః=ప్రాచీనులైన, విరించ్యాదయఃచ=బ్రహ్మాదులున్ను, అదః= ఈ నీయొక్క వైభవమును, స్తోతుమ్=స్తోత్రము చేయుటకు, వయంతే=మేమెవరము? (శక్తిలేని వారము) ఇతి=అనుచునే, జగృహుః=వారిశక్తి ననుసరించి స్తుతించిరి. ఏవం అపి=అలాగున అయినప్పటికిని, వాఙ్మనసయోః=వాక్కు యొక్క మనస్సు యొక్క, భాషానభిజ్ఞమ్=భాషకు అగోచరమైన, తవ పదమ్=నీయొక్క స్వరూపమును, స్తోతుమ్=స్తుతించుటకు, కావాచః=దోషభూయిష్ఠములైన, అల్పములైన వాక్కులు కలవారమై, ప్రయతామహే=గొప్పప్రయత్నమును చేయు చున్నాము, గిరామ్ =మా వాక్కుల యొక్క, ప్రశస్త్యై=ప్రసిద్ధికొరకు, స్వస్తి=శుభమగు గాక.

తా :- ఓ లక్ష్మీదేవీ, నీ వైభవమెంతయో దానినంతటిని ప్రకాశింపజేయు

స్తుతిని రచింపవలయుననెడి అభిలాషయే తగనిది. ప్రాచీనులైన బ్రహ్మాదులే, నీ వైభవమును అవాఙ్మానసగోచరముగా తలచి చివరకు వారి శక్తిననుసరించి కొద్దిగా వివరించిరి. అట్టి నీ వైభవమును కుత్సితమైన వాక్కులుగల మేము చెప్పబూనుట సాహసమే అయినను ప్రకృష్టమైన ప్రయత్నముతో స్తోత్రమునకు పూనుకొంటిమి. మా వాక్కులకు శుభమగుగాక.

వి :- ఇచట ప్రాచీను లనువిశేషణము బ్రహ్మాదులు, అనంత జ్ఞాన సంపన్నులని చెప్పుచున్నది. అట్టి బ్రహ్మాదులకు ఆమె అర్థము కాలేదనియు, వారు చేసిన ప్రయత్నము ఆమెయొక్క వైభవములో చాలతక్కువ భాగమును చెప్పుచున్న దనియు సూచితము. ఆమెయొక్క 'అమితమైన' మాహాత్మ్యమును చెప్పుటకు బ్రహ్మాదుల 'మితప్రజ్ఞ' చాలలేదని భావము. అట్టి సందర్భమున తాము చెప్పుటకు పూనుకొనుట కేవలము సాహసమే అయినను శ్రీలక్ష్మీదేవి ప్రసాదించిన స్తోత్రమే కాబట్టి ఆ విధముగా తమ వాక్కులకు మంగళమగుగాక అనియు మంగళా శాసనము చేయుచున్నారు. 'నతే వర్ణయితుం శక్తా గుణాన్ జిహ్వాపి వేధసః' (నీ గుణములను వర్ణించుటకు బ్రహ్మయొక్క జిహ్వకుకూడ శక్తిలేదు) అని శ్రీస్తుతి. 'స్తోకప్రజ్ఞై రనవధి గుణా స్త్వాయసే సా కథం త్వమ్ (అంతులేని గుణములు కల నీవు మితప్రజ్ఞులమైన మాచేత ఎట్లు స్తోత్రము చేయబడుదువు? అని వేదాంత దేశికుల శ్రీస్తుతి.

యేవాచాం మనసాంచ దుర్గ్రహతయా ఖ్యాతాగుణా స్తావకాః
తానేవ ప్రతిసాంబుజిహ్వా ముదితా హైమామికా భారతీ ॥

(వాఙ్మనోఽగోచరములైన నీగుణములను వర్ణించుటకు నావాక్కు ప్రయత్నించు చున్నది.) అనియు.

'దేవి త్వన్మహిమావధి ర్నహరిణా నాపి త్వయా జ్ఞాయతే'( నీ యొక్క మహిమ ఎంతయో నీకును శ్రీహరికిని కూడ తెలియదు) అనియు శ్రీవత్సాంకమిశ్రుల వాక్యములు. 'యస్యా స్తే మహిమానమాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః నాలం మాతుం' (తన మహిమవలెనే నీ మహిమనుకూడ నీ వల్లభుడైన శ్రీహరికూడ తెలియ నేరడు) అని కాంతాస్తోత్రము. మొత్తముమీద ఈ శ్లోకసారాంశము 'బ్రహ్మ రుద్రేంద్రాది దేవతలకే గాక శ్రీహరికికూడ అందని స్వరూప రూపగుణ విభ వైశ్వర్యాదులు కలది శ్రీమహాలక్ష్మి' అనియేకాని శ్రీపరాశరులకు స్తుతించు శక్తిలేదని కాదు. అట్టి శక్తిలేనిచో స్తోత్రమునకే పూనుకొనరుగదా! అట్టి లక్ష్మిని స్తుతించుటకు సాహసించిన తమ వాక్కునకు మంగళమగుగాక యని సాభిప్రాయముగా చెప్పు చున్నారు.

సంస్కృత వ్యాఖ్య :- యద్వ్యావర్తపేతి హే దేవి! శ్రీరంగేశ్వరి తవ వైభవం యత్ యత్

స్వరూపం యావత్ యావత్పరిమాణం తదుచితస్తోత్రాయ తదుభయాను రూప స్తవనాయ 'క్రియార్థోపపద' ఇత్యాదినా చతుర్థీ। స్పృహా ఇచ్ఛా దూరే దూరత ఏవ, నసంభవతీత్యర్థః । ఇచ్ఛాజాతాపి విఫలైవ, నిరవధిక విభవస్తుతే రశక్యత్వాదిత్యర్థః। ఇచ్ఛాదూరే ఇత్యత్ర సంబంధ్యనిర్దేశాత్ సర్వేషా మితిగమ్యతే। నను మద్విభవస్య స్తోతు మశక్యత్వే విరించ్యాదయః కథం తుష్టువుః? ఇత్యత్రాహ స్తోతుం క ఇతి। ప్రాంచః ప్రాచీనాః నాద్యతనాః। తేన జ్ఞానశక్తి వైపుల్యం సూచితమ్। విరించిః బ్రహ్మ 'బ్రహ్మ బ్రహ్మవిదాం వరః' ఇతి ప్రసిద్ధ విభవః చతుర్ముఖ ఆదిర్యేషాం తే తథోక్తాః। ఆదిశబ్దేన శివ శతమఖాదయో గృహ్యన్తే। అదశ్చేత్యత్ర 'చ' శబ్దో భిన్నక్రమః విరించ్యాదయ శ్చే త్యర్థః। తేచ వయం మితప్రజ్ఞా ఇత్యర్థః। అదః ఇదం వైభవమ్। అదశ్శబ్దేన 'యతోవాచ' ఇతిశ్రుత్యుక్త వాఙ్మనసాగోచరత్వం సూచ్యతే। స్తోతుంకే కియచ్ఛక్తికా ఇతి ఇదం వచనం జగృహుః అవదన్, నతుష్టువురిత్యర్థః । యద్వా వయం స్తోతుం క ఇతి వచనమ్। అదశ్చ ఇదం వైభవంచ జగృహుః। స్తోతు మశక్యమితి వదన్త ఏవ తూష్ణీంభవితుమశక్తా వైభవం యథాశక్తి తుష్టువు రిత్యర్థః। తేనస్తుతా వసాకల్యం సూచితమ్। అప్యేవం ఏవమపి బ్రహ్మాద్యశక్య స్తవత్వేఽపి వాఙ్మనసయోః వాక్యచిత్తయోః ఉపనిషదామపీతి శేషః। వాఙ్మనసశబ్దో అకారాన్తః 'అచతురవిచతుర' ఇత్యాది సూత్రేణ నిపాతితః । భాషా భాషణమ్ । వాక్ చిత్తాభ్యాం పరిచ్ఛేదః । తదనభిజ్ఞం వాఙ్మనసా మగోచర మిత్యర్థః । యద్వా వాఙ్మనసయోర్భాషా వాఙ్మనసవాచకశబ్ద స్తదనభిజ్ఞం తద్వాచకశబ్దమేవ నజానాతి, కుతస్తే జానీయాత్ తద్గోచరత్వం దూరాపాస్త మితిభావః। తవపదం పద్యేత ఇతిపదం త్వత్ స్వరూపమ్ । కవయితుం వర్ణయితుం, కావాచః కుత్సితవాచః 'ఈషదర్థేచ' ఇతి 'కు' శబ్దస్య 'కా' దేశః। అనేన స్తుతి సామగ్రీ వైకల్యం సూచితమ్ । ప్రయతామహే ప్రకృష్టయత్నం కుర్మహే । అహో సాహసికత్వ మస్మాకమితి భావః। గిరాం స్తుతివచసాం ప్రశస్త్యై ప్రసిద్ధ్యై స్వస్తి మంగళం స్యాదితిశేషః। స్యాదితికాకుః । నస్యా దిత్యర్థః । అతిసాహసిక ప్రయత్నోఽయం నఫలతీతి హృదయమ్ స్తుతి ప్రయత్నస్య సాహసకృత్యత్వేఽపి శేషత్వ స్వరూపోచిత కించిత్కార రూపత్వాత్ వాక్ప్రసిద్ధ్యై స్వస్తి భవత్వితి ప్రార్థనాయాంవా తాత్పర్యమ్ ॥

అ:- బ్రహ్మాద్యశక్య స్తవత్వేఽపి శ్రియస్తద్గుణ విస్తారేణ స్తోతృత్వం స్వస్మిన్నేవ పర్యవస్యతీ త్యాహ।

శ్లో ॥ స్తోతారం తముశన్తి దేవి కవయో యో విస్తృణీతే గుణాన్
స్తోతవ్యస్య తతశ్చ తే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి ।
యస్మా దస్మ దమర్షణీయ ఫణితి స్వీకారత స్తే గుణాః
శాన్త్యౌదార్య దయాదయో భగవతి స్త్వాం ప్రస్నువీరన్ ప్రథామ్ ॥ ౬

అ :- భగవతి=గొప్ప మాహాత్మ్యముకలిగి పూజార్హత కలిగియున్న, దేవి= ఓ లక్ష్మీదేవీ, స్తోతవ్యస్య=స్తోత్రముచేయదగిన (ప్రభువు మొదలైన) వానియొక్క, గుణాన్=గుణములను, యః=ఎవడు, (ఏ కవి) విస్తృణీతే=విస్తరింపచేయుచున్నాడో, తమ్= ఆతనిని (ఆ కవిని), కవయః-కవులు, పండితులు, స్తోతారమ్-స్తోత్రముచేయు వానినిగా, ఉశన్తి=చెప్పుచున్నారు, తతః=అంధువలనను, చ=పూర్వ శ్లోకమున చెప్పిన కారణము వలనను, తే స్తుతిధురా=నిన్ను స్తోత్రముచేయు భారము, మయి+ ఏవ=నా యందు మాత్రమే, విశ్రామ్యతి=విశ్రమించుచున్నది, (నాపైననే పడినది) యస్మాత్= ఎందు వల్ల ననగా, అస్మ...కారతః, అస్మత్=నా యొక్క, అమర్షణీయ =సహింపరాని, (కర్ణకఠోరములైన) ఫణితి=వాక్యముల యొక్క, స్వీకారతః= స్వీకారమువలన, క్షాన్త్యౌ...దయః, క్షాన్తి=సహనము, ఔదార్య= ఔదార్యము, దయా=దయ, ఆదయః=(వాత్సల్యము) మొదలైన, తే గుణాః-నీయందు ప్రసిద్ధము లైన గుణములు, స్వామ్=తమతమయొక్క, ప్రథామ్=ప్రశస్తిని' (గుణత్వమును) ప్రస్నువీరన్=చాటుకొనగలవు, (సార్థకము చేసికొనగలవు)

తా :- ఓ భగవతీ, స్తోత్రముచేయదగిన వ్యక్తియొక్క గుణములను ఎవరు విస్తరింపచేయుదురో ఆతనినే 'స్తోత' గా చెప్పుదురు. కావున ఆ విధముగా నీగుణము లను విస్తరింపచేయుభారము నాపైనబడినది. ఎందువల్ల ననగా బ్రహ్మాదులు మధురము లైన వాక్కులుకలవారు కాబట్టి వారిస్తోత్రముద్వారా నీయొక్క సహనము మొదలగు గుణములు వ్యక్తము చేయబడలేదు. మరి నేనో, పరుషవాక్కులు కలవాడను కాబట్టి ఈ నావాక్కులవలన నీయొక్క సహనము, ఔదార్యము, దయ, వాత్సల్యము, మొదలగు గుణములయొక్క విస్తారము వ్యక్తమగుచున్నది.

వి:- బ్రహ్మాదులు స్తోత్రముచేయలేక వదలినను శ్రీపరాశరభట్టరు స్తోత్రము చేయుటకు పూనుకొనినారు. అట్లు పూనుకొనుట సాహసమేయగునని క్రిందటి శ్లోకములో చెప్పబడినప్పటికిని, లక్ష్మీదేవియొక్క సమస్త కళ్యాణగుణములను విస్తరింపచేయుటకు తామొక్కరే సమర్థులనియు ఆ భారము తమపైననే పడినదనియు చెప్పుకొనుచున్నారు. ఎందువల్లననగా బ్రహ్మాదులు మధురవాక్కులు కలవారు కావున వారి వాక్కులను వినుటలో అమెయొక్క గుణములు వ్యక్తములుకావు. కాని పరుష వాక్కులుకల తమస్తోత్రములను వినుటలో అమెయొక్క గుణములు వ్యక్తమగు చున్నవి. ఎట్లనగా- 1) తన వాక్కులయందలి దోషములను విని సహించుటవలన సహనము వ్యక్తమగుచున్నది. 2) యోగ్యత లేకపోయినను తనచే ఈ స్తోత్రము రచింపచేయుటవలన ఔదార్యము వ్యక్తమగుచున్నది. 3) స్తోత్రము చేయనీయనిచో బాధపడునట్టి తనచే ఏదోవిధముగ స్తోత్రముచేయించుటచే దయయు వ్యక్తమగు

చున్నది. 4) చెప్పుటలో దోషములున్నను గుణములుగా స్వీకరించుట అనెడి వాత్సల్యముకూడ వ్యక్తమగుచున్నది. ఈ విధముగా లక్ష్మి యొక్క గుణములను వ్యక్తముచేసి విస్తరింపచేయునది తమస్తోత్రమే అనియు, కావున తామే 'స్తోత' అనియు, ఈ ఘనత బ్రహ్మాదులకు దక్కలేదనియు, కావుననే లక్ష్మీదేవి యొక్క గుణములను వర్ణించుటకు పూనుకొన్నాననియు శ్రీపరాశరభట్టర్ తమ యర్హతను తెలుపుకొనుచున్నారు. ఈ శ్లోకమున 'భగవతి' దేవి అను సంబోధనలుకూడ ఆమె యొక్క సర్వగుణాకరత్వమును, పూజ్యత్వమును, మాహాత్మ్యమును చెప్పుచు సార్థకము లగుచున్నవి. శ్రీవత్సాంకమిశ్రుల (కూరేశుల) ఈ క్రింది శ్లోకము కూడ శ్రీపరాశరభట్టరుల భావమును సమర్థించుచున్నవి.

శ్లో॥ స్తోత్రం నామ కిమామనన్తి కవయో యద్యన్యదీయాన్ గుణాన్
అన్యత్రత్వసతోఽధిరోప్య ఫణితిః సాత్వర్హివంధ్యాత్వయి ।
సమ్యక్ సత్యగుణాభివర్ణన మథో బ్రూయుః కథం తాదృశీ
వాగ్వాచస్పతినాపి శక్యరచనా త్వత్సద్గుణార్ణోనిధౌ ॥

(లక్ష్మీదేవీ, ఇతరులయొక్క గుణములను, లేనివానిని మరియొకరియందు ఆరోపించి చేయునదే స్తోత్రమైనచో అది నీపట్ల వ్యర్థము. ఎందువల్లననగా నీయందు లేని గుణములులేవు కాబట్టి ఇక ఉన్నగుణములను ఉన్నట్లుగా వర్ణించుటయే స్తోత్రమైనచో నీ గుణములను వర్ణించుటకు బృహస్పతికూడ సమర్థుడుకాడు) అనియు,

'క్షోదీయానపి దుష్టబుద్ధిరపి నిస్స్నేహోఽప్యనీహోఽపి తే
కీర్తిం దేవి లిహన్నహం నచ బిభే మ్యజ్ఞో నజిహ్రేమిచ'

(అజ్ఞత, దుష్టబుద్ధిత్వము, నీచత్వము, నిస్స్నేహత్వము మొదలగు దుర్గుణములు కలవాడనైనను నేను నీకీర్తిని (గుణములను) వర్ణించుటకు భయపడుటలేదు. (సిగ్గుపడుట లేదు.) అనియున్ను., మరియు '..స్తోష్యామ్యహం నిర్భయః, లోకైకేశ్వరి! లోకనాథ దయితే! దాంతే దయాస్తేవిదన్ ('ఓ లక్ష్మీదేవీ! నీయొక్క దయా స్వభావమును తెలిసికొనుచు నిర్భయముగా నిన్ను స్తోత్రము చేసెదను) అను కాంతాస్తోత్ర వాక్యము కూడ నీయర్థమునే బలపరచుచున్నది.

సంస్కృత వ్యాఖ్య :- స్తోతారమితి। హే దేవి! స్తోతవ్యస్య స్తుత్యస్య గుణాన్ యో విస్తృణీతే విస్తారయతి, విపూర్వాత్ 'స్తృఞ్ ఆచ్ఛాదనే' ఇతి ధాతోః 'శ్న' ప్రత్యయే 'ఈహల్యఘోః' ఇతీత్వే తఇత్యస్య ఏత్వేకృతే విస్తృణీత ఇతి రూపమ్। తం కవయః పండితాః సంఖ్యావాన్ పండితఃకవిః' ఇత్యమరః। స్తోతారం స్తావకం ఉశన్తి కథయన్తే। 'వశకాన్తౌ' ఇత్యస్మాద్ధాతోః 'గృహిజ్యా..' ఇతి సంప్రసారణే 'ఝోఽన్తః' ఇత్యన్తాదేశ

ఉశన్తీతి రూపమ్॥ తతః గుణవిస్తారకస్యైవ స్తోతృత్వ కథనాత్। చేతి చకారేణ పూర్వశ్లోకసూచిత స్వరూపోచిత కించిత్కారరూప స్తుతిప్రవృత్తిః హేతుత్వేన సముచ్చీయతే। తేస్తుతిధురా త్వద్విషయక స్తోత్రభారః॥ ధురాశబ్ద ఆకారాన్తః। హలన్తానామజన్తత్వం భాగురిర్మన్యతే। మయ్యేవ న విరించ్యాదిషు తేషాం శ్రుతిమధుర వాక్త్వాదితిభావః । విశ్రామ్యతి పర్యవస్యతి। స్తోతృత్వంచ మమైవోచితమిత్యర్థః। కథంత్వయా మద్గుణా విస్తీర్యన్తే యేన తవైవ స్తోత్రతాస్యాదిత్యత ఆహ :- యస్మాదితి యస్మాత్ యతో హేతోః అస్మదమర్షణీయ ఫణితి స్వీకారతో మత్కఠోర వచన విషయీభావతః తే తవ క్షాన్త్యౌదార్య దయాదయః। వాగ్దోష సహనేన క్షాన్తిః అయోగ్యేనాపి మయా స్వస్తుతి నిర్వర్తనా దౌదార్యమ్, స్తుత్యకరణే దుఃఖితస్య మే ఫణితిస్వీకారేణానుకంపనా దయా। ఆదిశబ్దేన ఫణితిదోషే గుణత్వబుద్ధేర్వాత్సల్యంచేతి గుణాః స్వాం స్వకీయాం ప్రథాం సిద్ధిం ప్రకాశంవా ప్రస్నువీరన్ జనయేయుః॥ 'ష్ణుప్రస్రవణే' ఇత్యస్మాద్ధాతోః లిఙాత్మనేపద బహువచనే లిఙఃసీయుటః సలోపే ఉవఙీర్ఘుస్యరనాదేశే ప్రస్నువీరన్నితిరూపమ్ ॥

అ :- ఏవం స్వస్య స్తోత్రాధికారం ప్రసాధ్య లక్ష్మ్యనుగ్రహేణ స్వసూక్తి సమగ్రతాం ప్రార్థయతే।

శ్లో ॥ సూక్తిం సమగ్రయతు నః స్వయమేవ లక్ష్మీః
శ్రీరఙ్గరాజమహిషీ మధురైః కటాక్షైః ।
వైదగ్ధ్యవర్ణ గుణగుమ్ఫన గౌరవై ర్యాం
కణ్డూలకర్ణ కుహరాః కవయో ధయన్తి ॥ 2

అ :- శ్రీరంగరాజమహిషీ=శ్రీరంగనాథుని పట్టపురాణియైన, లక్ష్మీః=లక్ష్మీదేవీ, మధురైః=మధురములు ప్రియములునైన, కటాక్షైః=కటాక్షములతో, నః=మాకు, (నాకు) సు+ ఉక్తిం=మంచివాక్కును, (తగిన స్తోత్రమును) స్వయం ఏవ=తనంతట తానే, సమగ్రయతు=సంపూర్ణమైనదానినిగా చేయుగాక. యామ్=ఏనావాక్కును ( ఈ స్తోత్రమును) వైదగ్ధ్య...గౌరవైః, వైదగ్ధ్య= చాతుర్యము తోకూడిన అర్థగౌరవముయొక్క, వర్ణ=అక్షరముల యొక్క, గుణ= మాధుర్యాది గుణముల యొక్క, గుంఫనగౌరవైః=ఘటనాతిశయముచేత, కవయః= పండితులు, కండూలకర్ణ కుహరాః=కండూతితో కూడిన కర్ణరంధ్రములు కలవారై, (అత్యంతాసక్తి కలవారై) ధయన్తి=త్రాగుచున్నారో (వినుటకు ఉత్సహించుచున్నారో).

తా :- ఏ సూక్తిని (స్తోత్రమును) కవులు, పండితులు, అత్యం తాదరము చూపి వినెదరో అట్టి సమగ్రమైన సూక్తిని ( ఈ స్తోత్రమును) లక్ష్మియే నాకు స్వయము గా కటాక్షించును గాక.

వి :- గ్రంథకర్త ఇచ్చట స్వాహంకారనిరాసము చేసికొను చున్నారు. పూర్వ శ్లోకమున చెప్పినట్లుగ తాము చెప్పినచో దోషజుష్టమగును గావున లక్ష్మియే స్వయము గా తనస్తోత్రమును తమచే చెప్పించుకొనవలయును. అట్లు చెప్పించు కొనుటవలన ఈ స్తోత్రమున అర్థగాంభీర్యము, మాధుర్యాది గుణములు, శయ్యాపాకాదులు వాటంతట అవియే సమకూరును. అట్టి ఈ స్తోత్రమును పండితులు, కవులు కూడ అత్యంతాదరముతో చదివెదరు. అనగా ఈ స్తోత్రము కవిపండితరంజకమని ధ్వనితము. అట్టి స్తోత్రమును చెప్పించుకొనుభారము లక్ష్మీదేవికే వదలబడినది. ఇచ్చట 'శ్రీరంగరాజ మహిషీ, లక్ష్మీః' అను విశేషణ విశేష్యములు ఆమెకు పతివాల్లభ్యమును, తత్కృతమైన ఆమెయొక్క పరత్వ సౌలభ్యములను తెలుపుచున్నవి. మరియు 'ధయన్తి' (త్రాగుదురు) అను పదము ఈ సూక్తులకు అమృతోప మానత్వమును సిద్ధింపచేయుచున్నది. అట్టి అమృతోపమానమైన సూక్తులను లక్ష్మీదేవి తన మధురములైన కటాక్షములతో నాకు అనుగ్రహించును గాక-అట్లు అనుగ్రహించిన ఈ స్తోత్రమును అందరును ఆసక్తితో చదువుదురుగాక... 'హే శ్రీర్దేవి సమస్త లోకజననీం త్వాం స్తోతుమీహామహే యుక్తాం భావయ భారతీం'

లక్ష్యం లక్ష్మీ కటాక్షవీచివిసృతే స్తే స్యామ చామీవయమ్॥

(ప్రపంచమునకు జననివైన నిన్ను స్తోత్రముచేయుటకు కోరుచున్నాము. నీయొక్క కటాక్షపాతములకు లక్ష్యమగువారినిగా మమ్ముచేసి తగిన వాణిని మాకు నీవే ఇమ్ము) అని కూరేశుల శ్రీస్తవము.

సంస్కృత వ్యాఖ్య :- సూక్తిమితి। శ్రీరంగరాజమహిషీ శ్రీరంగేశ్వర వల్లభా లక్ష్మీఃశ్రీః శ్రీరంగరాజమహిషీ లక్ష్మీరితి విశేషణ విశేష్యాభ్యాం పతివాల్లభ్యకృతం స్వవిభవసామర్థ్యం సూచితమ్ । మధురైః స్వాదుభిః ప్రియైశ్చ 'స్వాదుప్రియౌతు మధురౌ' ఇత్యమరః। కటాక్షైః అపాంగైః నత్వధ్యాపనైః నోఽస్మాకంసూక్తిం శోభనాం వాచం । స్వస్తుతిం స్వయమేవ అస్మత్ప్రయత్న మనపేక్ష్యైవ, అస్మత్ప్రయత్నాపేక్షణే శోభనత్వం నసిద్ధ్యేదితిభావ। సమగ్రయతు సమగ్రాం కరోతు।.సంపూర్ణాం నిర్వర్తయత్విత్యర్థః। ఉత్తరార్ధేన ఉక్త శోభనతామేవ విశదయతి।వైదగ్ధ్యేతి। యాముక్తిం వైదగ్ధ్య వర్ణగుణ గుంఫనగౌరవైః వైదగ్ధ్యేన చాతుర్యేణ వర్ణానాం అక్షరాణాం గుణానాం ఓజః ప్రసాదశయ్యాపాకాదీనాం గుంఫన గౌరవైః గ్రథనాతిశయైః యద్వా వైదగ్ధ్యం అర్థ కల్పనా, వర్ణగుణాః వర్ణధర్మాః ప్రసాదమాధుర్యాదయః తేషాం గుంఫనం రచనా తద్గౌరవైః తదతిశయైర్నిమిత్తైః కవయః పండితాః। కండూలకర్ణకుహరాః కండూరేషా మస్తీతి కండూలాని 'మత్వర్థేలచ్' తథాభూతాని కర్ణకుహరాణి శ్రోతృవివరాణి యేషాం తే తథోక్తాః శ్రవణ సకుతూహల శ్రుతివివరాః సన్తః, సదాదత్తకర్ణా ఇత్యర్థః ।ధయన్తి పిబన్తి ।'ధేట్ పానే' ఇత్యస్మాద్ధాతోః తిజి 'శప్' ప్రత్యయే అయాదేశే

'రేఖాఉన్త' ఇత్యన్తాదేశే ధయన్తీతి రూపమ్ ధయన్తీ పానోక్త్యా సూక్త్యాః సుధాసామ్యం సూచితమ్।

అ :- సంగ్రహేణోక్తం వివక్షితోక్తిగౌరవం వివృణ్వాన్ స్వస్మై శ్రీరేవ తద్విస్తారయ త్వితి ప్రార్థయతే।

శ్లో ॥ అనాఘ్రాతావద్యం బహుగుణపరీణాహి మనసో
దుహానం సౌహార్దం పరిచితమివాథాపి గహనమ్।
పదానాం సౌభ్రాత్రా దనిమిష నిషేవ్యం శ్రవణయోః
త్వమేవ శ్రీర్మహ్యాం బహుముఖయ వాణీవిలసితమ్ ॥ ౮

అ :- హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ, అనాఘ్రాత+అవద్యమ్=దోషవాసనలు లేనట్టియు, బహుగుణపరీణాహి= అనేకములైన గుణ అలంకార వృత్తి రీతి పాకాదులతో కూడినట్టియు, మనసః=మనస్సునకు, సౌహార్దమ్=సంతోషమును, (ఆర్ద్రతను) దుహానమ్= కలుగచేయునట్టియు (రసాదియుక్తమగుటచేత), పరిచిత మివ+అథాపి= (చదువరులకు) తెలిసినదానివలె ఉన్నప్పటికిని, గహనమ్=గాంభీర్యము కలిగినట్టి యు, (ధ్వనిప్రధానమ్మైనట్టియు), పదానామ్=పదములయొక్క, సౌభ్రాత్రాత్=అన్యోన్య మైత్రివలన (శయ్యవలన), శ్రవణయోః=శ్రోత్రములకు, అనిమిష నిషేవ్యమ్=ఆసక్తి కరముగా సేవించతగినట్టియు, వాణీవిలసితమ్=సరస్వతియొక్క విలాసమును, (వాక్పాటవమును), మహ్యామ్=నాకొఱకు (నాయందు), త్వం ఏవ= నీవే, బహుముఖయ=బహుముఖములు కలదానినిగా చేయుము.

తా :- దోషరహితము, గుణాలంకార వృత్తి రీతి శయ్యా పాకాది సహితము, రససమన్వితము, ధ్వనిప్రధానమునైన వాక్చాతుర్యమును, ఓ లక్ష్మీదేవీ, నీవే నాకనుగ్రహింపుము.

వి:- 1) ఇందు 'అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్' 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అను కావ్యలక్షణములు చెప్పబడుటయే గాక కావ్యమున కుండవలసిన మాధుర్యౌజఃప్రసాదాది గుణములు శబ్దార్థాలంకారములు కైశిక్యాది వృత్తులు, వైదర్భ్యాదిరీతులు, ద్రాక్షాదిపాకములు, పదాన్యోన్యమైత్రీ రూపమైన శయ్య, మొదలగు లక్షణములతోపాటు ధ్వనిప్రధానముగానున్నది కాబట్టి తమ కావ్యమునకు ఉత్తమకావ్యత్వముకూడ సిద్ధించినదని గ్రంథకర్త యభిప్రాయము. 2) భాషా విలాసముకోరువారు వాణిని ఆశ్రయించవలయును. కాని ఇచట అన్యదైవముల నాశ్రయించు ప్రసక్తిలేని కారణముననుు, లక్ష్మియే సర్వసమర్థురాలు కావునను ఆ వాణి యొక్క విలాసములను కూడ లక్ష్మీదేవినే తమకిమ్మని శ్రీపరాశరభట్టారకులు కోరు చున్నారు. 'సా భారతీ భగవతీతు యదీయదాసీ, తాం దేవదేవమహిషీం శ్రియ

మాశ్రయామః' (భగవతియైన భారతికూడ ఎవరికిదాసియో అట్టి శ్రీరంగరాజ మహిషియైన లక్ష్మిని ఆశ్రయించుదుము) అని శ్రీస్తవమున శ్రీవత్సాంకమిశ్రులసూక్తి. శ్రీగుణరత్న కోశము 17వ శ్లోకమున (రతిర్మతి సరస్వతీ) కూడ లక్ష్మీకటాక్షముననే సరస్వతియు వశంవదయగునని చెప్పబడినది. 3) లక్ష్మీసహస్రనామములోని 'భారతీకమలాభాషా' 'గద్యపద్యాత్మికా వాణీ' అకారాది క్షకారాంత సర్వవర్ణ కృత స్థలా' 'సమాసతద్ధితాకారా విభక్తివచనాత్మికా' మొదలైననామములు లక్ష్మియు సరస్వతియు ఒక్కటేయని చెప్పుచున్నవి. 4) విష్ణుసహస్రనామములో, 'స్తోత్రం' (686) అను నామమున 'తన స్తోత్రమయ్యు దానిని తానే అనుగ్రహించి పూర్తి చేయించుకొనువాడు. అనగా ఆ శక్తిని తానే ఇచ్చువాడు' అను శ్రీపరాశరభట్టర్ వ్యాఖ్యానము శ్రీమన్నారాయణునకే సంబంధించినను ఇచట లక్ష్మికికూడ నన్వయించుకొనవచ్చును. 5) ఇచట 'అనిమిషనిషేవ్యం' అను పదము విశేషార్థయుక్తము. అనిమిషత్వముగాని, నిమేషత్వముగాని నేత్రములకుచితముగాని శ్రోత్రములకు గాదు. ఇచట శ్రోత్రపరముగా ప్రయోగించబడిన 'అనిమిషత్వము' అత్యంత ఆసక్తిని చెప్పుటయే గాక, తమగ్రంథము దేవతలకుకూడ సంసేవ్యమగునంతటి వాక్పాటవమును తమ కిమ్మనికోరుట ఇందు గమనింపదగినది. ఇది ఇందలి ధ్వని. ఈ విధముగా ఈ కావ్యమునకు ఉత్తమకావ్యత్వము సిద్ధించినది.

సంస్కృత వ్యాఖ్య :- అనాఘ్రాతేతి । హే శ్రీః అనాఘ్రాతావద్యం అనాఘ్రాతం అస్పృష్టం అవద్యం వర్ణపదవాక్యగతః శ్రుతికట్వశ్లీల ప్రక్రమభంగాది దోషోయస్య తం తథోక్తమ్। బహూనాం గుణానాం పాకవృత్తి శబ్దార్థాలంకారాదీనాం పరీణాహి విశాలతాస్యాస్తీతి తథోక్తమ్, మనసః సౌహార్దం సంతోషం దుహానం దోగ్ధృ, సంపూర్ణరస మిత్యర్థః, అనేన విశేషణత్రయేణ కావ్యసామాన్య లక్షణముక్తమ్, నిర్దోషసగుణ సరస శబ్దార్థయోరేవ కావ్యత్వాత్, పరిచితమివ జ్ఞాతార్థమివస్థితమ్, శ్రోతౄణామితిశేషః, అథాపి గహనం అజ్ఞాతార్థబహులం ధ్వనిప్రధానమిత్యర్థః, అనేనోత్తమకావ్యత్వం సూచితమ్ 'ధ్వని ప్రధానతా యత్ర తదుత్తమ ముదాహృతం' ఇతి లక్షణాత్ ॥ పదానాం సుప్తిఙన్తాదీనాం సౌభ్రాత్రాత్ స్నేహాత్ శయ్యాయా ఇత్యర్థః 'యాపదానాం పరాన్యోన్య మైత్రీశయ్యేతికథ్యతే' ఇతిలక్షణాత్, శ్రవణయోః శ్రోత్రయోః అనిమిషం నిర్నిమేషం సావధానం సాశ్చర్యంవా నిషేవ్యం సేవితుమర్హం గ్రాహ్యమిత్యర్థః, వాణ్యాః సరస్వత్యాః 'గీర్వాగ్వాణీసరస్వతీ' ఇత్యమరః విలసితం భాషారూపం విలాసం కర్మ భావేక్తః । త్వమేవ మహ్యం బహుముఖయ బహుముఖి కురు నత్వహం వాణీం ప్రసాదయామి అనన్యదైవత్వ స్వరూప విరుద్ధత్వాత్। త్వత్ప్రసాదలక్షణ రాజకుల మాహాత్మ్యలబ్ధస్యైవ తద్విలసితస్య స్వరసత్వా చ్చేతిభావః

అ :- స్వప్రార్థనానుగుణ్యేన లక్ష్మీకటాక్షలబ్ధ వాగ్విలాసపూర్వం శ్రీరంగ రాజస్తవే త్రింశదుత్తరాభ్యాం పూర్వోత్తరశతకాభ్యాం శ్రీరంగరాజ ముచ్చైరభిష్టూయ ఏకషష్టి శ్లోకపరిమితత్వేన తతః శబ్దసంకోచే ఽప్యర్థ పౌష్కల్యేన రసపౌష్కల్యేన సందర్భవిశేష విశిష్టతయాచ తతోఽప్యతిశయితాం శ్రీస్తుతిం చికీర్షుః స్వాపేక్షయా శ్రియో ఽధికతయా స్తవనే శ్రీరంగరాజః కుపితః స్యాదితి తత్కోపశాంతయే తం శ్రియః శ్రీః శ్రీరంగేశయేతి విశేషణ విశేష్యాభ్యాం ప్రసాద్య స్వవాల్లభ్యేన చికీర్షితం ప్రాగల్భ్యం ప్రతిజానీతే।

శ్లో ॥ శ్రియః శ్రీః శ్రీరఙ్గేశయ తవచ హృద్యాం భగవతీం
శ్రియం త్వత్తోఽప్యుచ్చైః వయమిహ (ఫ) భణామః శృణుతరామ్।
దృశౌ తే భూయాస్తాం సుఖతరలతారే శ్రవణతః
పునర్హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కఞ్చుకశతమ్ ॥ ౬

అ :- శ్రియః= అందరిచేత ఆశ్రయించదగిన లక్ష్మికే, శ్రీః= ఆశ్రయమైనవాడా, శ్రీరంగేశయ= ఓ రంగరాజా!, తవ చ= నీకుకూడ, హృద్యామ్= హృదయంగమ (ప్రేయసి) యైన, భగవతీమ్= మాహాత్మ్య సమన్వితయైన, శ్రియమ్= లక్ష్మీదేవిని, త్వత్తః అపి= నీకంటెనుకూడ, ఉచ్చైః= ఎక్కువగా, వయమ్= మేము, (ఫ) భణామః= చెప్పు చున్నాము, శృణుతరామ్= ఆసక్తితో వినుము, శ్రవణతః= ఆ విధముగా వినుటవలన, తే= నీయొక్క, దృశౌ= నేత్రములు, సుఖతరలతారే= సుఖముచేత చంచలములైన కనీనికలు కలవిగా, భూయాస్తామ్= అగునుగాక, పునః= మరియు, భుజయోః= భుజములయందలి, కంచుకశతమ్= కంచుకములయొక్క పరంపర, హర్షోత్కర్షాత్= సంతోషాధిక్యమువలన, స్ఫుటతు= చిరిగిపోవునుగాక. (పిగిలి పోవునుగాక).

తా :- శ్రీరంగమున సుఖముగా శయనించిన ఓ రంగనాథా! లక్ష్మీదేవిని నీకంటె ఎక్కువగా వర్ణించుచున్నామని కోపపడకుము. ఆమె నీకుకూడ హృదయంగమమైన స్వరూపముకలది. అందువలననే ఆమెయొక్క వర్ణనము నీకు కూడ సంతోషాతి శయమును కలుగచేయును. ఆ సంతోషాతిశయమువలన కనుపాపలు 'గిరగిర' తిరుగు నట్లుగను, భుజములయందలి కంచుకములు 'పటుపటు' పిగులునట్లుగను, అత్యంత శ్రద్ధాసక్తులతో నీవుకూడ ఈ స్తోత్రమును విని మాకు సాక్షివి అగుము.

వి :- అందరకును ఆశ్రయించదగినది లక్ష్మీ. ఆమెకు ఆశ్రయించదగినవాడు శ్రీరంగనాథుడు. లక్ష్మికి భగవంతుడుతప్ప అందరును శేషభూతులు. శ్రీరంగనాథు నకు లక్ష్మితోసహా అందరును శేషభూతులు. వీరిరువురును సర్వసులభులై భూమి యందు వైకుంఠముగా భావింపబడు శ్రీరంగమున అర్చారూపమున వెలసి భక్తులను అనుగ్రహించుచున్నారు. శ్రీపరాశర భట్టారకులు ఈ స్తుతిని వారిరువురి సమక్షమున

చెప్పినట్లు భావింపబడుచున్నది. ఈ గ్రంథకర్తయే శ్రీరంగరాజస్తవమున దాదాపు 235 శ్లోకములలో శ్రీరంగనాథుని వర్ణించియున్నారు. ఈ స్తోత్రము కేవలము 61 శ్లోకములతో దానికంటె చిన్నదే అయినను శబ్దసౌష్ఠవము అర్థగాంభీర్యము రసపుష్టి మొదలగు లక్షణములలో ఆ స్తోత్రము నతిశయించినది. అట్టి లక్ష్మీగుణవర్ణన పరమైన ఈ స్తోత్రములో తన ఎదుటనే లక్ష్మిని తనకంటె ఎక్కువగా వర్ణించుటవలన శ్రీరంగనాథుడు కోపించునేమోయని శ్రీస్వామివారిని అనునయించుట ఇందలి ప్రధానోద్దేశ్యము. అందువలననే 'ఓ రంగనాథా! నీవు అందరకు హృద్యమైన వాడవు. లక్ష్మీదేవి నీకుకూడ హృద్యమైనది 1) (హృదయము నందున్నది. 2) సర్వేంద్రియాహ్లాదన సమర్థమైనది). అట్టి యామెను నీకంటె ఎక్కువగా స్తోత్రము చేయుచున్నాము. ఆ విధమైన స్తోత్రమును (వర్ణనను నీవు వినుటయే గాక మాకు సాక్షివిగాకూడ నుండవలసినది' అని ప్రార్థించుచున్నారు. ఆమెను శ్రీరంగనాథుని కంటె ఎక్కువగా వర్ణించుట యనగా శ్రీరంగనాథుడే ఆమెను వర్ణించినచో ఆయన చేయు వర్ణన కంటె తాము ఎక్కువగా చేయుచున్నామను అభిప్రాయముకూడ సూచింపబడుచున్నది. అందువలన కోపము లేకపోవుటయే గాక 'వీరు నాకంటె ఎక్కువగా నాలక్ష్మిని వర్ణించుచున్నారే!' అనెడి ఆశ్చర్యము దాని వలన నేత్రములకు సుఖతరల తారత్వము, భుజములయందు కంచుక శతస్ఫోటనమున్ను. ఇచ్చట నేత్రములకు సుఖతరల తారత్వమనగా కనుపాపలు 'గిరగిర' తిరుగుట. అట్లే భుజముల యందు కంచుక శతస్ఫోటన మెట్లనగా- ఒక కంచుకము వేసికొనినపుడు హర్షోత్కర్షతో శరీరము వృద్ధియగును. అపుడాకంచుకము 'పటపట' మని చిరుగును. మరల ఆ శరీరవృద్ధికి తగిన కంచుకము ధరించినను దానికి మించిన శరీరవృద్ధిచే అదికూడ చిరుగును. ఈ విధముగా శరీరవృద్ధికి తగినట్లుగా శతకంచుక ధారణము హర్షోత్కర్షవలన తత్ స్ఫోటనము ఇచట స్వామికి వర్ణించబడినది. ఇచట శతశబ్దము కేవలము శతసంఖ్యను గాక అనేకత్వమును( లెక్కలేనన్ని) చెప్పుచు శ్రీస్వామివారికి కలుగబోవు హర్షాధిక్యమును వెల్లడి చేయుచున్నది. ఆ విధముగా ఆమెను వర్ణించుట స్వామి యొక్క సంతోషము కొరకే అగునని తాత్పర్యము. శ్రీ స్వామివారు శ్రీరంగమున శయనించి సేవనొసంగుచున్నారు. ఆసీనులైయున్న వారికంటె శయనించి ఉన్నవారలకు పైనచెప్పినట్లుగా కనుపాపలు తిరుగట, కంచుకములు పిగులుట మొదలగునవి అధికముగా సంభవించు నవకాశము కలదు. కావున ఇచట 'శ్రీరంగేశయ' అను విశేష్యపదము సార్థకము అయి ఉన్నది. ఇచట మేము అనుటవలన శ్రీ పరాశర భట్టారకులతోపాటు శ్రీవత్సాంక మిశ్రులు యతివర యామునాచార్యాదు లున్ను గ్రహింపబడుదురు. మరియు ఇట స్తుతిచేయుటయనగా లేనిగుణములను ఉన్నట్లుగా ఆరోపించుట గాని, ఉన్నవానిని

కూడ అన్నింటిని వర్ణించుటగాని కాదు. ఈ విషయము 5, 6 శ్లోకములలో వివరింప బడినది. మరి ఏమనగా ఆమె గుణములను తాము తెలిసికొన్నంత వరకు వర్ణించుట ఇట గ్రహింప దగినది. ఆమె గుణములు ఆమెకేగాక శ్రీహరికి కూడ అంతుతెలియనివి కదా! (అనంతములు). కావున అనంతములైన ఆ గుణములలో కొన్నింటిని మాత్రమే వర్ణింపగలుగుట. ఆ వర్ణనయే శ్రీస్వామివారికి కూడ ఆశ్చర్యము కలుగునట్లుగా వర్ణించుట అనునది ఇచట గ్రంథకర్త యొక్క ముఖ్యోద్దేశ్యముగా భావింపనగును. అంత మాత్రముచేత గ్రంథకర్తయొక్క జ్ఞానశక్త్యాదులను తక్కువైన వానినిగా భావింప నవసరములేదు.

సంస్కృత వ్యాఖ్య :- శ్రియః శ్రీరితి। శ్రియః సర్వసమాశ్రయణీయాయాః శ్రీః ఆశ్రయణీయః। శ్రియ ఇతి సర్వేషాం శ్రీసమాశ్రయణేన స్వరూపలాభః। శ్రీరితి శ్రియో భగవత్సమాశ్రయణేన స్వరూప లాభశ్చ సూచితః। తథా శ్రియ ఇతి శ్రియః స్వవ్యతిరిక్త సర్వశేషిత్వం సూచితమ్। శ్రీరంగే దివ్యనగరే శ్రీరంగాఖ్యే దివ్యవిమానేవా శేతేఇతి శ్రీరంగేశయః। సర్వసమాశ్రయణోచిత సౌలభ్యసీమాభూమేః ఏవం విశేషణ విశేష్య పదాభ్యాం శ్రీరంగేశః ప్రసాదితః।తవచ హృద్యామితి సాభిప్రాయం వచనమ్। స్వేతర సర్వజనహృద్య స్త్వముచ్చైః ఫణితః। తవచ హృద్యాయాః త్వత్తోఽప్యుచ్చైః ఫణన ముచితమితి త్వయా నకోపః కార్య ఇతి। హృద్యాం హృదయంగమాం భోగ్యాం వక్షఃస్థల నివాసినీంవా భగవతీం షాడ్గుణ్య పరిపూర్ణామ్, శ్రీకామ మాహాత్మ్యాది యుక్తాం వా అత ఏవ శ్రియం పురుషకారత్వేనాస్మదాశ్రయణీయాం త్వత్తోఽప్యుచ్చైః భవతోఽప్యతి శయేన త్వదపేక్షయా శ్రియమతిశయితత్వేన త్వం శ్రీస్తుతిం కరోషిచేత్ యథాకుర్యాః తతోఽప్యతిశయేనేతి అర్థః। మత్తోఽప్యుచ్చైః కే ఫణి ష్యన్తీత్యత ఆహ:- వయమితి వయం యుష్మత్ప్రసాదైకలబ్ధ విశదతమజ్ఞానాః॥ అనేన స్వప్రయత్న పూర్వక అవిశదజ్ఞాన బ్రహ్మాదివ్యావృత్తిః॥ వయమితి బహువచనేన స్వసమాన జ్ఞాన శ్రీవత్సాంక మిశ్ర యతివర యామునా చార్యా గృహ్యాన్తే ఇహ త్వత్సమక్షమేవ ఫణామః స్తుమః॥ నచపరోక్షే యత్కించిత్ ప్రగల్భవచనంబ్రూమః। అత్ర స్తుతిర్నామ నావిద్యమాన గుణారోపో విద్యమాన యావద్గుణ పరిచ్ఛేదోవా, కింతు యథావత్ జ్ఞాత గుణవర్ణనం తత్తథైవక్రియతే శృణుతరాం సమ్యక్ శ్రవణం కుర్యాః, త్వమేవ సాక్షీ భవేతి భావః ।నకేవలం శ్రీస్తుతి శ్రవణేన తే కోపాభావః। ప్రత్యుత శ్రవణసుఖేన చక్షుషో ర్వైవశ్యం సంతోషాతియా దపరిమిత కంచుకస్ఫుటనహేతుః గాత్రపరిపోషశ్చ భవేదిత్యాహ। దృశౌత ఇత్యాదినా। శ్రవణతః స్తుతిశ్రవణాత్ తేదృశౌ సుఖేన తరలే చంచలే తారకే కనీనికే యయోస్తే తథోక్తే భూయాస్తాం, పునః కించేత్యర్థః॥ హర్షోత్కర్షాత్ ఆనందాతి శయాత్। భుజయోః అధికరణే సప్తమీ। కంచుకశతం స్ఫుటతు ప్రథమమేకకంచుకస్ఫోటే

తతోఽపి పృథుత్వేనా పరకంచుకధారణే గాత్రజృంభణేన తస్యాపి స్ఫుటనే తతోఽపి విపులకంచుక ధృతౌ విగ్రహ వృద్ధ్యా అస్యాపి స్ఫోట ఇత్యేవం ప్రకారేణా పరిమిత కంచుక స్ఫోటో భవత్వీత్యర్థః పునరిత్యస్య ముహురితివా అర్థః ॥

అ:- ప్రతిజ్ఞాతక్రమేణ శ్రియం స్తోష్యన్ మానాధీనా మేయసిద్ధి రితిన్యాయేన శ్రీస్వరూప రూపగుణాదిషు సపరికరాం శ్రుతిం ప్రమాణయన్ అర్థతః 'శ్రీగుణరత్న కోశా' ఖ్యాం స్తుతేః సూచయతి।

శ్లో ॥ దేవి! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః
త్వత్సద్గుణౌఘ మణికోశగృహం గృణన్తి ।
తద్ద్వార పాటన పటూనిచ సేతిహాస
సన్తర్కణ స్మృతి పురాణ పురస్సరాణి ॥ ౧౦

అ :- హే దేవి= ఓ లక్ష్మీదేవీ, ప్రథమే పుమాంసః=పూర్వులైన మహర్షులు (వసిష్ఠ వాల్మీక్యాదులు, పరాంకుశ, పరకాల యతివరాదులు) భగవతీమ్= మహి మాన్విత యైన, శ్రుతిమ్=వేదమును, (ఋక్సామ యజుర్వేద రూపమైన శ్రుతిని) త్వ... గృహం, త్వత్= నీయొక్క, సద్గుణ+ ఓఘ=సద్గుణ సముదాయము అనెడి, మణి= మణులయొక్క, కోశగృహమ్= కోశాగారముగా, (నిధిగా), గృణన్తి= (స్పష్టముగా) చెప్పుచున్నారు. సేతి...రాణి, సేతిహాస= రామాయణాది ఇతిహాసము లతోకూడిన, సంతర్కణ=వేదార్థ విచారమును చేసిన పూర్వమీమాంసాదులు, స్మృతి = మన్వాదులచే చేయబడిన స్మృతులు, పురాణ= విష్ణుపురాణాది పురాణములు, పురస్సరాణి= మొదలుగా గలవానిని, తత్...పటూనిచ, తత్= ఆ కోశగృహము యొక్క, (వేదముల యొక్క), ద్వారపాటన=ద్వారమును తెరచుటలో (అర్థమును వివరించుటలో), పటూనిచ=సమర్థములైన వానిని (తాళముచెవులైన వానిని) గను కూడ, గృణన్తి= స్పష్టము చేయుచున్నారు.

తా :- ఓ లక్ష్మీదేవీ, వసిష్ఠుడు వాల్మీకి వ్యాసుడు మొదలగువారున్ను, పరాంకుశ పరకాల ప్రభృతులున్ను అయిన మహర్షులు వేదసముదాయమును నీయొక్క గుణములనెడిరత్నముల యొక్క కోశగృహముగను, రామాయణ భారత భాగవతాదు లను పూర్వోత్తరమీమాంసాదులను స్మృతి పురాణాదులను ఆ కోశమును తెరచు తాళముచెవులుగను (అనగా అర్థమును వివరించువానినిగను) స్పష్టముగా చెప్పి యున్నారు.

వి :- 1) శ్రుతికి భగవతి యను విశేషణము స్వతఃప్రామాణ్యమును అపౌరుషేయత్వమును నిర్దోషత్వమును తెలియచేయుచున్నది. 2) సద్గుణ+ఓఘము అనునపుడు ఓఘపదముచేత గుణములయొక్క ఆనంత్యము సూచింపబడు చున్నది.

3) మణులతో రూపణము గుణములకు ఔజ్జ్వల్యమును మంగళప్రదత్వమును చెప్పుచున్నది. 4) ఉపనిత్తులనిచెప్పకుండగ వేదములని చెప్పుటచేత పూర్వోత్తర భాగ రూపమైన వేదమంతయు లక్ష్మియొక్క గుణములనే వర్ణించుచున్నట్లు చెప్పబడినది. 5) 'వేదములు లక్ష్మియొక్క గుణములనెడి రత్నములకు కోశములు' అని చెప్పుటచేత 'శ్రీగుణరత్నకోశము' అనెడి గ్రంథనామము ఇటు సూచింప బడినది.

శ్రీరామాయణము భారతము భాగవతము శ్రీవిష్ణుపురాణాది పురాణములు స్మృతులు మొదలగునవన్నియు వేదములయందలి అర్థమునే వివరించుచు లక్ష్మియొక్క గుణ వైభవమును విస్తరించి చెప్పుచున్నవి. అందువలననే అవి ఆ కోశమునకు తాళము చెవులుగా చెప్పబడినవి. 'మొదలైనవి' అని చెప్పుటవలన లక్ష్మీతంత్రము మొదలైనవియు, ద్రావిడప్రబంధములును గ్రహింపనగును. శ్రీరామాయణమున 'సీతాయాశ్చరితం మహత్' అని చెప్పి వాల్మీకి మహర్షిచేత లక్ష్మియొక్క గుణములే వర్ణింపబడినవి. 'నమామి సర్వలోకానాం జననీం' అనెడి వాక్యములు శ్రీ విష్ణు పురాణమునకు లక్ష్మీగుణవైభవ ప్రకాశకత్వమును తెలుపుచున్నవి. భారత భాగవతాదుల యందు శ్రీ విష్ణుమాహాత్మ్య ప్రతిపాదనముద్వారా లక్ష్మియొక్క గుణవర్ణనము చేసినట్లే అయినది. ఈ విధముగా ఇతిహాస పురాణాదులన్నియు లక్ష్మియొక్క గుణ వర్ణనమునే చేయుచు వేదముయొక్క అర్థమును వివరించినవి. ఇచట శ్రీ పరాశర భట్టారకులు తమ గ్రంథము నకు 'శ్రీగుణ రత్నకోశము' అనుపేరుపెట్టి దానికి వేద సామ్యమును సూచించుచున్నారు. వేదముయొక్క అర్థమును తెలిసికొనుటకు ఇతిహాస పురాణాదులెట్లావశ్యకములో ఈ స్తోత్రమును అర్థము చేసికొనుటకు కూడ అవి ఆవశ్యకములు. అవి తెలిసినవారికే తమస్తోత్రమును అర్థముచేసికొను అర్హత గలదని ఈ గ్రంథకర్త అభిప్రాయము.

సంస్కృత వ్యాఖ్య :- దేవీతి। హే దేవి। ప్రథమే పూర్వే 'ప్రథమచరమ...' ఇత్యాదినా వికల్పేన సర్వనామసంజ్ఞా। పుమాంసః వసిష్ఠవాల్మీకి పరాశర పారాశర్యాది పరమర్షయః, శ్రీపరాంకుశ పరకాలయతివరాదయశ్చ, భగవతీం స్వతః ప్రమాణత్వ సకల పురుషార్థ ప్రతిపాదకత్వరూప మాహాత్మ్యయుక్తామ్। శ్రుతిం నిత్యం శ్రూయమాణాం త్రయీం అనేనాపౌరుషేయత్వ నిర్దోషత్వాని సూచితాని। త్వత్సద్గుణౌఘాః త్వత్కల్యాణ గుణగణాః। ఓఘ శబ్దేన గుణానామానన్త్యం సూచితమ్। త ఏవ మణికోశాః రత్నరాశయః 'కోశోఽస్త్రీసంచయేఽపిచ' ఇతి రత్నమాలా। గుణానాముజ్జ్వలత్వ మంగళావహత్వాభ్యాం మణిత్వరూపణం, తేషాం మణికోశానాం గృహం భాండాగారం గృణన్తి వ్యక్తం కథయన్తి। ఉపనిషదమిత్యనుక్త్వా శ్రుతిమితి సామాన్య వచనేన పూర్వోత్తరభాగాత్మక కృత్స్నే వేదేఽపి శ్రీవైభవ ప్రతిపాదనం క్రియత

ఇతిభావః। తథైవ 'గృణాహి' ఘృతవతీ 'త్యాదినా పూర్వకాండే 'సుమజ్జానయే విష్ణవే' 'శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే॥' 'హ్రీశ్చతే లక్ష్మీశ్చపత్న్యౌ' 'హిరణ్యవర్ణాం హరిణీమ్' ఇత్యాదినా పరస్సహస్రాణి వాక్యాని ఉత్తరకాండేచ శ్రీవైభవ ప్రతిపాదకాని సన్తి। అత్ర త్వత్సద్గుణేతి శ్రీగుణేత్యస్య, మణికోశేతి రత్నకోశేత్యస్యచ, సూచనాత్ అర్థతః 'శ్రీగుణరత్నకోశా' ఖ్య స్తోత్రనామ సూచితమ్। ఇతిహాసాః శ్రీరామాయణాదయః। సమ్యక్తర్కణం సంతర్కణం సమీచీనస్తర్క ఇత్యర్థః। 'యస్సంతర్కేణానుసంధత్తే సధర్మం వేదనేతరః' ఇతిస్మృతేః సంతర్కణం వేదార్థ విచారరూప మీమాంసావా। ఇతిహాస సంతర్కణై స్సహితాని సేతిహాస సంతర్కణాని। స్మృతయో మన్వాది స్మృతయః। పురాణాని, శ్రీవిష్ణుపురాణ ప్రభృతీని, స్మృతయశ్చ పురాణానిచ స్మృతి పురాణాని, తాన్యేవ పురస్సరాణి ప్రముఖాని యేషాం తాని తథోక్తాని। సేతిహాస సంతర్కణానిచ తాని స్మృతి పురాణ పురస్సరాణిచేతి కర్మధారయః। పురస్సరాణీతి లక్ష్మీతంత్రాదీని ద్రావిడ దివ్యప్రబంధ రూపాణి ప్రమాణానిచ సంగృహ్యన్తే। పటూని చేత్యత్ర చకారో భిన్నక్రమః। పురస్సరాణిచేతి చస్త్వర్థః। తానితు తద్ద్వారపాటన పటూని తస్యశ్రుతిలక్షణత్వగుణ మణికోశగృహస్య ద్వారపాటనే కవాట వివృతౌ త్వద్గుణవైభవ తాత్పర్యవివృతా విత్యర్థః। పటూని సమర్థాని కుంచికారూపాణి గృణన్తీత్యనుషంగః। తదుక్తమ్ :-

ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్।
బిభేత్యల్పశ్రుతాద్వేదః మామయం ప్రతరిష్యతి ॥

ఇతి శ్రుతిం త్వత్సద్గుణౌఘ మణికోశగృహం స్మృతిపురాణ పురస్సరాణి తద్ద్వార పాటన పటూనిచ గృణన్తీతి యథాశ్రుతమేవాన్వయః। ఇతిహాసేషు శ్రీరామాయణస్య వేదోపబృంహణత్వం శ్రీవిభవప్రతిపాదకత్వం చ :-

'వేదోప బృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః।
కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్'

ఇతి తత్రైవ ప్రసిద్ధమ్। మహాభారతాదేస్తు భగవద్వైభవ ప్రతిపాదనే శ్రియ స్తదంత ర్భావాత్ తద్వైభవ ప్రతిపాదకత్వం 'నమామి సర్వలోకానాం జననీమ్' ఇత్యాదినా స్పష్టమేవ। ఏవమన్యత్రాపి యోజనీయమ్।

అ :- ఇత్థం శ్రీవిభవే సపరికరాం శ్రుతిం ప్రమాణీకృత్య 'యావత్పర మతం ననిరా క్రియతే తావత్ స్వమతమస్థిర' మితి న్యాయేన బాహ్యకుదృష్టిమతాని నిరసితుం తన్మతాన్యుపక్షిప్య బాహ్యప్రభృతయో నమయా నిరసనీయాః, కిన్తు మిథో విరోధాత్ పరస్పరమేవ ప్రతిహతా బభూవు ర్యత స్తవ కటాక్ష లక్ష్యతాం నగతా ఇతి శ్రియం సంబోధ్యాహ।

శ్లో ॥ ఆహు ర్వేదా నమానం కతిచన కతిచారాజకం విశ్వమేత
ద్రాజన్వ త్కేచిదీశం గుణినమపి గుణై స్తం దరిద్రాణమన్యే ।
భిక్షావన్యే సురాజం భవమితిచ జడా స్తే తలాతల్యకార్షుః
యే తే శ్రీరఙ్గహర్మ్యాఙ్గణ కనకలతే నక్షణం లక్ష్యమాసన్ ॥ ౧౧

అ :- శ్రీరంగహర్మ్య=శ్రీరంగము నందలి దివ్యవిమానముయొక్క, అంగణ= ముంగిలి వాకిలియందు, కనకలతే=బంగారు తీగవలె ప్రకాశించు ఓ లక్ష్మీదేవీ, యే= ఎవరు, తే=నీకు, క్షణమ్=క్షణకాలముకూడా, లక్ష్యమ్=లక్ష్యమైనవారు, న ఆసన్= కాలేదో ( ఎవరియందు నీదృష్టిపడలేదో)తే జడాః= ఆ జడులు, కతిచన=కొంతమంది, వేదాన్=వేదములను, అమానమ్=ప్రమాణము కాని వానినిగా, ఆహుః=చెప్పిరి, కతిచ(జడాః)=మరికొంతమంది (జడులు) ఏతద్విశ్వమ్= ఈ ప్రపంచమును, అరాజకమ్=ప్రభువులేనిదానినిగా, ( ఆహుః= చెప్పిరి) కేచిత్ (జడాః)=కొంత మంది(జడులు), ( ఏతత్ విశ్వం= ఈ ప్రపంచమును) రాజన్వత్=(కేవలము అనుమాన ప్రమాణముచేతనే గ్రహింపబడిన) ప్రభువుకలదానినిగా ( ఆహుః= చెప్పిరి), అన్యే(జడాః)=మరికొంతమంది (జడులు), ఈశమ్=అధీశుని, గుణిన మపి =గుణములతో కూడినవాడైనను. తమ్= ఆ సగుణుడైన ప్రభువునే, గుణైః దరిద్రాణమ్ =గుణములు లేని వానినిగా, (నిర్గుణునిగా)( ఆహుః=చెప్పిరి), అన్యే (జడాః)= మరికొంతమంది (జడులు), భిక్షౌ=భిక్షుకునియందు, సురాజం భవం ఇతిచ=రాజు కలదైనది (ఈ విశ్వము) అనికూడ ( భిక్షుకుడే దైవమని అవహేళనము), ఆహుః= చెప్పిరి) (ఏవమ్= ఈ విధముగా, తే జడాః= ఆ జడులందరును) తలాతలి= తలాతల యుద్ధమును, అకార్షుః=చేసిరి.

తా :- ఓ లక్ష్మీదేవీ, ఏజన్మయందును నిన్ను సేవింపనివారు కొంతమంది వేదములు ప్రమాణములు కావనిరి. మరికొంతమంది దేవుడే లేడనిరి. మరికొంతమంది కేవలము అనుమాన ప్రమాణము చేతనే 'దేవుడున్నాడు' అనిరి. కొంతమంది సగుణుడైనను పరతత్త్వమును నిర్గుణుడనిరి. మరికొంతమంది భిక్షుకుడే దైవమనిరి. ఈ విధముగా వారందరును 'తలాతల' యుద్ధమును చేసిరి. ఇది యంతయు వారియందు నీదృష్టి పడకపోవుటవలన వచ్చిన యనర్థము.

వి :- 10వ శ్లోకములో చెప్పుకొన్నట్లుగా శ్రీయొక్క వైభవము నందు 'శ్రుతి'నే ప్రమాణముగా చెప్పి, తమ మతమును చెప్పుటకు ముందుగా పరమత నిరాసము చేయవలసియున్నది కావున ఈ శ్లోకమున పరమత నిరాసము చేయు చున్నారు. జడశబ్దము అజ్ఞాన అన్యథాజ్ఞాన విపరీత జ్ఞానములను తెల్పును. వీటి యొక్క విలాసములే ఆయామతములకు మూలకారణములు. కొందరు ( బౌద్ధులు

చార్వాకులు మొదలగువారు) అపౌరుషేయత్వ, నిత్యత్వ నిర్దోషత్వ అఖిల పురుషార్థ వేదకత్వాదులతో మిక్కిలి ప్రమాణములుగా చెప్పబడుచున్న వేదములే 'ప్రమాణములు కావు' అనిరి. ఇది అజ్ఞాన విలసితము. మరికొంతమంది పిపీలికాది బ్రహ్మపర్యంతము వ్యాపించియున్న ఈ విశ్వమునకు ప్రభువే లేడనిరి. ఇదియు అజ్ఞానవిలసితమే. వీరు

'మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త ।
షోడశకశ్చ వికారో నప్రకృతిః నవికృతిః పురుషః ।'

అని చెప్పుదురు, ఇది సాంఖ్యుల (కాపిలుల) మతము. (పై శ్లోకము ఈ క్రింద వివరింపబడుచున్నది) వీరి మతమున 1) కేవల ప్రకృతిరూపము, 2) కేవల వికృతి రూపము, 3) ప్రకృతి వికృతి రూపము, 4) పై మూడింటికిని భిన్నము అని పదార్థములు నాలుగు విధములుగా విభజింపబడును. 'ప్రకరోతీతి ప్రకృతిః' అను వ్యుత్పత్తిని బట్టి జగన్నిర్మాణము చేయునదియు సత్వరజస్తమోగుణములయొక్క సామ్యావస్థారూపమును అయిన ప్రధానమే మూలప్రకృతి యనబడును. అవికృతి యనగా ఎన్నడును కార్యము కాదు. అనగా ఒకదానినుండి ఉత్పన్నముకాదు. మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు, అను నీయేడును ప్రకృతి రూపములు వికృతిరూపములుకూడ నగుచున్నవి. పంచమహాభూతములు ఏకాదశేంద్రియములు అనునీపదునారును వికారములే యగుచున్నవి. పురుషుడు ఈ మూడింటికిని భిన్నుడు. అనగా ప్రకృతిరూపుడుగాని, వికృతిరూపుడుగాని, ప్రకృతివికృతి రూపుడుగాని కానేరడు. పైనచెప్పిన (7+16) ఇరువదిమూడు తత్త్వములతో ప్రకృతి పురుషులు కలసిన మొత్తము తత్త్వములు ఇరువదియైదు మాత్రమే. తద్భిన్నుడైన ఈశ్వరుడు వేరేలేడని వీరి (సాంఖ్యుల) వాద సారాంశము. వీరు వేదములను ప్రమాణముగా నంగీకరించిరి కాని ఈశ్వరుని వేరుగా అంగీకరించలేదు. మరియు కర్మకే ప్రాధాన్యమిచ్చి దానిని మించిన దైవములేడను మీమాంసక మతము కూడ ఇందు చెప్పబడినది. మరికొందరు (కాణాదులు) కేవలము అనుమాన ప్రమాణముచేతను మాత్రమే ఈశ్వరుడు తెలిసికొనదగినవాడు అనిరి. ఈశ్వరుని నిజస్థితి పూర్తిగా తెలియని అజ్ఞానులనుగా వీరిని చెప్పవచ్చును. మన మతమున భగవంతుడు శాస్త్ర ప్రమాణముద్వారా కూడ తెలిసికొనబడుచున్నాడు. మరికొందరు మృషావాదులు సగుణుడైనను పరబ్రహ్మను నిర్గుణుడిగా చెప్పిరి.

'సంఖ్యాతుం నైవశక్యన్తే గుణా దోషాశ్చ శార్ఙ్గిణః ।
ఆనంత్యాత్ ప్రథమోరాశిః అభావాదేవ పశ్చిమః'

(శ్రీమన్నారాయణుని గుణములు దోషములు కూడ లెక్క పెట్టుటకు శక్యములు కావు. ఎందువల్లననగా గుణములు అనంతములు కావునను, దోషములు

అసలే లేవు కనుకను అనియు, 'యః సర్వజ్ఞః ససర్వవిత్' (సర్వజ్ఞుడు దైవమొక్కడే, అనియు, అనేక వేదాంత స్మృతి ఇతిహాసపురాణాది ప్రసిద్ధములైన అపరిమిత గుణ సాగరము కలవాడైనను ఆతనిని నిర్గుణునిగా చెప్పిరి. వారలను సగుణ నిర్గుణ శ్రుతులను సరిగా నర్థముచేసికొనలేక అన్యథా వ్యాఖ్యానము చేసిన అన్యథా జ్ఞానులను గా భావింపవచ్చును. (ఇచట భగవంతుని గుణములుగా చెప్పబడినవి సర్వజ్ఞత్వ సర్వశక్తి మత్త్వాదులు). మరికొందరు (శైవులు) కేవలము స్వోదర పూరణమునందు కూడ అశక్తుడైన ఒక భిక్షుకుని ప్రభువుగా చెప్పిరి ( ఇది అవహేళనము). ఆ విధముగా చెప్పుట వారి విపరీత జ్ఞానమునకుదాహరణము. త్రిమూర్తులకు అతీతుడై శివుడొక్కడే పరతత్త్వముగా నున్నాడనునది శైవసిద్ధాంతము. శివుడు కర్మకు వశుడగుట వలన పరతత్త్వము కానేరడని విశిష్టాద్వైత సిద్ధాంతము. ఇతి, చ, అనునపుడు 'చ' కారమువలన గుణగుణ్యభేద 'ముక్తితారతమ్యాది' రూపములైన వాదములును చెప్పబడినట్లగును. ఇచట 'కతిచన' 'కేచన' 'అన్యే' అను పదములతోనే ఆయామతములు చెప్పబడినవి. వారినామములు ఉచ్చరించుటకు కూడ అనర్హములనియు, లక్ష్మీకటాక్షములకు దూరములై పరస్పరము తలాతల యుద్ధము చేసికొన్నందున ఆయామతములు వాటంతటవే సమసిపోయినవనియు గ్రంథకర్త యభిప్రాయము.

ఇచట లక్ష్మికి 'కనకలతే' అను సంబోధన మందలి 'కనక' శబ్దము ఔజ్జ్వల్య లావణ్య సౌందర్యములను, 'లతా' శబ్దము సౌగంధ్య సౌకుమార్య యౌవనములను సూచించుచున్నవి. 'నైవాసుర ప్రకృతయః ప్రభవన్తి బోద్ధుమ్' (ఆసుర ప్రకృతి గలవారు నిన్ను తెలిసికొనలేరు) అను ఆళ్వందార్‌స్తోత్రమును, వైకుంఠస్తవము నందలి **13,14,31** శ్లోకములున్ను భగవంతునకే సంబంధించినవి యైనను ఇచట లక్ష్మీ విషయమున కూడ అన్వయించుకొనవచ్చును.

సంస్కృత వ్యాఖ్య :- ఆహురితి, హే శ్రీరంగ హర్మ్యాంగణ కనకలతే, శ్రీరంగే పురే హర్మ్యస్య దివివిమానస్య శ్రీరంగాఖ్యస్య దివ్యవిమానస్యవా అంగణ మజిరం పురః ప్రదేశః, 'అంగణంచత్వరాజిరే' ఇత్యమరః, తస్య కనకలతే తత్రోద్భూత కనకలతే వస్థితే, కనకేత్యనేన ఔజ్జ్వల్యలావణ్య సౌందర్యాని సూచితాని, లతేత్యనేన సౌగంధ్య సౌకుమార్య యౌవనాని సూచితాని, యే పురుషాస్తే తవ లక్ష్యం జాయమానకటాక్ష విషయాః క్షణంక్షణమపి జన్మపరంపరాసు కదాపి నాసన్ నాభవన్.

శ్లో ॥ 'జాయమానంహి పురుషం యం పశ్యే న్మధుసూదనః।
సాత్త్వికస్సతు విజ్ఞేయః సవై మోక్షార్థ చింతకః'

ఇతి వచనం లక్ష్మీజాయమాన కటాక్షస్యాప్యుపలక్షణమ్। తత్కటాక్ష తదుపేక్షయో రిష్టానిష్టసాధనత్వం స్పష్టం శ్రీవిష్ణుపురాణే -

'సశ్లాఘ్య స్సగుణీధన్యః సకులీన స్సబుద్ధిమాన్
సశూర స్సతు విక్రాన్తోయం త్వం దేవి! నిరీక్షసే' ॥
'సద్యో వైగుణ్యమాయాన్తి శీలాద్యా స్సకలాగుణాః।
పరాఙ్ముఖీ జగద్ధాత్రీ యస్య త్వం విష్ణువల్లభే'। ఇతి

జడాః తత్త్వజ్ఞానహేతు త్వత్కటాక్ష విషయరాహిత్యాదేవ జడాః। అజ్ఞాన అన్యథాజ్ఞాన విపరీతజ్ఞానవిలసితాస్తే కతిచన సుగత చార్వాకాదయో వేదబాహ్యాః, తేషామవ్యపదేశ్యత్వాత్ కతిచనేత్యుక్తిః। ఏవం కతిచేత్యాదిష్వపి బోధ్యమ్। వేదాన్ అపౌరుషేయత్వ నిత్యత్వ నిర్దోషత్వ అఖిలపురుషార్థ ఉ ఉ వేదకత్వాదిభిః ప్రమాణతమాన్ అమానం అప్రమాణం ఆహురితి సాహసికత్వం సూచితమ్। కతిచన కాపిలాః ఏతత్ క్షేత్రజ్ఞా జ్ఞాతోపాదానక వివిధ విచిత్ర భూధర సముద్రాదిరూపం బ్రహ్మాది పిపీలికాన్తంచ విశ్వం జగత్ అరాజకం రాజశూన్య మనాథ మాహురిత్యనుషంగః। తేహి ప్రకృతి పురుషావేవ జగత్కారణం ప్రకృతిః పురుష సన్నిధానాత్ సవ్యతిరిక్త త్రయోవింశతి తత్త్వాత్మనా వికురుతే। ప్రకృతిః పురుషాభ్యాం సహ పంచవింశతి తత్త్వాన్యేవసన్తి। తదతిరిక్త ఈశ్వరో నాస్తీత్యుపగచ్ఛన్తి ఉదాహరన్తిచ 'మూల ప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త, షోడశకశ్చవికారో నప్రకృతిః నవికృతిః పురుషః॥' ఇతి। కేచిత్ కాణాదాః రాజన్వత్ సురాజకమ్ అనుమానిక నిమిత్త మాత్రేశ్వరమ్ 'సురాజ్ఞిదేశేరాజన్వా' నిత్యమరః। విశ్వమిత్యనుషంగః। ఆహురితి సర్వత్రాన్వేతి। అస్యే మృషావాదినః ఈశం నియన్తారం గుణినమపి 'పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ' 'యస్సర్వజ్ఞ స్స సర్వవిత్' అపహతపాప్మా సత్యకామ స్సత్యసంకల్పః' 'తస్మిన్యదన్తస్తదన్వేష్టవ్యమ్ తస్మిన్ కామాః సమాహితాః' కామ్యన్త ఇతి కామాః కల్యాణగుణాః ॥ ఇతి భాష్యమ్। తేజోబలైశ్వర్య మహావబోధ సువీర్య శక్త్యాది గుణైకరాశిః 'సంఖ్యాతుం నైవ శక్యన్తే గుణాదోషాశ్చ శార్ఙ్గిణః। ఆనంత్యాత్ ప్రథమోరాశి రభావాదేవ పశ్చిమః ॥' ఇత్యాది పరస్సహస్రవేదాంత స్మృతీతిహాస పురాణాగమాది ప్రసిద్ధా పరిమిత గుణసాగరమపి తమేవ సర్వ ప్రమాణ విరోధేన గుణైః దరిద్రాణం శూన్యమ్। 'దరిద్రా దుర్గతౌ' ఇత్యతః శానచి దరిద్రాణమితి రూపమ్। ఆహు రిత్యన్వయః। తేహి నిర్గుణ శ్రుతి తాత్పర్యమజానన్తః సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యం నిర్గుణమేవ బ్రహ్మ తదేవావిద్యా పరికల్పితం సగుణత్వ మను భవతీతి కథయన్తి। తేషాం స్వాభావికీ జ్ఞానబలక్రియాచ' ఇత్యాదిభిః విరోధః స్ఫుట ఏవ। నిర్గుణ శ్రుతి తాత్పర్యం వర్ణితం శ్రీవత్సాంక మిశ్రైః-

'దూరే గుణా స్త్వయితు సత్త్వరజస్తమాంసి
తేనశ్రుతిః ప్రథయతి త్వయి నిర్గుణత్వమ్' ॥ ఇతి.

అన్యేశైవాః భిక్షౌ స్వకుక్షిపూరణేఽప్యశక్తే భిక్షుకే కపాలినీత్యర్థః। సురాజం భవం సురాజత్వం, 'కర్తృ కర్మణోశ్చ భూకృఞో' ఇతి భూధాతోః 'ఖచ్' ప్రత్యయే కృతే భావే సురాజం భవమితి రూపమ్। ఆహురితి హేలనమ్। 'బ్రూఞ్ వ్యక్తాయాం వాచి' ఇత్యస్మాద్ధాతోః 'బ్రువః పంచానా' మిత్యాది సూత్రేణ ఆదాదేశే లిట్ పరస్మైపద బహువచనస్య ఝేరుసాదేశేచకృతే 'ఆహు' రితి రూపమ్. ఇతి ఉక్తప్రకారేణ తలైశ్చతలైశ్చ ప్రహృత్యేదం యుద్ధం ప్రవర్తత ఇతి తలాతలి తల ప్రహారం అకార్షుః అకుర్వన్, మిథ ఇతి శేషః। ఇతి చేత్యత్ర చకారేణ గుణగుణ్యా భేద ముక్తితారతమ్య వాదాదినా కేచన తలాతల్యా కార్షురితి తేచ సంగృహ్యాన్తే।

అ:- త్వత్కటాక్షవిషయతా విధురాః మిథఃప్రతిహతా ఇత్యుక్త్వా తద్విషయత్వ భాగ్యశాలినః త్వన్మహిమాన మనుభవన్తీత్యాహ।

శ్లో॥ మనసి విలసతాక్ష్ణా భక్తి సిద్ధాఞ్జనేన
శ్రుతి శిరసి నిగూఢం లక్ష్మి! తే వీక్షమాణాః।
నిధిమివ మహిమానం భుఞ్జతే యేఽపి ధన్యాః
నను భగవతి! దైవీం సమ్పదం తేఽభి జాతాః॥ ౧౨

అ:- భగవతి=సమస్త కల్యాణగుణ సంపన్నురాలైన, నను లక్ష్మి= ఓ లక్ష్మీదేవీ, ధన్యాః= నీ కటాక్ష ప్రసరణము అనుభాగ్యము కలవారు (అదృష్టవంతులు) యే అపి= ఎవరైతే (అపి శబ్దము వారి అదృష్టము చెప్పనలవికాదు అను అర్థమున ప్రయోగించ బడినది.) భక్తిసిద్ధాంజనేన= భక్తియనెడి సిద్ధాంజనముచేత, మనసి= మనస్సునందు, విలసతా=(విశేషముగా) ప్రకాశించుచున్న, అక్ష్ణా=నేత్రముతో (జ్ఞాననేత్రముతో), శ్రుతిశిరసి=1) వేదాంతమునందు, (ఉపనిషత్తులయందు) 2) శ్రవణకోణము నందున్ను, నిగూఢమ్=దాగుకొనిన, నిధిం ఇవ= నిధినివలె, తే=నీ యొక్క, మహిమానమ్=మాహాత్మ్యమును, (స్వరూపాదులను) వీక్షమాణాః=చూచుచున్న వారలై, భుంజతే= అనుభవించుచున్నారో, తే=వారు, దైవీం సంపదం అభి=దైవసంపద యైన మోక్షమునకు అభిముఖులుగా, జాతాః=అయి ఉన్నారు (వారే పుట్టినవారుగా పరిగణింపబడుదురు)

తా:- ఓ లక్ష్మీదేవీ, నీయొక్క మహిమను భక్తియనెడి సిద్ధాంజనముచేత, ఒక పర్వతశిఖరమున నిగూఢమైన నిధినివలె, జ్ఞాననేత్రముతో తెలిసికొన్న ధన్యులు మోక్షమునకు దగ్గర యగుచున్నారు.

వి:- క్రిందటి శ్లోకములో లక్ష్మీకటాక్షదూరులు ఎట్లుందురో చెప్పి ఈ శ్లోకమున లక్ష్మీకటాక్షపాత్రులు ధన్యులనియు వారే మోక్షమును పొందుదురనియు చెప్పు

చున్నారు. క్రిందటి శ్లోకమున ఆసురీసంపదయు ఈ శ్లోకమున దైవీసంపదయు చెప్పబడినవి. ఒక పర్వత శిఖరమున రహస్యముగానున్న నిధిని అంజనాదులద్వారా రహస్యముగా తెలిసికొని దానినిపొంది, అనుభవించువారివలె ఉపనిషత్తులయందు రహస్యముగా నిక్షిప్తమైన లక్ష్మీదేవియొక్క స్వరూపమును సిద్ధాంజనయుక్తమైన జ్ఞాన నేత్రముతో చూచిన ధన్యులు మోక్షమును పొందుచున్నారు. అనగా శ్రీమన్నారాయణుని యొక్క స్వరూపమువలె లక్ష్మియొక్క స్వరూపముకూడ సాధారణ నేత్రములకు కానరాదనియు, జ్ఞాననేత్రముతోనే చూడతగినదనియు తాత్పర్యము. ఇచట 'దైవీం, సంపదం' అను పదములచేత 'తం దుర్దర్శం గూఢమను ప్రవిష్టం' 'తద్యథానిహితం హిరణ్యనిధిం' ఇత్యాది శ్రుతి స్మృతి ప్రమాణములు చెప్పబడినవి. మరియు

*1)* జాయమానంహి పురుషం యం పశ్యే న్మధుసూదనః।
సాత్త్విక స్సతువిజ్ఞేయః సవై మోక్షార్థ చింతకః ॥

(పుట్టుచున్న ఏ మనుజుని శ్రీహరిచూచునో అతడే సాత్త్వికుడు, మోక్ష చింతన కలవాడును అగును) అను భగవద్గుణ వర్ణనాపరమైన శ్లోకము ఇచట లక్ష్మి యందు కూడ అన్వయించుకొనవచ్చును.

*2)* 'మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్కృపా' ( ఎవరి దయ మూగవానిని పలికించునో కుంటివానిని పర్వతము లెక్కించునో) అను ఈశ్లోకముకూడ పై యర్థమునే బలపరచుచున్నది.

*3)* 'పశ్యన్తి కేచిదనిశం త్వదనన్యభావాః' (నీయందే లగ్నమైన మనస్సు కలవారు ఎల్లప్పుడును నిన్నే చూతురు) అను ఆళ్వందార్‌స్తోత్రముకూడ భగవంతునకు సంబంధించినదియే యైనను లక్ష్మికి కూడ అన్వయించుకొనవచ్చును.

సంస్కృత వ్యాఖ్య :- మనసీతి। భగవతి సకల కల్యాణగుణ సంపన్నే। నను లక్ష్మి హే శ్రీః ధన్యాః త్వత్కాటాక్ష విషయత్వరూప భాగ్యవంతః యేఽపి యే కేచన పురుషాః యేఽపీత్యనేన తేషామతిశయో వాచామగోచర ఇతి సూచితమ్। భక్తి సిద్ధాంజనేన భక్తిః యుష్మత్ స్వరూప రూపగుణ విభూతి ష్వనితర సాధారణ ప్రావణ్యం సిద్ధాంజనమివ గూఢార్థ ప్రకాశకాంజన విశేష ఇవ యస్య తేన భక్తివిశదీకృతేనేత్యర్థః। అత ఏవ మనసి హృదయే విలసతా ప్రకాశమానేన అక్ష్ణా దృష్ట్యా జ్ఞానేనేత్యర్థః శ్రుతిశిరసి వేదాన్తే। శ్రుతిశిరసీతి జాత్యేకవచనం శ్రుతిశిరస్స్విత్యర్థః। నిగూఢం నితరాం గూఢం వేదరహస్య వస్తుత్వాదితిభావః తే తవ మహిమానం స్వరూపాది విభవం భక్తి సిద్ధాంజనేన భక్తియుక్తం రచనాయుక్తం సిద్ధాంజనం సిద్ధ్యంజనం యస్యతేన తథోక్తేన

అతయేవ విలసతా విశేషప్రకాశమానేన అక్ష్ణా చక్షుషా శ్రుతిశిరసి శ్రవణకోణే నిగూఢం నితరాం గూఢం పరశ్రవణానర్హం రహస్యోపదిష్టమిత్యర్థః। శిరసి నిగూఢమిత్యనేన నిధేః పర్వతశిరో నిగూఢత్వమపి సూచ్యతే। తథాభూతం నిధిమివ వీక్షమాణాస్సన్తః భుంజతే అనుభవన్తి। నిధిపక్షే భుక్తి ర్ధన వినియోగః మహిమపక్షే తదనుసంధానం వేదితవ్యమ్ । తే పురుషాః దైవీం సంపదమభి మోక్షహేతుభూత దైవసంపదమభి ముఖీకృత్య, దైవ సంబంధినీ సంపద్దైవీ। దేవాః భగవదాజ్ఞానువర్తన శీలాస్తేషాం సంపత్ । సా చ భగవదాజ్ఞానువృత్తిరేవ। తామభి ముఖీకృత్యజాతా ఉత్పన్నా భవన్తీతి శేషః। కార్యాత్కారణ మనుమీయతే ఇతిభావః। భగవతి! లక్ష్మీ తే దైవీంసంపదమభి జాతానను సంపదుద్దేశేన ఉత్పన్నాహి ఇతివాన్వయః। యథా నిధిసంపదనుభావక భాగ్యవత్తయా తదుద్దేశేనోత్పన్నా ఏవ నిధ్యంజనాక్త దృశః పర్వతాది నిగూఢం నిధిం వీక్షమాణా స్తమనుభవన్తి, తథా దైవసంప దుద్దేశేనోత్పన్నా ఏవ భక్తిసిద్ధాంజన స్ఫురత్ ప్రబోధ దృశా శ్రుతిశిరోనిగూఢం త్వన్మహిమానం విలోక్యానుభవన్తీతి భావః। అత్ర 'శ్రుతి శిరసి నిగూఢం' నిధిమివ దైవీం సంపదం' ఇతి పదైః 'తం దుర్దర్శంగూఢమను ప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ ॥ తద్యథా హిరణ్య నిధింనిహిత మక్షేత్రజ్ఞాః ఉపర్యుపరిసంచరన్తో నవిందేయుః ॥ దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీమతా ఇతిశ్రుతి స్మృతి పురాణాని స్మారితాని ॥

అః- ప్రాధాన్యేన శ్రీసూక్తస్య శ్రీసమృద్ధిప్రతిపాదకత్వం దర్శయన్ పురుషసూక్తాదేరపి శ్రీసమృద్ధిపరత్వం దర్శయతి।

శ్లో ॥ అస్యేశానా జగత ఇతి తే౽ధీమహే యాం సమృద్ధిం
శ్రీః శ్రీసూక్తం బహుముఖయతే తాఞ్చ శాఖానుశాఖమ్।
ఈష్టే కశ్చి జ్జగత ఇతి యః పౌరుషేసూక్త ఉక్తః
తఞ్చ త్వత్కృపతి మధిజగా వుత్తరశ్చానువాకః ॥ ౧౩

అ :- హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ, అస్య= ఈ, జగతః= ప్రపంచమునకు, ఈశానా ఇతి= అధీశురాలు అని, తే= నీయొక్క, యాం సమృద్ధిమ్= ఏ ఐశ్వర్యమును, అధీ మహే= అధ్యయనుము చేయుచున్నామో, తాంచ= దానిని, అంతంటె ఎక్కువగా నున్న ఐశ్వర్యమునుకూడ, శ్రీ సూక్తమ్= శ్రీ సూక్తము, శాఖానుశాఖమ్= శాఖోప శాఖలు గా (సంపూర్ణముగా), బహుముఖయతే= చాలరకముల ప్రతిపాదించు చున్నది, పౌరుషేసూక్తే= పురుషసూక్తమునందు, కశ్చిత్= ఒకానొక పురుషుడు, జగత్= లోకమును, ఈష్టే= నియమించుచున్నాడు, ఇతి= అని, యః ఉక్తః= ఎవరైతే చెప్పబడి నారో (విష్ణువు), తం చ= అతనినికూడ, ఉత్తరః చ అనువాకః= చివరిదైన మంత్రము

(అద్భ్యః సంభూతః, హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ, అనునది), త్వత్కంపతిమ్= నీయొక్క భర్తనుగా, అధిజగౌ= మిక్కిలిగా గానముచేసెను.

తా :- ఓ లక్ష్మీదేవీ, శ్రీ సూక్తమున 'ఈశ్వరీ(గ్)ం సర్వ భూతానాం తామిహోపహ్వయే శ్రియం' అనియు, ఇంకను అనేక విధములుగను సంపూర్ణముగా నీయొక్క సమృద్ధి వర్ణింపబడినది. అట్లే పురుషసూక్తమున గూడ పూర్వభాగమున శ్రీమహావిష్ణువుయొక్క మాహాత్మ్యము వర్ణింపబడి చివరలో 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' అని నీకుభర్తగా అనగా 'లక్ష్మీపతి'గా శ్రీమహావిష్ణువు వర్ణించబడినాడు. ఈ విధముగా శ్రీసూక్తమునందు, పురుషసూక్తమునందును గూడ వర్ణింపబడిన మాహాత్మ్యము కలదానవు నీవు.

వి :- లక్ష్మియే జగత్తునకు అధీశురాలు అని శ్రీసూక్తమున ఆమెయొక్క వైభవము సమృద్ధిగా వర్ణించబడినది. 'అస్యేశానా జగతో విష్ణుపత్నీ' అని కృష్ణ యజుర్వేదమున కూడ ఆమెయే జగత్తునకు అధీశురాలు అని వర్ణింపబడినది. ( ఆ మంత్రము ఇటు స్మరింపబడినది.) అదేవిధముగ పురుషసూక్తమున గూడ 'పురుష ఏవేదం సర్వం' 'ఉతామృతత్వస్యేశానః' 'వేదాహమేతం' ఇత్యాదిమంత్రములలో పూర్వభాగమున శ్రీమహావిష్ణువుయొక్క వైభవము వర్ణింపబడి ఉత్తరభాగమున 'అద్భ్యః సంభూతః' అను మంత్రములో 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' అనియు, మరియు 'సుమజ్ఞానయే విష్ణవే' 'శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే' అను ఉపనిషద్వాక్యముల వలనను 'లక్ష్మీపతిగా' ఆయన వర్ణింపడినాడు. ఈ విధముగా శ్రీహరియొక్క ఐశ్వర్య వర్ణనముద్వారా లక్ష్మియొక్క గొప్పతనవముకూడ వర్ణించబడినది. 'త్వదాయత్తర్థిత్వే ఉష్యభవదపరాధీన విభవః' అను (31వ) శ్లోకమున ఈ విషయమే ఈగ్రంథకర్తచే కూడ స్పష్టము చేయబడినది. మరియు 'హేలాయామఖిలం' అను (22వ) శ్లోకమునగూడ 'శేషిత్వే పరమః పుమాన్ పరికరాహ్యేతే తవ స్ఫారణే' అని లక్ష్మియొక్క వైభవాధిక్యము వర్ణించబడినది. ఈ విధముగా ' ఇదం హి పౌరుషం సూక్తం సర్వవేదేషు పఠ్యతే' (ఈ పురుషసూక్తము అన్ని వేదములయందును పఠింపబడు చున్నది,) అని యన్నట్లుగా పురుషసూక్తముతోపాటు శ్రీసూక్తముకూడ అన్ని ఉపనిషత్తులలోను పఠింపబడి ఆమెయొక్క గొప్పతనమును చాటుచున్నది. శ్రీసూక్తములో వర్ణింపబడిన లక్ష్మియొక్క మాహాత్మ్యము (క్లుప్తముగా) 'హిరణ్యా వర్ణాం హరిణీమ్' మొదలుకొని 'తాం పద్మనేమీం శరణమహం ప్రపద్యే' వరకును గల పదముల సార్థక్యము విశేషములు :- 1) హిరణ్యవర్ణా :- హిరణ్యముయొక్క వర్ణము వంటి వర్ణముగలది బంగారమువలె పచ్చనిదై ప్రకాశించు వర్ణముగలది అని అర్థము. దీని వలన ఆమె విగ్రహముయొక్క నిర్మలత్వము సూచింపబడినది (లేదా) హిరణ్యమువలె కోరతగిన 'శ్రీ' అను వర్ణముల

(అక్షరముల) సముదాయము కలది అని మరియొక వ్యుత్పత్తి. శ్రీశబ్దమునకు ఆరు రకముల వ్యుత్పత్తి చెప్పబడినది. ఆ విధమైన వర్ణసముదాయము కలది అని. దీనివలన ఆమె యొక్క స్పృహణీయత వ్యక్తమగుచున్నది. 2) హరిణీ :- సువర్ణప్రతిమవలె ఔజ్జ్వల్యము లావణ్యము సౌందర్యముకలది. (నానార్థరత్నమాలలో హరిణీశబ్దమునకు సువర్ణప్రతిమయను నర్థముకూడ కలదు) (లేదా) 'హరిణి యనగా ఆడులేడి. దానివలె విశాలమైన నేత్రములుకలది. (లేదా) 'హరిం నయతి చేతనాన్ ఇతి హరిణీ' చేతనులు హరి యొక్క ఆశ్రయమును పొందునట్లు చేయునది. (లేదా) 'హరిం నయతి చేతనామితి హరిణీ' చేతనులను రక్షించునట్లు శ్రీహరిని ప్రేరేపించునది. 3) సువర్ణ రజతస్రజా :- ఏయే అవయవములకు ఏయే ఆభరణములు తగియున్నవో ఆయా విధములైన బంగారు వెండి ఆభరణములతో ప్రకాశించునది, (దివ్యావయవ ములకు తగిన దివ్యభూషణసముదాయమును ధరించునది) 4) చంద్రా :- చంద్రుని తో సమానమైన ముఖముకలది. (లేదా) ఆహ్లాదమును కలుగచేయునది. 5) హిరణ్మయీ :- తస్మిన్ కామాః సమాహితాః అనునట్లు హిరణ్యమువలె స్పృహణీయ మైన కళ్యాణ గుణ సముదాయముకలది. 6) లక్ష్మీః :- భగవంతుని యొక్కయు, చేతనులయొక్కయు సంపద.) (లేదా) ఉత్తమమైన (పద్మినీజాతి) స్త్రీలక్షణములతో ప్రకాశించునది. 7) అనపగామినీ :- వాత్సల్యగుణము కలది కావున చేతనులయందు దోషములున్నను వారిని విడువనిది 'పాపానాంవా శుభానాంవా వధార్హాణాం ప్లవంగమ। కార్యం కరుణమార్యేణ నకశ్చిన్నాపరాధ్యతి' అని శ్రీమద్రామాయణమున సీతాదేవి యొక్క వాక్యము ఆమెయొక్క వాత్సల్యమును తెలుపు చున్నది. (లేదా) భగవంతుని విడచి యుండనిది.'భగవద్విశ్లేషణాసహా' (భగవంతునితో వియోగమును సహించనిది) అని గోదాఅష్టోత్తరము.'అనన్యారాఘవేణాహం భాస్కరేణప్రభా యథా' (కాంతి సూర్యుని విడచియుండనట్లు నేను రాముని విడచి యుండను) అని సీతవాక్యము. 'అనన్యాహి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా' (కాంతి సూర్యునివిడచి ఉండనట్లు సీత నన్ను విడచియుండదు) అని శ్రీరాముని వాక్యము. 'అన్యేషుచావతారేషు విష్ణోరేషానపాయినీ' (రామకృష్ణాద్యవతారముల యందు, ఇంకను ఇతరములైన అవతారములయందును, ఆమె విష్ణువును విడువనిది) అని శ్రీస్తుతి. 8) అశ్వపూర్వా :- అశ్వములు ముందుకలది. శ్రీరంగ దివ్యనగరమున ప్రథమ ప్రాకారమున అశ్వములుండునని ప్రసిద్ధి. 9) రథమధ్యా :- మధ్య ప్రాకారమున రథములు కలది (పైవలెనే) 10) హస్తినాద ప్రబోధినీ :- ఏనుగుల ఘీంకారముతో నిద్రమేల్కొనునది. మూడవ ప్రాకారమున ( ఆమెకు దగ్గరగా) ఏనుగులుండును కావున ఆ విధముగా నున్న ఏనుగుల ఘీంకారముతో ఉదయమే మేల్కొనునది. ఈ మూడు, (8, 9, 10) నామములు ఆమె యొక్క నిరతిశయైశ్వర్యమును సూచించుచున్నవి. (లేదా)

*కోణపత్ర గజైర్హేమ కమలై రమ్యలోదకైః।*
*సంభృతై స్తర్ప్యమాణాం తాం బోధ్యమానాం చ తైర్గజైః॥*

తనకు ఆసన్నమైన పద్మదల సమీపమున నున్న ఏనుగుల ఘీంకారముచేత నిత్యము మేల్కొలుపబడుచుండెడిది (గజలక్ష్మి) 11) శ్రీః:- నిరతిశయైశ్వర్యయుక్త యైనప్పటికి ని చేతనులను రక్షించవలయునని ఆసక్తితో భగవంతుని ఆశ్రయించునది (ఇందు లక్ష్మియొక్క నిరహంకారత్వము సూచితము.) (శ్రీశబ్దముయొక్క ఆరు వ్యుత్పత్తులలో నిదియొకటి.) 12. దేవీ:-దేవయతి (=క్రీడయతి) కాంతమితి దేవీ. భక్తుల దోషములు తనకాంతునకు కనపడకుండగ ఆతనిచే ఎప్పుడును పాచిక లాడించునది. 'కిమేత న్నిర్దోషః' అని శ్రీగుణరత్నకోశము నందలి (52వ) శ్లోకము లోని 3, 4 పాదములలో ఈ విషయమే శ్రీపరాశర భట్టారకులు స్పష్టముగా చెప్పియున్నారు. (అచటి వీరరాఘవ వ్యాఖ్యకూడ గమనించదగినది.) 13) కా :- కం (సుఖం) అస్యా అస్తీతి కా సుఖ స్వరూపురాలు. అందరకును అనుకూలమైన స్వభావము కలది అని అర్థము. 14) సోత్ స్మితా :- అతిశయించి ప్రకాశించుచున్న చిరునవ్వుతో కూడినది. సహింపరాని అపరాధములు చేసినవారుకూడా ( ఆమె చిరునవ్వును ఆధారముగా చేసికొని ఆశ్రయించుటకు వీలైనది అని అర్థము) (13కు వివరము ఆమెయొక్క సుఖ స్వరూపము ఇందు వివరింపబడినది. ఆమె కేవలము అనుగ్రహస్వరూపము కలది అని చెప్పబడినది.) 15) హిరణ్యప్రాకారా:-పైన చెప్పబడిన (14) అనుగ్రహ స్వరూపము యొక్క ప్రయోజనము ఇందు వివరింప బడినది. 'అజాయమానో బహుధా విజాయతే' సఉశ్రేయాన్ భవతి జాయమానః అని భగవంతుని వర్ణించు నట్లుగానే, శ్రీస్తుతియందు కూడ 'దేవత్వే దేవదేహేయం మనుష్యత్వేచ మానుషీ' అని లక్ష్మీదేవి తనంతటతానే భగవంతునితోపాటు ఆయనకు అనుకూలమైన అభిమతమైన శరీరముతో భూమియందు అవతరించినట్లు వర్ణింప బడినది. (రామకృష్ణాద్యవతారములలో సీతా రుక్మిణీ మొదలగు అవతారములు) ఆ విధముగా అవతరించుట భక్తులను అనుగ్రహించుటకొరకే, (మరియు) హిరణ్మయ ప్రాకారము తో కూడిన ఆనందమయమైన మహామణిమయమంటపమున నివసించునది అనికూడ ఈ పదమునకు అర్థముచెప్పుకొనవచ్చును. 16) ఆర్ద్రా:- అనుకూలుర యందు దయార్ద్రమైన హృదయముకలది అని అర్థము. వారు సమీపించుటకు (లేదా) వారిని రక్షించుటకు అనుకూలమైన తేజస్సు కలది అనికూడ అర్థము చెప్పుకొనవచ్చును. (13, 14, 15, 16 ఒకదానికొకటి వివరణములు) 17) జ్వలంతీ :- ప్రతికూలుర విషయమున తీక్ష్ణముగానుండునది. ప్రతికూలు రనగా- శ్రీగుణరత్నకోశమున 11వ శ్లోకమున (ఆహుర్వేదానమానం) అని అనేక విధములుగా చెప్పబడినవారు. వారి

యందు కోపగించునది అనియర్థము. తనను ఆశ్రయించిన భక్తులు ఎన్ని దోషములు చేసినను క్షమించునది అని చెప్పబడినది కదా, అందువలన ప్రాతికూల్యమనునది తన భక్తులయందు ఉండదని అభిప్రాయము. శ్రీ శ్రీవత్సాంకమిశ్రులు భగవంతుని విషయమున చెప్పిన 'నిత్యానుకూల మనుకూల నృణాం, పరేషా ముద్వేజనం తవతు తేజ ఉదాహరన్తి' (అనుకూలురకు అనుకూల మైన దానినిగాను ప్రతికూలురకు ప్రతికూలమైనదానినిగాను నీ తేజస్సును చెప్పు చున్నారు. అను ఈ వాక్యము 16, 17 పద్యములలో లక్ష్మీదేవికికూడ అన్వయించుకొన వచ్చును.'సౌమ్యా సౌమ్యైః జగద్రూపైః త్వయై తద్దేవి పూరితమ్' (దేవీ, సౌమ్యా సౌమ్యములైన నీ రూపములతో జగత్తు నిండియున్నది.) అని శ్రీస్తుతియందు కూడ చెప్పబడినది. 18) తృప్తా :- తాను అనుభవించెడి భగవత్ స్వరూప రూపగుణ విభవైశ్వర్యాదుల వలనగాని, భగవ ద్శ్లేష జనితానందము వలనగాని తృప్తిని పొందునది. 19) తర్పయంతీ :- పైన (18) లో చెప్పినవిధముగా తాను తృప్తినిపొంది భగవంతుని కూడ తృప్తి పొందించునది. (లేదా) భగవంతుని ఉభయస్వరూపగుణవిభవాది ప్రాపణము ద్వారా భక్తులను తృప్తిపొందించునది. (లేదా) ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని నాలుగు విధములుగానున్న అధికారులను వారివారి అభిలాషలను పూర్తిచేయుటద్వారా తృప్తిని పొందించునది. 20) పద్మేస్థితా :- తనకు సౌందర్య సౌగంధ్య సౌకుమార్యములలో సరియైన పద్మమునందు నిత్యము నివసించునది. 21) పద్మవర్ణా :- ఉత్తమస్త్రీకి ఉండవలసిన పద్మమువలె ఎఱ్ఱనైన హస్తములు పాదములు మొదలైనవి గలది. (లేదా) పద్మ సుకుమారమైన విగ్రహము పద్మారుణవర్ణముకలది. 'నారీణా ముత్తమా వధూః' (స్త్రీలలో ఉత్తమురాలు) అని సీతను వాల్మీకి వర్ణించినది కూడ దీని కుదాహరణము. 22) శ్రీః :- అందరిచేత ఆశ్రయించబడునది. (అరు వ్యుత్పత్తు లలో నొకటి) 23) చంద్రా :- తన గుణములచే భగవంతుని భక్తులనుకూడ ఆనందింప చేయునది. 24) ప్రభాసా :- ఆనందమువలన పుట్టిన హర్షముతో కూడిన గొప్పకాంతి గలది. అనగా తనను ఆశ్రయించినవారి కోరికలను పూరించి సంతోషించునది. శ్రీరాముడు తనను ఆశ్రయించిన విభీషణుని లంక యందభిషిక్తుని చేసి తృప్తి పొందినట్లు శ్రీరామాయణవచనము. అట్టి గుణములే లక్ష్మికికూడ వర్ణింపబడినవి. 25) యశసా జ్వలంతీ :- తనను ఆశ్రయించినవారలను భగవంతుని పొందించుట అనెడి కీర్తితో ప్రకాశించునది. 26) శ్రీః :- ప్రపంచమును తనగుణము లతో వ్యాపించినది. (అరువ్యుత్పత్తులలో నొకటి) 27) దేవజుష్టా :- భగవంతుని యందలి ప్రీతితో అతనిని ఆశ్రయించినది. (లేదా) బ్రహ్మేంద్రాది దేవతలచేత ఆశ్రయింప బడునది. (జుషీ- ప్రీతిసేవనయోః- అనుధాతువు) 28) ఉదారా :- కోరినదానికంటె ఎక్కువగా

ఇచ్చుటచేత వ్యక్తమైన ఔదార్యగుణము కలది. 29) సా :- పైన చెప్పిన విధముగా వేదాన్తముల ( ఉపనిషత్తుల) యందు ప్రసిద్ధిపొందినది. 30) పద్మనేమీ :- నేమి యనగా సుదర్శనచక్రము.'పవిత్రం నేమిః లోకద్వారం సుదర్శనమ్' అని నిఘంటువు. చక్రాకారములోనున్న వికసించిన పద్మముతో ప్రకాశించునది. (లేదా) పద్మము సాధనముగా గలది. అనగా తన చేతియందున్న పద్మముతో, తనను ఆశ్రయించిన వారల అనిష్టమును పోగొట్టి అభీష్టమును నెరవేర్చి తన చరణాంబుజముల యందుండు వారలనుగా చేయునది. ఈ విధముగా శ్రీసూక్తమున శ్రీయొక్క వైభవము శాఖోప శాఖలుగా వర్ణింపబడినది. పురుష సూక్తమున కూడ 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' అని ఆమెయొక్క వైభవమే వర్ణింపబడినది. కావున అన్నియు ఆమెయొక్క వైభవమునే వర్ణించుచున్నవనియు అందువలన ఆమెకే ప్రాధాన్యమనియు శ్రీపరాశరభట్టారకుల అభిప్రాయసారాంశము.

సంస్కృత వ్యాఖ్య :- అస్యేతి। అస్యేశానా జగత ఇతి శ్రుత్యనువాదః । హే శ్రీః । విష్ణుపత్ని। అస్య జగతః ఈశానా ఈశ్వరీత్యనయా శ్రుత్యా తే తవ యాం సమృద్ధిం ఐశ్వర్యం అధీమహే అధీతాం కుర్మహేః అధిపూర్వాత్ 'ఇఙ్ అధ్యయనే' ఇతి ధాతోః ఉత్తమపురుష బహువచనమ్। తాం సమృద్ధిం, చేతి చకారేణాధికాంచ సమృద్ధిం శ్రీసూక్తమ్ 'హిరణ్యవర్ణాం హరిణీమ్' ఇత్యాదికమ్। శాఖానుశాఖం శాఖానుగతాశాఖా యస్మి న్కర్మణి తద్యథా భవతి తథా, సర్వశాఖావచ్ఛేదేనేత్యర్థః । బహుముఖ యతే బహుప్రకారం ప్రతిపాదయతి। యద్వా 'ఇదం హి పౌరుషంసూక్తం సర్వవేదేషు పఠ్యతే' ఇత్యుక్తప్రకారణే శ్రీసూక్తమపి శాఖానుశాఖం స్థితమితిశేషః సర్వాసువేదాన్త శాఖాసు అధీతం సత్, త్వత్సమృద్ధిం బహుముఖయతే ఇత్యర్థః తథాహి :- 1) హిరణ్యవర్ణాం :- హిరణ్యస్య వర్ణ ఇవవర్ణో యస్యాస్తామ్, తద్వత్ పీతభాస్వర విగ్రహ వర్ణామ్, అనేన విగ్రహస్య నిర్మలత్వప్రీత్యా హేయప్రతిభటత్వం సూచితమ్। యద్వా హిరణ్యమివ స్పృహణీయోవర్ణః శ్రీరితి శబ్దోయస్యాస్తాం శ్రీశబ్దోహి షోఢా వ్యుత్పత్తిసూచితత్వేన సర్వవిధోపకారక స్వవాచ్యవస్తుతయా 'శేష ఏష ఇతి శేషతాకృతేః ప్రీతిమానహి పతి స్స్వనామని' ఇత్యుక్త శేషశబ్ద ఇవ స్పృహణీయతమః । 2) హరిణీం :- సువర్ణప్రతిమాం తామివౌజ్జ్వల్య సౌందర్య లావణ్యవతీం యద్వా హరిణీం మృగీం తద్వ ద్విశాల లోచనామ్। 'యోషిద్భిత్తాప్సరోభేదః సువర్ణ ప్రతిమామృగీ, హరితాశ్చ హరిణ్యశ్చ స్యు' రితి నానార్థ రత్నమాలా। హరిం న యతి చేతనానితి చేతనానాం భగవదాశ్రయణే పురుషకార భూతాంవా హరిణీమ్. 3) సువర్ణరజతస్రజాం:- తత్తద్దివ్యావయవోచిత సువర్ణరజతాది మయ దివ్యభూషణకలాపామ్।' అబన్తత్వంహలన్తానా' మితి భాగురి వచనాత్ స్రజా మిత్యాబన్తత్వమ్। 4) చంద్రామ్ :- ముఖే చంద్రసదృశీం, ఆహ్లాదినీం

వా, 'ఛది ఆహ్లాదనే ఇతి ధాతోః' ఇదిత...' ఇతినుమాగమే ఔణాదికే 'రన్' ప్రత్యయే 'అజాద్యత...' ఇతి టాప్యమిచ చంద్రామితి రూపమ్। 5) హిరణ్మయీమ్ :- 'తస్మిన్ కామాః సమాహితాః' ఇతివత్ హిరణ్య స్పృహణీయ కల్యాణ గుణగణ ప్రచురామ్। హిరణ్య ప్రభృతి సకలధన ప్రచురాంవా।6) లక్ష్మీమ్ :- భగవతశ్చేతనానాంచ సంపదమ్। యద్వా లక్ష్మాణ్యుత్తమ శ్రీలక్షణాని అస్యాస్సన్తీతి లక్ష్మీః । తామ్। 'చిహ్నం లక్ష్మచ లక్షణమ్' ఇత్యమరః । 7) అనపగామినీమ్ :- వాత్సల్యాతిశయేన దోషభూయస్త్వేఽప్య విముక్త చేతనజాతామ్ । భగవ న్నిత్యాన పాయినీం వా । 8) అశ్వపూర్వామ్ :- అశ్వాః పూర్వే ప్రథమ ప్రాకారాజిరస్థితా యస్యాస్తామ్। 9) రథమధ్యామ్ :- రథాః మధ్యమప్రాకారాజిరస్థా యస్యాస్తామ్. 10) హస్తినాద ప్రబోధినీమ్ :- హస్తినాం తతోఽపి తృతీయప్రాకారా జిర వర్తినాం నాదైః బృంహితైః ప్రబోధినీం జాగరణశీలాం లక్ష్మీ దివ్యనగరే ప్రథమ ప్రాకారావృత వీథ్యామశ్వాః, ద్వితీయ ప్రాకారావృత వీథ్యాం రథాః, తృతీయప్రాకారా వృత వీథ్యాం హస్తినశ్చ నివసన్తి। తత్ర హస్తినాం తృతీయప్రాకారాన్తః స్థితతయా తేషాం లక్ష్మీ దివ్యభవన సాన్నిధ్యాత్ తన్నాదైః సుప్రాతః ప్రబుద్ధా భవతీత్యర్థః। అనేన తస్యా నిరతిశ యైశ్వర్యం సూచితమ్। యద్వా 'కోణపత్రగజైర్హైమకమలై రమృతోదకైః।సంభృతై స్తర్ప్యమాణాం తాం బోధ్యమానాంచ తైర్గజైః' ఇతి స్వాయంభువ వచనరీత్యా స్వాసన పద్మదలస్థిత హస్తినాదైః అహరహః ప్రబుధ్యమానామ్।11) శ్రియమ్ :- ఏవం నిరంకుశైశ్వర్యేఽపి చేతనతృష్ణయా భగవన్త మాశ్రితామ్ తత్ఫలమాహ।12) దేవీమ్ :- దేవయతి క్రీడయతి కాన్తమితి దేవీ। తామ్। భగవతో భక్త దోషాలక్ష్మీకరణాయ తస్య క్రీడాపారావశ్య మాపాదయన్తీ మిత్యర్థః। తదయం శ్రీపరాశరభట్టార్యోఽపి కథయతి 'కిమేతన్నిర్దోషః కఇహజగతీ' త్యాదినా।13) కామ్ :- కం సుఖమస్యా అస్తీతితాం కామ్। సుఖ రూపామ్। అర్శఆదిత్వాత్ మత్వర్థీయోఽచ్ ప్రత్యయః। సర్వానుకూల స్వభావా మిత్యర్థః। తత్ స్వభావమేవ విశదయతి।14) సోత్స్మితామితి :- ఉత్ అతిశయితం స్మితం ఉత్ స్మితం। ఉత్స్మితేన సహవర్తత ఇతి సోత్స్మితా, తాం, నిస్సహాపరాధజన నిశ్శంక సంశ్రయణాయ నిత్యవ్యక్తమందహాసాం। అనేనానుగ్రహ మయీత్వం సూచితం। తత్కార్యమాహ। 15) హిరణ్యప్రాకారామ్:-'అజాయమానో బహుధా విజాయతే' 'సఉశ్రేయాన్ భవతి జాయమాన' ఇతివత్ । దేవత్వే దేవ దేహేయం మనుష్యత్వేచ మానుషీ। రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణోరేషా నపాయినీ' ఇతీచ్ఛాకృతోజ్జ్వలానేక భగవద భిమతానురూప విగ్రహాం। హిరణ్మయ ప్రాకారపరివృతా నందమయ మహామణిమండపాన్త ర్నివాసినీం వా॥ 16) ఆర్ద్రామ్ :- అనుకూలవిషయే దయార్ద్ర దృశం । అనుకూల తేజసంవా 17) జ్వలన్తీమ్ :-

ప్రతికూల విషయే జ్వలన్తీం తదభిభావక తేజో యుక్తాం। నిత్యాకూల మనుకూలన్యణాం పరేషా ముద్వేజనం తవతు తేజ ఉదాహరన్తి ఇతి శ్రీవత్సాఙ్కశ్రీసూక్తిః శ్రీవిషయేఽపి సమానా। ప్రతికూలత్వంచ ప్రాతికూల్యా కర్తృబుద్ధ్యా బోధ్యమ్।18) తృప్తామ్ :- స్వకృతేన భగవత్స్వరూప రూపగుణ విభూత్యను భవేన తత్సంశ్లేష జనితానందేనవా తృప్తామ్। 19) తర్పయన్తీమ్ :- భగవత్కృత స్వరూపాద్యనుభవేన స్వసంశ్లేష సుఖేనవా తం తర్పయన్తీమ్। స్వస్వ కాన్తోభయ స్వరూప రూపగుణ విభూత్యనుభవ ప్రాపణేన సంశ్రితాం స్తర్పయంతీంవా, 'ఆర్తోజిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ' ఇత్యుక్త చతుర్విధాధికారిణ స్తత్తదభిలషిత ప్రాపణేన తర్పయంతీంవా। 20) పద్మేస్థితామ్ :- స్వ సౌన్దర్య సౌగంధ్య సౌకుమార్యానుగుణ సుందర సుగంధ సుకుమార సరసిజాసనాసీనామ్. 21) పద్మవర్ణామ్ :- 'నారీణా ముత్తమా వధూః' ఇత్యుక్త ప్రకారేణోత్తమ కాంతాత్వేన పద్మారుణ పాణి పాదతల ప్రాన్తలోచనామ్, పద్మసమ విగ్రహ వర్ణాంవా। 22) శ్రియమ్ :-సర్వై రాశ్రయణీయామ్। (ఆరు వ్యుత్పత్తులలో నొకటి) 23) చంద్రామ్ :- చందయ త్యానంద యతి చేతనా నీశ్వరంచ స్వగుణైరితి చంద్రా। తాం। చంద్రామ్।24) ప్రభాసామ్ :- భాసో భాసనం। తదానందజనిత హర్షసంభూత ప్రకృష్ట కాన్తిమ్। 'అభిషిచ్యతు లంకాయాం రాక్షసేంద్రం విభీషణం కృతకృత్య స్తదారామో విజ్వరః ప్రము మోదహ' ఇతివత్। 25) యశసా జ్వలన్తీమ్ :- యశసా సంశ్రితానాం సర్వాభీష్ట ప్రాపణ కీర్త్యా జ్వలన్తీం। సోపబృంహణ శ్రుత్యా లోకేచ ప్రకాశమానామ్. 26) శ్రియమ్ :- జగద్గుణైర్భోజ యన్తీమ్। (ఆరు వ్యుత్పత్తులలో నొకటి) 27) దేవజుష్టామ్ :- దేవే నారాయణే 'దివ్యో దేవ ఏకో నారాయణః' ఇతిశ్రుతేః। జుష్టాం ప్రీతాం ప్రేమసంపన్నాం। దేవైః బ్రహ్మాదిభిః తత్తదభిలషిత లాభాయ జుష్టాం సేవితాంవా। 'జుషీ ప్రీతి సేవనయోః' ఇత్యు భయత్ర ధాతుః। 28) ఉదారామ్ :- కాంక్షాధిక దాతృత్వలక్షణ నిరతిశయౌదార్యామ్। 29) తామ్ :- ఉక్త వైభవయుక్తతయా సర్వవేదాన్త ప్రసిద్ధాం। 30) పద్మనేమీమ్ :- నేమిః సుదర్శనం। 'పవిత్రం నేమిః లోక ద్వారం సుదర్శనం' ఇతి నిఘంటుః। పద్మం నేమిరివ యస్యాస్తాం। చక్రాకార వికసితపద్మ పాణిమిత్యర్థః। యద్వాపద్మమేవ నేమిః నయనసాధనం యస్యాస్తాం। 'నియోమిః' ఇత్యౌణాదికో 'మి' ప్రత్యయః। స్వ కరస్థ కమలేన ఆశ్రితా నామనిష్ట మపనీయ సర్వమిష్టముపనీయ స్వచరణాంబుజే తాన్ ప్రాపయంతీ మిత్యర్థః॥

ఏవమాది ప్రకారేణ శ్రీసూక్తం శ్రీసమృద్ధిం బహుముఖ యత ఇతి బోధ్యమ్। నను 'దేవిశ్రుతిం' ఇత్యాదినా మత్సమృద్ధేః సర్వశ్రుతి వేద్యతాం ప్రతిజ్ఞాయ 'అస్యేశానా జగతః... శ్రీసూక్తం బహుముఖయత' ఇతి పూర్వకాండస్థ యత్కించి ద్వాక్యస్య శ్రీసూక్తస్యచ మత్సమృద్ధి ప్రతిపాదకత్వ ముపపాదితం। తావతా పురుష సూక్తాది

రూపాయాః శ్రుతేః కథం మత్సమృద్ధి పరత్వ మిత్యత ఆహ :- ఈష్ట ఇతి। పౌరుషే సూక్తే పురుషసూక్తాఖ్య ఉపనిషది కశ్చిత్ పురుషో జగతః ఈష్టే జగత ఇతి కర్మణిషష్ఠీ జగన్నియమయతీత్యర్థః। 'ఈశఐశ్వర్యే' ఇత్యస్మాద్ధాతోః అదాదికాచ్ఛపోలుకి లటస్తజీ తకారస్య ఏత్వే 'వ్రశ్చ' ఇతిషత్వేష్టుత్వేచ 'ఈష్టే' ఇతి రూపం। అయం చార్థానువాదః। 'పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యం। ఉతామృతత్వస్యేశానః' ఇత్యేవ శ్రవణాత్। ఇతి యడుక్తః తం తత్ప్రతిపాదితం, చేతి చకారేణ మహానారాయణ మహోపనిషదాది ప్రతిపాదితం చేతి లభ్యతే పురుషమితి శేషః। ఉత్తరోఽనువాకః అద్భ్యః సంభూతానువాకః। చేతి చకారేణ 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' సుమజ్జానయే విష్ణవే'। 'శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే' ఇత్యాది వేదాన్త వాక్యంచ సంగృహ్యతే। తం చ త్వత్కం తావకమ్। పతిం స్వామినమ్। అధిజగౌ అధికం గాయతిస్మ। త్వత్పతిత్వకృత సమృద్ధింప్రత్యపాదయ దిత్యర్థః। తతశ్చ తస్య త్వదధీనసమృద్ధికత్వాత్ తత్సమృద్ధి పరాణాం పురుషసూక్తాదీనాం త్వత్సమృద్ధి పరత్వమితి సాధూక్తమ్। తస్య త్వదధీన సమృద్ధికత్వంచ వక్ష్యతి 'త్వదాయత్తర్థత్వే హ్యభవదపరాధీనవిభవః' ఇతి। అయంభావః। పురుషసూక్త నారాయణమహో పనిషదాది ప్రతిపాదితస్య మహావిభవస్య భగవతో 'వేదాహమేతం పురుషం మహాన్త మాదిత్యవర్ణం తమసః' ఇతి పురుషసూక్త తుల్యాను పూర్వ్యావగత దైవతైక్యోఽద్భ్యః సంభూతానువాకో 'హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ' సుమజ్జానయే విష్ణవే' శ్రద్ధయాదేవో దేవత్వ మశ్నుతే ఇత్యాది ప్రకారేణచ తస్య లక్ష్మీపతిత్వం ప్రత్యపాదయత్। తద్వైభవం సర్వం లక్ష్మీపతిత్వ ప్రయుక్త మవగమయతీతి తత్సమృద్ధిపరా సర్వాపి శ్రుతిః శ్రీసమృద్ధి పరైవ॥

అ :- అత్యాదరేణోపనిషత్ప్రతిపాద్యతాం వదన్నేవ నకేవల ముపనిషత్ త్వద్వైభవం ప్రతిపాదయతి, కింత్వితిహాసాదయోఽపీత్యాహ।

శ్లో॥ ఉద్బాహు స్త్వా ముపనిషదసా వాహ నైకా నియన్త్రీం
శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే।
స్మర్తారోఽస్మజ్జనని యతమే సేతిహాసైః పురాణైః
నిన్యుర్వేదా నపిచ తతమే త్వన్మహిమ్ని ప్రమాణమ్॥ ౧౪

అ :- హే అస్మజ్జనని= ఓ మాతా, అసౌ=ఈ, ఉపనిషత్=ఉపనిషద్వర్గము, ఏకా= ఒక్కటి మాత్రమే, ఉద్బాహుః=బిగ్గరగా (స్పష్టముగా), త్వామ్= నిన్ను, నియంత్రీమ్ =యజమానురాలిగా (ప్రపంచమును నియమించు దానినిగా), న ఆహ=చెప్పలేదు, శ్రీమద్రామాయణమపి=శ్రీమద్రామాయణముకూడ, త్వచ్చరిత్రే = నీచరిత్రయందు, పరమ్=ఎక్కువగా, ప్రాణితి=జీవించుచున్నది, యతమే= ఎవరైతే, స్మర్తారః=స్మృతి ప్రణేతలైన పరాశరాదిమహర్షులు కలరో, తతమేఽపిచ =వారుకూడ, వేదాన్=

వేదములను, సేతిహాసైః= భారతాది ఇతిహాసములతో కూడిన, పురాణైః= పురాణము లతో, (శ్రీవిష్ణుపురాణాదులతో), త్వత్ మహిమ్ని=నీయొక్క మాహాత్మ్య ప్రతి పాదనమునందు, ప్రమాణమ్= ప్రమాణమైన వానినిగా, నిన్యుః= పొందించిరి..

తా :- జననీ, నీయొక్క మాహాత్మ్యము చేతులెత్తి 'ఇది ముమ్మాటికి నిజము' అనునట్లుగా ఉపనిషత్తులలో బిగ్గరగా చెప్పబడుచున్నది. శ్రీమద్రామాయణము కూడ నీ చరిత్రను చెప్పుటవలననే ఖ్యాతి పొందినది. అటులనే స్మృతి కర్తలైన మహర్షులు భారతాది ఇతిహాసములద్వారాను, శ్రీవిష్ణుపురాణము మొదలగు పురాణముల ద్వారా ను, వేదములను నీయొక్క మాహాత్మ్యమును తెలుపుటలో ప్రమాణములైన వానినిగా చెప్పియున్నారు.

వి :- మనము ఏదైన విషయమును స్పష్టముగా చెప్పదలచినచో చేతులెత్తి బిగ్గరగా చెప్పుట జరుగుచుండును. అట్లే శ్రీసూక్తాది ఉపనిషత్తు లన్నియు వైతాళికులవలె లక్ష్మీదేవియొక్క మాహాత్మ్యమును చేతులెత్తి బిగ్గరగా చాటుచున్నవి. (13వ శ్లోకములో చెప్పుకొన్నట్లుగా). అంతేగాక 'సీతాయాశ్చరితం మహత్' అని శ్రీమద్రామాయణము నందు వాల్మీకి స్వయముగా సీతయొక్క చరిత్రద్వారా కృప, పారతంత్ర్యము, అనన్యార్హత్వము మొదలైన లక్ష్మియొక్క గుణవైభవమును వర్ణించి యున్నాడు. ఇచట 'పరంప్రాణితి' అను పదములలో 'పరం' అను పదము- 'శ్రీరాముని చరిత్రవలన శ్రీమద్రామాయణమునకు ప్రసిద్ధి వచ్చినప్పటికిని, నీ (సీత) చరిత్ర వలననే ఎక్కువగా ప్రసిద్ధి వచ్చినది.' శ్రీమద్రామాయణము ఎక్కువగా జీవించినది అను విశేషార్థమును చెప్పుచు సార్థకమగుచున్నది. అట్లే భారతము శ్రీవిష్ణుపురాణము మొదలగు ఇతిహాస పురాణాదులద్వారా 'వేదములే లక్ష్మియొక్క గుణవర్ణనములో ప్రమాణమైనవి' అని వ్యాస పరాశరాది మహర్షులు చెప్పియున్నారు. ఈ విధముగ అన్నింటియందును లక్ష్మియొక్క గుణ వైభవమే వర్ణింపబడినది.

సంస్కృత వ్యాఖ్య :- ఉద్బాహురితి। హే అస్మజ్జనని। అసావుపనిషదేకా ఏవ శ్రీసూక్తాదిరూపా వైతాళిక ఇవ త్వమేవ జగత్స్వామినీతి శపథం కుర్వాణేవవా ఉద్బాహుః ఉద్యత బాహుస్సతీ త్వాం నియంత్రీం జగత్ స్వామినీం, నాహ। కింతు శ్రీమద్రామాయణమపి త్వచ్చరిత్రే పరం తవ చరిత్రే సత్యేవ ప్రాణితి జీవతి। తవ చరిత్ర ప్రతిపాదనరూప ధారకేణైవ జీవతీతి భావః। యద్వా పరమితి క్రియా విశేషణమ్, సోత్కర్షమిత్యర్థః । త్వచ్చరిత్రే ఇత్యధికరణే సప్తమీ। తథాచ రామాదిచరిత్రే ప్రాణితి జీవనమాత్రం ధత్తే। త్వచ్చరిత్రేతు పరం ప్రాణితి సోత్కర్షం జీవతీత్యర్థః। అతిశయిత జీవనస్యైవ ఫలత్వాదితి హృదయమ్। ప్రపూర్వాత్ 'అనప్రాణనే' ఇత్యస్మాద్ధాతోః 'రుదాదిభ్యః సార్వధాతుకే' ఇతి ఇటి ణత్వేచకృతే 'ప్రాణితి' ఇతి రూపమ్। త్వచ్చరిత్రే

పరం ప్రాణితీత్యనేన 'కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్' ఇతి వాల్మీకి వచనం స్మారితమ్। సీతా చరిత మహత్త్వంచ తత్పురుషకారోపయుక్త కృపాపారతంత్ర్యానన్యార్హత్వ ప్రతిపాదనేన । కృపాప్రకాశనం రావణాపహారకృతే భగవతా సీతాయాః ప్రథమ వియోగే సుస్పష్టమ్। తథాహి రావణ వధానంతరం రామ విజయరూప ప్రియాఖ్యాపకతయా సన్నిహితాత్ మహోపకారాత్ స్వస్యా మాగ్ర్దా పరాధా శ్చిత్రవధార్హా రాక్షసీర్దృష్ట్వా తదపరాధానుగుణం చిత్రవధం కర్తుముద్యతా న్మారుతేః।

పాపానాంవా శుభానాంవా వధార్హాణాం ప్లవంగమ।
కార్యం కరుణమార్యేణ నకశ్చి న్నాపరాధ్యతి ॥

ఇత్యాద్యుపదేశేన తాసాం సంరక్షణాత్ మహతీకృపా ప్రకాశితా స్వయం రావణ గృహే బందీభూయ బందీకృతసురసుందరీ విమోచనాద్వా మహతీకృపా ప్రకాశితా ద్వితీయవిశ్లేషే భర్తృనియమనానతిక్రమణేన వాల్మీక్యాశ్రమే తస్యానివాసాత్ పారతంత్ర్యం ప్రకాశితమ్। తృతీయవిశ్లేషే పతిపరిత్యక్తాయాస్తస్యాః పృథగాశ్రయా నవలంబేన భూమౌప్రవేశా దనన్యార్హత్వం ప్రకాశితమితి కృత్స్నస్యాపి శ్రీరామయణస్య సీతాచరితత్వం సిద్ధమ్ । యతమే యే స్మర్తారః స్మృతిప్రణేతారః పరాశరాదయః తతమేఽపి। అపి చేత్యేకం పదమ్। యత్తచ్ఛబ్దౌ 'డతమచ్' ప్రత్యయాన్తౌ సర్వనామ సంజ్ఞౌ। వేదాన్ తత్త్వహిత పురుషార్థ వేదకతయా వేదశబ్దవాచ్యాన్ ఆమ్నాయాన్ సేతిహాసైః ఇతిహాస సహితైః, ఇతిహాసశబ్దేన భారతాదిర్వ్యహ్యతే, శ్రీరామాయణస్య పూర్వమేవ నిర్దేశాత్। పురాణైః శ్రీవిష్ణుపురాణాదిభిః త్వన్మహిమ్ని తవ విభవే ప్రమాణం భావప్రధానోఽయం నిర్దేశః ప్రమాణతామిత్యర్థః। నిన్యుః నయన్తిస్మ। వేదానాం త్వ న్మహిమా వేదకతయా తత్ప్రమాణతాం స్మృతీతిహాసపురాణైః పరాశరాదయో ఽదర్శయన్నిత్యర్థః। నిన్యురితి నియోర్ద్వికర్మకత్వాత్ కర్మద్వయమ్ ॥

అ :- ఇత్థం లక్ష్మీవిభవే సపరికరం ప్రమాణ ముపన్యస్య తత్ప్రతి పన్నం తదైశ్వర్యమాహ।

శ్లో ॥ ఆక్షుద్రగ్రామ నియామకా దపి విభో రా సర్వనిర్వాహకాత్
ఐశ్వర్యం యదిహోత్తరోత్తరగుణం శ్రీరఙ్గభర్తుః ప్రియే ।
తుఙ్గ మ్మఙ్గళ ముజ్జ్వలం గరిమవత్ పుణ్యం పునః పావనం
ధన్యం యత్తదదశ్చ వీక్షణభువ స్తే పఙ్క్తుషా విప్రుషః ॥ ౧౫

అ :- శ్రీరంగభర్తుః=శ్రీరంగనాథునియొక్క, ప్రియే=ప్రియురాలైన ఓ లక్ష్మీదేవీ, ఆక్షుద్రగ్రామ నియామకాత్=చిన్నగ్రామముయొక్క అధిపతి మొదలుకొని, సర్వ నిర్వాహకాత్=సర్వలోకనియంతయైన, ఆవిభోః=బ్రహ్మా పర్యంతము, ఉత్తరోత్తర

గుణమ్=ఉత్తరోత్తరాతిశయముతో కూడిన, యత్ ఐశ్వర్యమ్(అస్తి)=ఏ ఐశ్వర్యము కలదో, తత్=ఆ ఐశ్వర్యమున్ను, తుంగమ్= ఉన్నతమ్మైనదియు, మంగళమ్= మంగళకర మైనదియు, ఉజ్జ్వలమ్=ప్రకాశించునదియు, గరిమవత్= గొప్పతనము కలిగినదియు, పుణ్యమ్= పవిత్రమ్మైనదియు, పునః=మరియు, పావనమ్= పవిత్రముచేయునదియు, ధన్యమ్=అదృష్టహేతువైనదియు, యత్(ఐశ్వర్యంఅస్తి)= ఏ ఐశ్వర్యముకలదో, అదః చ=ఈ ఐశ్వర్యమున్ను, తే=నీయొక్క, వీక్షణభువః= అవలోకనముయొక్క, పంచషాః =ఐదు(లేక) ఆరు, విప్రుషః= బిందువులు మాత్రమే, (లేశముమాత్రమే).

తా :- గ్రామాధికారినుండి బ్రహ్మపర్యంతముగల అధిపత్య రూప చేతనైశ్వర్యమును, ఇంకను ఈప్రపంచమున విస్తారముగా కనిపించుచున్న తుంగ మంగళ ఉజ్జ్వలాది రూపమ్మైన అచేతనైశ్వర్యమును, ఈరెండింటికిని భిన్నమైన ఐశ్వర్యమును, నీయొక్క కటాక్ష వీక్షణ లేశమాత్రముననే ఉద్భవించుచున్నవి.

వి:- లక్ష్మీ కటాక్ష వీక్షణములో లేశమాత్రమే ఐశ్వర్యమునకు కారణమగు చున్నది. చిన్నపల్లెకు ప్రభువగుటకున్ను, ప్రపంచమునకే అధిపతియగుటకున్ను, అట్లే తుంగమంగళాదిరూప ఐశ్వర్యమునకున్ను అదియేకారణము. ఇచట తుంగ పదము మేరువు మొదలైన పర్వతములను, మంగళపదము చందనకుసుమాది మంగళ వస్తువులను, ఉజ్జ్వలపదము సూర్యుడు మొదలగు ప్రకాశపదార్థములను, గరిమవత్ అను పదము హిమవంతుడు మొదలగు ఖ్యాతిగలపర్వతములను, పుణ్యపదము పరలోకసాధనములైన యజ్ఞాదులను, పావనపదము పవిత్రముచేయు కావేరి మొదలగు నదులను, ధన్యపదము నవనిధులను తెలుపును. చకారము ఈ రెండింటికి భిన్నమైన ఐశ్వర్యమును తెలుపును. ఈ విధముగా చేతనుల ఉత్తరోత్తరాభివృద్ధి సూచక మగు ప్రభుత్వముతోపాటు, అచేతనముల యందలి తుంగత్వమంగళత్వాది లక్షణములు, ఇంకను ఇతరములైన ఐశ్వర్యములుకూడ లక్ష్మీకటాక్ష వీక్షణలేశమున జనించినవే యని తెలిసికొనదగును.

సంస్కృత వ్యాఖ్య :- ఆకుగ్రామేతి। హే శ్రీరంగభర్తుః ప్రియే శ్రీరంగ రాజవల్లభే ఆకుగ్రామనియామకాత్ కుగ్రామనియామకమారభ్య కుగ్రామో గ్రామవాటికా, పల్లీత్యర్థః। సర్వనిర్వాహకాత్ సర్వలోకశాసితుః అవిభోరపి బ్రహ్మ పర్యన్తం, ఉత్తరోత్తరగుణం ఉత్తరోత్తరాతిశయితం, యదైశ్వర్యమస్తి। తుంగం ఉన్నతం మేర్వాది, మంగళం చందనకుసుమాది ఉజ్జ్వలం మణి ద్యుమణి, దీపాది, గరిమవత్ గురుత్వ గుణయుక్తం హిమవన్మందరాది, పుణ్యం పరలోకసాధనభూతం యజ్ఞాది, పునః భూయః, పావనం పవిత్రీకుర్వత్ కావేరీ ప్రభృతి, ధన్యం భాగ్యఫలభూతం నవ నిధి రూపం చేతి, యదైశ్వర్యమస్తి తత్ పూర్వోక్తం కుగ్రామాధిప ప్రభృతి సర్వప్రభు

పర్యన్తైశ్వర్యం, అదశ్చ ఇదం తుంగాద్యైశ్వర్యమ్ ।చేతి చకారేణానుక్తమన్యదప్యైశ్వర్యమ్। తే తవ వీక్షణభువః కటాక్షకందళితాః, పంచవా షడ్వామానం యేషాం తే పంచషాః 'సంఖ్యావ్యయేతి' సూత్రేణ బహువ్రీహిసమాసే 'బహువ్రీహౌసంఖ్యేయే' ఇత్యాది సూత్రేణ 'డచి' 'టేః' ఇతిటి లోపే పంచషా ఇతి రూపమ్। విప్రుషో బిందవః లేశాత్యర్థః। లోకే సమీచీనం సర్వం వస్తు త్వత్కటాక్ష లేశా యత్త మిత్యుక్తంభవతి ॥

అ :- సంప్రత్యైశ్వర్య దారిద్ర్యయోః లక్ష్మీకటాక్ష తదభావహేతుకతా ముదాహరతి।

శ్లో ॥ఏకో ముక్తాతపత్ర ప్రచల మణిఘణాత్కారిమౌళి ర్మనుష్యో
దృప్యద్దన్తావళస్థో నగణయతి నతాన్ యత్ క్షణం క్షోణిపాలాన్।
యత్తస్మై తిష్ఠతేఽన్యః కృపణ మశరణో దర్శయన్ దన్తపఙ్క్తిం
తత్తే శ్రీరఙ్గరాజప్రణయిని! నయనోదఞ్చిత న్యఞ్చితాభ్యామ్ ॥ ౧౬

అ :- హే శ్రీరంగరాజ ప్రణయిని=శ్రీరంగనాథుని ప్రేయసివైన ఓ లక్ష్మీ దేవీ, ఏకః మనుష్యః= ఒకమనుజుడు, దృప్యత్ దంతావళస్థః= మదించిన ఏనుగుపై కూర్చున్న వాడై, ముక్తాత...మౌళిః, ముక్తాతపత్ర= ముత్యాలగొడుగు నందు, ప్రచల= బాగుగా తిరుగుచున్న, మణిఘణాత్కారి= మణిఘట్టనవుచేత ధ్వని చేయబడుచున్న, మౌళిః= శిరముననున్న కిరీటము గలవాడై, నతాన్= నమస్కరించిన క్షోణిపాలాన్= సామంతరాజులును, న గణయతి ఇతి యత్= లెక్కచేయడు అనుమాట ఏదైతే కలదో, అన్యః= మరియొక మనుజుడు, అశరణః (సన్)= వేరొక దిక్కులేని వాడై, కృపణమ్ (యథా)= జాలికలుగునట్లుగా, తస్మై= ఆ ఏనుగుపైనున్న మనుజుని కొరకు, దంతపంక్తిం దర్శయన్= దంతములను చూపుచు (దీనముగా నవ్వుచు), తిష్ఠతే ఇతియత్= (తన అభిప్రాయమును తెలియజేయుచు) నిలచియుండును అనే మాట ఏదైతే కలదో, తత్= అది (చక్రవర్తిత్వము, దీనత్వమున్ను), తే= నీయొక్క, నయనోదంచిత న్యంచితాభ్యామ్= నేత్రములయొక్క ఉన్మీలన నిమీలనముల (తెరచుట మూయుటల) వలన, (భవతి= అగుచున్నది.)

తా :- ఓ లక్ష్మీదేవీ, అందరూ మనుజులేయైనను, ఒకరు చక్రవర్తియై ఇతరులను లక్ష్యపెట్టకుండుటకును, మరియొకడు దరిద్రుడై అతనినే శరణువేడుటకున్ను, నీయొక్క కటాక్ష వీక్షణావీక్షణములే కారణములు.

వి :- లక్ష్మియొక్క కటాక్షవీక్షణావీక్షణములే చక్రవర్తిని చేయుటకును దరిద్రుని చేయుటకును కారణములుగా చెప్పబడినవి. చక్రవర్తిని మదించిన ఏనుగుపై నున్నట్లు వర్ణించుట అతని ఐశ్వర్యోన్నతితో పాటు, గర్వోన్నతికిని నిర్లక్ష్యవైఖరికిని

నిదర్శనము. ఇంక దరిద్రుని విషయమున దంతపంక్తిని చూపుచు నిల్చియుండుట అతని అశక్తతకు నిదర్శనము.

సంస్కృత వ్యాఖ్య :- ఏక ఇతి। హే రంగరాజప్రణయిని। ఏకో మనుష్యః దృష్ట్వద్దంతావళస్థః మదద్విరదమస్తకస్థితః ముక్తాతపత్ర ప్రచలమణిఘణాత్కారిమౌళిః ముక్తాతపత్రే మౌక్తికఛత్రే గజగమనేన ప్రచలైః మణిభిః ఘట్టనే ఘణాత్కారిభిః శబ్దాయమానో మౌళిః కిరీటం యస్య సతథోక్త స్సన్ నతాన్ నమ్రాన్ క్షోణిపాలాన్ నానా మండలాధిపతీన్ నగణయతీతి యత్ ఇయమైశ్వర్యపరాకాష్ఠా।

అథదారిద్ర్యకాష్ఠామాహ :- అన్య ఇతి। అన్యః ఇతరో మనుష్యః అశరణః రక్షకాంతరరహితస్సన్ కృపణం దైన్యప్రకాశో యథా భవతితథా దంతపంక్తిం దర్శయన్ తస్మై దంతావళస్థితాయ పురుషాయ తిష్ఠతే స్వాభిప్రాయం ప్రకటయన్నాస్తే। ఇతి యత్తదుభయం క్రమేణ తే తవ నయనోదంచిత న్యంచితాభ్యామ్ । నయనయో రుదంచితేన కటాక్షేణ న్యంచితేన సంకోచేన చ భవతీతి శేషః ॥

అ :- 'సశ్లాఘ్య స్సగుణీధన్య స్సకులీన స్సబుద్ధిమాన్। సశూర స్సచ విక్రాన్తో యం త్వం దేవి । నిరీక్షసే' ఇత్యుక్త ప్రమాణానుసారేణ సర్వసంపదాం లక్ష్మీభ్రూవిలాస ప్రసరాభిముఖ జంఘాలతామాహ।

శ్లో ॥ రతి ర్మతి సరస్వతీ ధృతి సమృద్ధి సిద్ధిశ్రియః
సుధాసఖి యతోముఖం విచలిషే త్తవ భ్రూలతా।
తతో ముఖ మథేన్దిరే ! బహుముఖీ మహమ్పూర్వికాం
విగాహ్యచ వశంవదాః పరివహన్తి కూలఙ్కషాః॥ ౧౨

అ:- సుధాసఖి= అమృత సహోదరియైన, హే ఇందిరే= ఓ లక్ష్మీదేవీ, తవ భ్రూలతా =నీయొక్క కనుబొమ్మ, యతోముఖమ్= ఏమనుజుని వైపుగా విచలిషేత్= చలించుట కుత్సహించునో, తతోముఖమ్= ఆమనుజునివైపుగానే, అథ= వెనువెంటనే , రతిః= ప్రీతియు, మతి... శ్రియః, మతి= జ్ఞానము, సరస్వతీ= వాక్కు, (లేదా సరస్వతీదేవి) ధృతి= స్థైర్యము, సమృద్ధి= పరిపూర్ణత్వము, సిద్ధి= కార్యసిద్ధి, (కోరికలు తీరుట) శ్రియః= సంపదలుకూడ, బహుముఖీమ్= సర్వతోముఖమైన, అహంపూర్వికామ్ =నేనుముందు నేనుముందు అనుభావమును (పరస్పరస్పర్ధను) విగాహ్య= పొంది, వశంవదాః= వశములైనవై, కూలంకషాః= కట్టలుదాటి ప్రవహించు నవై, (సంపూర్ణము లై), పరివహన్తి= ప్రవహించుచున్నవి. (వృద్ధి పొందుచున్నవి).

తా :- ఓ లక్ష్మీదేవీ, నీయొక్క కనుబొమ్మ ఎటు ప్రయాణము చేయుటకు ఇచ్ఛగించునో ఆ పురుషుడు రతి ధృతిసరస్వత్యాదుల సంపూర్ణతను పొంది ప్రకాశించును.

వి :- సుధాసఖి అను విశేషణము ఆమె అమృతమువలె మధురమ్మైనదై జగత్తునకు ప్రాణమును పోయునది అను అర్థమును చెప్పును. అందువలననే ఆమెయొక్క భ్రూలతకు చలించవలయుననెడి ఇచ్ఛకలిగినంత మాత్రముననే సమస్త వస్తు పరిపూర్ణత్వము వర్ణించబడినది. నిజముగా చలించినచో ఆ మనుజుని సమృద్ధి విషయమున వేరుగా చెప్పనక్కరలేదు. అహమహమికకు 'పైన చెప్పిన రతి ధృత్యాదులు ఆమెయొక్క ఆజ్ఞలను శిరసావహించు దాసీజనముగా (చెలికత్తెలుగా) తమలోతాము కలహించుకొని 'నేను ముందు నేను ముందు' అని ఆతనిని చేరుచున్నవని' యర్థము. పరివహన్తి (ప్రవహించుచున్నవి) అను పదమునకు 'పుత్రపౌత్ర శిష్యప్రశిష్య పరంపరాపర్యంతము స్థిరముగ నిలచును' అని యర్థము. ఎంతకాలము ఎంతమంది అనుభవించినను తరగని గనిగా పరిపూర్ణముగా నుండునట్టి రతి ధృతి సరస్వత్యాదులు లక్ష్మియొక్క భ్రూలత చలించవలయుననెడి ఇచ్ఛచేతనే మనుజులకు కలుగునని మొత్తముమీద సారాంశము.

సంస్కృత వ్యాఖ్య :- రతిరితి। హే సుధాసఖి! అమృతసోదరి! అనేనమధురతమత్వం జగదుజ్జీవనహేతుత్వంచ వ్యంజితమ్। హే ఇందిరే! తవభ్రూలతా యతోముఖం యత్పురుషాభిముఖం చిచలిషేత్ చలితుమిచ్ఛేత్, చలనం వినాపి చలనేచ్ఛాయామేవ తతోముఖం తత్పురుషాభిముఖం రతిః ప్రీతిః మతిసరస్వతీ ధృతిసమృద్ధి సిద్ధి శ్రియః మతిః జ్ఞానమ్ సరస్వతీవాక్ వాగధిదేవతాచ ధృతిః స్థైర్యం, సమృద్ధిః పరిపూర్ణత్వం సిద్ధిః అఖిలషితావాప్తిః, శ్రియః సంపదశ్చ, అథసాకల్యేన, 'ప్రశ్నకార్త్స్న్యయో ష్వథో అథ' ఇత్యమరః । బహుముఖీం బహుప్రకారాం, అహం పూర్వికాం 'అహం పూర్వం ప్రవహామి అహం పూర్వం' ఇత్యహన్తాం విగాహ్య ప్రవిశ్య వశంవదాః విధేయాః సత్యః, కూలంకషాః ఉద్వేలాః, పరివహన్తి పుత్రపౌత్ర శిష్యప్రశిష్య పర్యన్తం ప్రసరన్తీత్యర్థః। సర్వకూలాభ్రకరీషేషుకషః' ఇతి 'ఖచ్' ప్రత్యయే ముమాగమేచ కృతే 'కూలంకషా' ఇతి రూపమ్ ॥

అ :- సమస్తవస్తు నీచోచ్ఛభావో లక్ష్మీకటాక్ష వికాస సంకోచాయత్త ఇత్యాహ।

శ్లో ॥ సహస్థిర పరిత్రస వ్రజ విరిఞ్చినాకిఞ్చనైః
అనోకహ బృహస్పతి ప్రబల విక్లబ ప్రక్రియమ్ ।
ఇదం సదసదాత్మనా నిఖిలమేవ నిమ్నోన్నతమ్
కటాక్ష తదుపేక్షయో స్తవ హి లక్ష్మి! తత్తాణ్డవమ్ ॥ ౧౮

అ:- హే లక్ష్మి- ఓ లక్ష్మీదేవీ, స్థిర= స్థావరములయొక్క, పరిత్రస= జంగమముల యొక్క, వ్రజ= సమూహములతోను, విరించన= బ్రహ్మనుండి, అకించనైః సహ= దరిద్రుని వరకు గలవారితో, అనోకహ= చెట్టునుండి, బృహస్పతి= బృహస్పతి వరకు

కలిగినట్టియు, ప్రబల= బలవంతులు, విక్లబ= దుర్బలులు, (అను) ప్రక్రియమ్= ప్రకృష్ట మైన క్రియలు కలిగినట్టియు, ఇదం నిఖిలమేవ= ఈ జగత్తంతయు, సత్ అసత్ ఆత్మనా= చిత్ అచిత్ రూపములలో (మంచి చెడు అను రూపములలో), నిమ్నోన్నతం యత్= అధమోత్తమ రూపములో కనపడుట ఏదైతేకలదో, తత్= అది, తవ= నీయొక్క, కటాక్ష తత్ ఉపేక్షయోః= కటాక్షములయొక్క ప్రసరణా ప్రసరణ రూపమైన, తాండవం హి= నాట్యమే కదా!

తా :- ఓ లక్ష్మీదేవి! స్థావర జంగమములతో కూడినట్టిదియు బ్రహ్మనుండి దరిద్రుని వరకు, వృక్షమునుండి బృహస్పతి వరకుగల ఈ నిత్యా నిత్య రూపమైన ప్రపంచ మంతయు నిమ్నోన్నతముగా నుండుటకు నీకటాక్ష సంకోచ ప్రసరణములు కారణములై యున్నవి.

వి:- సభలో మాటలాడలేని వాడు చెట్టుతో సమానము. అందువలననే బృహస్పతి పదమునకు వ్యతిరేకముగా అనోకహ పదము ప్రయోగింపబడినది. లక్ష్మీకటాక్షపాత్రుడు ఔన్నత్యమును, తదపాత్రుడు నైచ్యమును పొందును. ఆ విధముగ ఉత్పన్నమైనదే నిమ్నోన్నత రూపమైన ఈ సృష్టియంతయు. కావున లక్ష్మియొక్క కరుణాకటాక్షవీక్షణమే సర్వులకు అభిలషణీయము.

ఎ) 'త్వయావలోకితా స్సద్యః శీలాద్యై స్సకలై ర్గుణైః।
ధనైశ్వర్యైశ్చ యుజ్యన్తే పురుషా నిర్గుణా అపి' ॥

( ఓ లక్ష్మి ! నిర్గుణులైనను నీచే చూడబడినచో మనుజులు వెంటనే శీలాది సకల గుణములతోను ధనైశ్వర్యాదులతోను ప్రకాశించుచున్నారు).

బి) 'సద్యో వైగుణ్యమాయాన్తి శీల్యాద్యా స్సకలా గుణాః।
పరాఙ్ముఖీ జగద్ధాత్రీ యస్య త్వం విష్ణువల్లభే' ॥

( ఓ లక్ష్మి! నీవు ఎవరియందు పరాఙ్ముఖివౌదువో వారియందు శీలాది గుణ సంపద విగుణత్వమును పొందును).

సి) 'సశ్లాఘ్యః సగుణీ ధన్యః సకులీనః సబుద్ధిమాన్।
సశూర స్సచ విక్రాన్తో యం త్వం దేవి ! నిరీక్షసే' ॥

( ఓ లక్ష్మి ! నీవెవరిని చూతువో అతడే శ్లాఘ్యుడు, గుణవంతుడు, ధన్యుడు, కులీనుడు, బుద్ధిమంతుడు, శూరుడు, పరాక్రమవంతుడు కూడ నగును) అను శ్రీస్తుతి యందలి శ్లోకములను;

ఎ) 'లోకే వనస్పతి బృహస్పతి తారతమ్యం
యస్యాః ప్రసాదపరిణామ ముదాహరన్తి'

(లోకములో చెట్టునకు బృహస్పతికి గల తారతమ్యము ఏలక్ష్మియొక్క అనుగ్రహ పరిణామ రూపముగా చెప్పుచున్నారో)

బి) 'ఐశ్వర్యం మహదేవ వాల్పమథవా దృశ్యేత పుంసాంహి యత్। తల్లక్ష్మ్యా స్సముదీక్షణా త్తవ'

'జగన్నాథోఽపి నారాయణః ధన్యం మన్యత ఈక్షణా త్తవ'

(ఈ ప్రపంచమున గొప్పదైనను కొద్దిదైనను ఐశ్వర్యము మనుజులయందు కనుపించుట నీయొక్క వీక్షణమువలననే. అంతేకాదు జగత్పతియైన శ్రీమన్నారాయణుడు కూడ నీయొక్క కటాక్ష వీక్షణము వలననే తనను ధన్యునిగా భావించుకొనుచున్నాడు అను శ్రీవత్సాంక మిశ్రుల శ్రీస్తవ శ్లోకములను;

ఎ) 'యస్యాం యస్యాం దిశి విహరతే దేవిదృష్టి స్త్వదీయా
తస్యాం తస్యా మహమహమికాం తన్వతే సంపదోఘః'

(ఓ దేవీ! నీదృష్టి ఎటు ప్రసరించునో అటువైపుగా సంపదలు ప్రవహించును.)

బి) 'సేవాపేక్షా తవ చరణయోః శ్రేయసే కస్యనస్యాత్'

(నీ పాదపద్మములయొక్క సేవ చేయవలయుననెడి సంకల్పమే శ్రేయస్సును కలిగించును.) అను వేదాంత దేశికుల వాక్యములను;

ఎ) 'శ్రేయో నహ్యరవిందలోచన మనః కాంతా ప్రసాదాదృతే'

(లక్ష్మియొక్క అనుగ్రహములేనిదే శ్రేయస్సులేదు) అను కాంతా స్తోత్ర శ్లోకమును, **15, 16, 17, 18** శ్లోకము లన్నిటియందును అన్వయించుకొనవచ్చును.

సంస్కృత వ్యాఖ్య :- సహేతి। హే లక్ష్మి! స్థిరపరిత్రసవ్రజ విరించనా కించనైః సహ స్థిరాఃస్థావరాః శైలవృక్షాదయః పరిత్రసాః పరిస్పందనశీలాః జంగమాః తేషాం వ్రజైః సమూహైః విరించనో బ్రహ్మా అకించనో దరిద్రస్తైః సహ అనోకహః వృక్షాః బృహస్పతిః గురుః ప్రవరో బలవాన్, విక్లబో దుర్బలః, తేషాం ప్రకారో యస్మిం స్తథోక్తమ్। ఇదం పరిదృశ్యమానం జగత్ నిఖిలమేవ సమస్తమేవ, సదసదాత్మనా సమీచీనా సమీచీన రూపేణ నిమ్నోన్నతం నీచోచ్చం, ఇతి యత్తవ కటాక్ష తదుపేక్షయోః వీక్షణావీక్షణయోః తాండవం నటనం హి ॥

అ :- సంప్రతి భగవతో జగత్సృష్టిః లక్ష్మీవిహారాయేత్యాహ।

శ్లో ॥ కాలే శంసతి యోగ్యతాం చిదచితో రన్యోన్యమాలిఙ్గతోః
భూతాహఙ్కృతి బుద్ధి పఞ్చకరణీ స్వాన్తప్రవృత్తీన్ద్రియైః।
అణ్డానావరణైః సహస్రమకరోత్తాన్ భూర్భువస్స్వర్వతః
శ్రీరఙ్గేశ్వరదేవి తే విహృతయే సఙ్కల్పమానః ప్రియః ॥ ౧౯

అ :- హే శ్రీరంగేశ్వరదేవి= శ్రీరంగరాజపట్టమహిషియైన ఓ లక్ష్మీదేవీ, కాలే= సృష్ట్యాది రూపమైన సమయము, యోగ్యతామ్= సృష్టియందలి ఉన్ముఖత్వమును, శంసతి సతి= చెప్పునదికాగా, (సృష్టికి తగిన సమయమని సూచించగా) చిదచితోః= ప్రకృతి పురుషులు, అన్యోన్యమ్= పరస్పరము, ఆలింగతోః సతోః= కలసియున్న వారలు కాగా, ప్రియః= నీవల్లభుడైన శ్రీరంగనాథుడు, సంకల్పమానః= (ఎక్కువగా సృష్టిచేయుటకు) సంకల్పించినవాడై, తే విహృతయే= నీ విహారముకొరకు, భూతా.. ప్రవృత్తీంద్రియైః, భూత= పంచభూతములు, అహంకృతి= ప్రకృతి వికారమైన అహంకారతత్త్వము, బుద్ధి= మహత్తత్త్వము, పంచకరణీ= జ్ఞానేంద్రియ సముదాయము , స్వాన్త= మనస్సు, ప్రవృత్తీంద్రియైః= కర్మేంద్రియములతో కూడిన, ఆవరణైః= సప్తవిధ ఆవరణములతోను, తాన్= ప్రసిద్ధములైన, భూఃభువః స్వర్వతః= భూర్భువస్సువ ర్లోకములు కలిగిన, సహస్రం అండాన్= అనంతములైన బ్రహ్మాండము లను, అకరోత్ = సృష్టించెను.

తా :- శ్రీరంగరాజమహిషివైన ఓ లక్ష్మీదేవి!, నీప్రియుడైన శ్రీరంగనాథుడు తగిన సమయమున సృష్టిని చేయగోరి ఆ సృష్టిని ఎక్కువగా చేయవలయుననెడి ఉద్దేశ్యముతో, పంచభూతములు అహంకార మహత్తత్త్వములు జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు మనస్సు సప్తావరణములు మొదలగు వానితోను భూర్భువ స్సువ ర్లోకములతోను నిండిన బ్రహ్మాండములను అనంతములుగా సృష్టించెను. అవన్నియు నీయొక్క విహారముకొరకే .

వి:- ఇచట చిదచిత్తుల అన్యోన్యాలింగనము ప్రకృతిపురుషుల ఐక్యతను తెలుపుచున్నది. 'ఏకోఽహం బహుస్యామ్' (ఒక్కడనే అయినను అన్నియు నగుదును) అను వాక్యము బహుసృష్టికి మూలము. ఈ బ్రహ్మాండమంతయు లక్ష్మి యొక్క విహారము కొరకే నిర్మింపబడినదని చెప్పుట 'లక్ష్మి సర్వవ్యాపకురాలు' అని చెప్పుటయే. ఆమె లేనిచోటు లేదు. ఆమె చూడని ప్రదేశము లేదు. బ్రహ్మాండ మంతయు ఆమెతో నిండియున్నది. 'త్రైలోక్యం త్రిదశశ్రేష్ఠ నసంత్యక్ష్యామి వాసవ!' (ఇంద్రునిచేత 'నీవు మూడులోకములను వదలవలదు' అని ప్రార్థింపబడి 'మూడు లోకములను నేను వదలను') అని ఇంద్రునకు లక్ష్మి ఇచ్చిన వరముద్వారా శ్రీస్తుతి యందు కూడ 'ఆమె సర్వవ్యాపకురాలు' అని చెప్పబడినది.

సంస్కృత వ్యాఖ్య :- కాల ఇతి। హే శ్రీరంగేశ్వరదేవి! కాలే సర్గాద్యసమయే యోగ్యతాం సృష్ట్యున్ముఖ్యం, శంసతిసతి స్రష్టుమయమవసర ఇతి సూచయతి సతి, చిదచితోః ప్రకృతి పురుషయోః అన్యోన్యమాలింగతోః మిథోమిళితయోః సతోః ప్రియః శ్రీరంగరాజః సంకల్పమానః 'బహుస్యాం ప్రజాయేయ' ఇతి బహుభవన

సంకల్పం కుర్వన్ తే విహృతయే, భూతాహంకృతి బుద్ధి పంచకరణీ స్వాంత ప్రవృత్తీంద్రియైః, భూతాని పృథివ్యాదీని, అహంకృతిః ప్రకృతి వికారరూపం అహంకార తత్త్వమ్, బుద్ధిః మహత్తత్త్వమ్, పంచానాం కరణానాం సమాహారః పంచకరణీ పంచ జ్ఞానేంద్రియాణి, స్వాంతం మనః, ప్రవృత్తీంద్రియాణి వాగాది పంచకర్మేంద్రియాణి తైః సహ ఆవరణైః సప్త ఆవరణైః సమం తాన్ ప్రసిద్ధాన్ భూర్భువ స్సువర్వతః త్రైలోక్యవతః సహస్రం అండాన్ అనంతాత్, అకరోత్ కృతవాన్॥

అః- 'విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుమ్' ఇత్యుక్త ప్రమాణానుసారేణ కరణకళేబర యోగరూప భవత్కైంకర్యార్థత్వేఽపి, తద్విస్మృత్యా తాని కరణాని శబ్దాది ప్రవణాని కుర్వాణానాత్మనో భగవానేవ తథా భూతాన్కారయం స్తవ పరిహాస రస ముత్పాదయతీత్యాహ।

శ్లో॥ శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య విభవం విస్మార్య దాస్యాత్మకం
వైష్ణవ్యా గుణమాయయాత్మనివహాన్ విప్లావ్య పూర్వః పుమాన్।
పుంసా పణ్యవధూవిడమ్బివపుషా ధూర్తానివాయాసయన్
శ్రీరఙ్గేశ్వరి! కల్పతే తవ పరీహాసాత్మనే కేలయే॥ ౨౦

అః- హే శ్రీరంగేశ్వరి=శ్రీరంగరాజరాజ్యలక్ష్మీ, పూర్వః పుమాన్= పురాణ పురుషుడైన శ్రీరంగనాథుడు, శబ్దాదీన్ విషయాన్=శబ్ద స్పర్శరూప రస గంధము లనెడి విషయములను, ప్రదర్శ్య=(ఎరగా) చూపి, దాస్యాత్మకమ్=దాస్యరూపమైన, విభవమ్=వైభవమును, విస్మార్య=మరపించి, వైష్ణవ్యా=విష్ణు(తన) సంబంధమైన, గుణమాయయా=సత్త్వరజస్తమో గుణరూపమైన ప్రకృతితో, ఆత్మ నివహాన్= జీవసమూహములను, విప్లావ్య=వంచించి, పణ్యవధూ విడంబి వపుషా=వేశ్యలను అనుకరించు శరీరముతో కూడిన, పుంసా=పురుషునిచేత, ధూర్తానివ=ధూర్త విటులను వలె, ఆయాసయన్= ఆయాసపెట్టుచు, (వివశులను చేయుచు), తవ పరిహాసాత్మనే =నీయొక్క పరిహాసము అనెడి, కేలయే=కేళికొరకు, కల్పతే= సమర్థుడగుచున్నాడు.

తా :- ఓ లక్ష్మీదేవి, నీవల్లభుడైన శ్రీరంగనాథుడు జీవులను శబ్దాది విషయ లోలురనుగాచేసి, ఐశ్వర్యాదుల ద్వారా దాస్యాత్మక వైభవమునుకూడ మరపించి, స్త్రీరూపధారియైన పురుషుడు ధూర్తవిటులను వంచించినట్లుగా ఈజీవులను తన (వైష్ణవ) మాయచే మోహితులనుగా చేయుచున్నాడు. ఇది నీయొక్క ఆట కొరకే (నీచేత ఆ జీవులను పరిహాసము చేయించి, ఆ విధముగా నిన్ను సంతోషపెట్టుటకే.)

వి :- 'త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ।' 'త్వద్దాస దాసగణనా చరమావధౌ' (నీయొక్క దాసులలో ఆఖరు

వానినిగా నన్ను లెక్కింపుము) అని కులశేఖరాదులు చెప్పినట్లుగా భగవద్దాస్యమే భక్తులకు వైభవము. అట్టి ఈ దాస్యాత్మకవైభవమును శబ్దస్పర్శ రూప రస గంధాదులను ఎరగా చూపి తన మాయద్వారా మరపించి ఈజీవులను లక్ష్మియొక్క పరిహాసమునకు పాత్రులనుగా శ్రీరంగనాథుడు చేయుచున్నాడు. ఇచట భగవంతుడు భక్తులను విషయలోలురను చేయుట ఎట్లో ఒక చక్కని ఉపమానము చూపబడినది.

ఎట్లనగా :- ఒక పురుషుడు వేశ్యగా తన నలంకరించుకొని వీథివెంట వెళ్ళుచుండగా ఆతని వేషమును చూచి వేశ్యయేనని భ్రమపడి ధూర్తవిటులు అతనిని వెంబడించి చివరకు ఆతడు మగవాడని తెలుసుకొని ఎట్లు నవ్వులపాలగుదురో అట్లే భగవంతుని మాయ ద్వారా ఏర్పడిన శబ్దస్పర్శాదులే నిజమని భ్రమించి తదాసక్తచిత్తులై జనులు లక్ష్మియొక్క పరిహాసమునకు పాత్రులగుచున్నారు. 'మమ మాయా దురత్యయా' (నా మాయ దాటరానిది) అని భగవద్గీత. 'మాయా త్వయా గుణమయీ కిల యాని సృష్టా సాతేవిభోః కిమివనర్మ ననిర్మిమీతే' ( ఓ దేవా నీచేనిర్మించబడిన గుణమయియైన మాయ ఏయే పరిహాసమును కల్పించదు?) అని వైకుంఠస్తవము. 'విచిత్రా దేహ సంపత్తి రీశ్వరాయ నివేదితుం' ( విచిత్రమైన ఈ దేహసంపత్తి యంతయు భగవంతుని సేవకొరకే) అని భగవద్దాస్యమే ప్రధానమైనను అదే భక్తులకు కోరతగిన విభవమైనను దానిని మరపించి ఈ జనులనందరను లక్ష్మికి పరిహాస పాత్రులనుగా చేయు చున్నాడనుట ముఖ్యోద్దేశ్యము. అట్టి జనులను చూచి లక్ష్మి పరిహసించుట ఆమెకు సంతోషము. ఆమెను ఆ విధముగా సంతోషపెట్టుట భగవంతునకు సంతోషము. ఇందు లక్ష్మియొక్క లీలావిభూతి చెప్పబడినది.

సంస్కృత వ్యాఖ్య :- శబ్దాదీనితి। హే శ్రీరంగేశ్వరి శ్రీరంగరాజప్రియే। పూర్వః పుమాన్ పురాణపురుషః శ్రీరంగరాజః। శబ్దాదీన్ శబ్దస్పర్శరూపరసగంధాన్ విషయాన్, ప్రదర్శ్య దర్శయిత్వా దాస్యాత్మకందాస్యత్వరూపం, విభవమైశ్వర్యం, విస్మార్య విస్మృతంకృత్వా, వైష్ణవ్యా విష్ణుసంబంధిన్యా స్వకీయయేత్యర్థః॥

'మమ మాయా దురత్యయా' ఇత్యుక్తేః। గుణమాయయా త్రిగుణాత్మకయా ప్రకృత్యా। అత్ర మాయా శబ్దో విచిత్రసృష్టినిబంధనః।' దేవమాయేవనిర్మితా' ఇతివత్। ఆత్మనివహాన్ జీవ సమూహాన్, విప్లావ్యవంచయిత్వా, పణ్యావధూవిడంబివపుషా వేశ్యానుకారి శరీరవేషేణ, పుంసాపురుషేణ, ధూర్తానివధృష్టపురుషానివ, అయాసయన్ వివశాన్ కుర్వన్, భగవానేవాత్మనివహాన్ ధూర్తాంశ్చాయాసయతి, గుణమాయా వేశ్యాను కారిపురుషశ్చ ద్వార మాత్రమితిభావః। తవ పరీహాసాత్మనే పరిహాస రసరూపాయ కేలయే విహారాయ, కల్పతే సమర్థో భవతి। 'కృపూసామర్థ్యే' ఇత్యస్మా ద్ధాతోః 'కృపోరోలః' ఇతి లకారే 'కల్పతే' ఇతిరూపమ్। కేచిత్తు ధూర్తానివాయాసయ

న్నిత్యత ధూర్తానాయాసయన్ సూత్రధార ఇవేతి యోజయన్తి। తచ్చిన్త్యమ్। సూత్రధార పదాధ్యాహార ప్రసంగాత్। ధూర్తానివేతి ధూర్తపదాన్వితస్యైవ శబ్దస్య అధ్యాహృత సూత్రధారపదాన్వయే వ్యవహితాన్వయశ్చ। తవపరీహాసాత్మనే కేలయే కల్పత ఇతి వచనానుపపత్తిశ్చ। సూత్రధారస్య లక్ష్మీపరిహాస రసాపాదనే దృష్టాన్తత్వాయోగాత్। నహి లోకస్య పరిహాసరస మాపాదయన్ సూత్రధారో లక్ష్మ్యాఅపి తమాపాదయతి యేన తస్య దృష్టాన్తతాస్యాత్। నచ లోకస్యేత్యధ్యాహృత్య పణ్యవధూవిడంబివపుషా పుంసా ధూర్తానాయాసయన్ సూత్రధారోలోకస్యైవ గుణమాయయాஉஉత్మ నివహాన్ విప్లావ్య పూర్వః పుమాన్ తవపరీహాసాత్మనే కేలయే కల్పత ఇతి యోజనా క్రియత ఇతి వాచ్యమ్। తథా సత్యావిష్కృతమేవ వ్యాఖ్యానకౌశలం పండిత మ్మన్యైః। ప్రథమాన్త షష్ఠ్యన్త పదద్వయాధ్యాహారదోషాత్, ఇవ శబ్దస్యలోకపదాన్వయే నాత్యన్తవ్యవధాన దోషాచ్చ। అవ్యవధా నేనా నధ్యాహారేణచ వాక్యార్థవర్ణన సంభవే వ్యవధానాధ్యా హార కల్పనానౌచిత్యాచ్చ। తథాకల్పనే విశేషస్వారస్యాసిద్ధేశ్చ। నచ త్వ త్పక్షాపేక్షయా దృష్టాన్తదార్ష్టాన్తికభేదసిద్ధిరేవాస్మత్పక్షే విశేషసిద్ధిరితి వాచ్యమ్। ధూర్తాయాసయితృత్వాత్మ నివహప్లావకత్వ భిన్నవిశేషణ విశిష్ట వేషైకస్యైవ దృష్టాన్తదార్ష్టాన్తికభావే స్వారస్యాక్షతేశ్చే త్యలంపల్లవితేన।

అ :- ఇత్థం లక్ష్మ్యాలీలా విభూత్యుపయోగ ముక్త్వా నిత్య విభూతియోగ మాహ।

శ్లో ॥ యద్దూరే మనసో యదేవ తమసః పారే యదత్యద్భుతం
యత్కాలాదపచేలిమం సురపురీ యద్గచ్ఛతో దుర్గతిః।
సాయుజ్యస్య యదేవ సూతి రథవా యద్దుర్గ్రహ మ్మద్గిరాం
తద్విష్ణోః పరమం పదం తవ కృతే మాతః! సమామ్నాసిషుః ॥ ౨౧

అ:-హే మాతః= ఓ జగజ్జననీ, యత్= ఏది (వైకుంఠము) మనసః= మనస్సు నకు, దూరే=దూరమో, యత్ ఏవ=ఏదైతే, తమసః పారే=తమస్సునకు దూర మైనదో, యత్=ఏదైతే, అత్యద్భుతమ్=మిక్కిలి అద్భుతమైనదో, యత్=ఏదైతే, కాలాత్=కాలమువలన, అపచేలిమమ్=పరిపక్వముకాదో, యత్ గచ్ఛతః=ఏచోటుకు వెళ్ళువారికి, సురపురీ= అమరావతియే, దుర్గతిః=నరకమో, యత్ ఏవ=ఏదైతే, సాయుజ్యస్య=భగవత్ సాయుజ్యమునకు, సూతిః=మూలకారణమో, యత్=ఏది, మద్గిరామ్=నా వాక్కులకు, దుర్గ్రహమ్=అందనిదో, విష్ణోః=విష్ణువు యొక్క, తత్= ఆ (ప్రసిద్ధమైన), పరమం పదమ్=వైకుంఠమును, (ఉత్తమస్థానమును) తవకృతే= నీ కొఱకనియే, (నీదిగానే) సమామ్నాసిషుః=చెప్పినవి (వేదములు).

తా :- జననీ! ఏది బ్రహ్మాదులకైనను వాఙ్మనసాగోచరమో రజస్తమస్సులకు దూర మైనదో, అద్భుత మాహాత్మ్యము కలదో, కాలమునకుకూడ అందనిదో మార్గము

నందుండు అమరావతీ (స్వర్గము) విరజా మొదలగు లోకము లన్నియు దేనియందు నరకతుల్యములో ఏది విష్ణుసాయుజ్యము నొసంగునదో, నీయొక్క కటాక్షముల వలననే కవినైన నావాక్కులకు కూడ ఏది అతీతమో అట్టి వైకుంఠమును నీ స్థానమును గా వేదములు చెప్పినవి.

వి :- 'బ్రహ్మాదీనాం వాఙ్మనసాగోచరే శ్రీమతి వైకుంఠే' (బ్రహ్మాదులకు కూడ వాక్కులకు మనస్సునకు అగోచరమైన వైకుంఠమునందు) అని వైకుంఠ గద్యయందు శ్రీభాష్యకారుల వచనము. యదేవ అనునపుడు 'ఏవ' కారముచేత వైకుంఠము రజోగుణ ప్రకృతియొక్కగాని తమోగుణ ప్రకృతియొక్క స్పర్శకూడ లేనిది అను విషయము సూచింపబడినది. 'క్షయం రజస్య తమసః పరాకే' అను శ్రుతికూడ ఇచట ప్రమాణము. 'కాలాదపచేలిమం' అనునపుడు 'నకాలస్తత్రవై ప్రభుః' (అచట కాలము సమర్థముకాదు) అను స్మృతి ప్రమాణము. బ్రహ్మేంద్రాదుల పట్టణములే ఈ వైకుంఠము ముందు నరకతుల్యములు అనుటకు 'ఏతేవై నిరయాస్తాత । స్థానస్య పరమాత్మనః' (ఇవి వైకుంఠమునకు నరకములు) అను స్మృతిప్రమాణము. పై లక్షణములతో కూడినదియు శ్రీమహావిష్ణువుయొక్క సాయుజ్యమును ప్రసాదించుట కు కారణమైనదియు అయిన వైకుంఠమును లక్ష్మియొక్క నిత్య నివాసమునుగా వేదములు చెప్పుచున్నవి. తద్ద్వారానే వైకుంఠము విష్ణువుయొక్క నిత్యనివాసమై 'తద్విష్ణోః పరమం పదం' అను శ్రుతితో చెప్పబడినది. ఈ శ్లోకమునకు శ్రీవత్సాంక మిశ్రుల వైకుంఠస్తవమునుండి ఈక్రింది వాక్యములను కూడ ప్రమాణముగా గ్రహించ వచ్చును. 'అస్యై రథన్యపురుషై ర్మనసా నవాప్యమ్' (దురదృష్టవంతులచేత పొంద రానిది) 'యదేవ పరమం తమసః పరస్తాత్' (తమస్సునకు దూరమైనది), 'ఆనంద కంద మతిసుందర మద్భుతం యత్' (ఆనందమయమైనది. సున్దరమైనది. అద్భుతము ను గొల్పునది, 'యావై నజాతు పరిణామ పదాస్పదం సా' (ఎప్పుడును మార్పు చెందనిది), 'కాలాతిగా' (కాలము నతిక్రమించునది) అని, అంతేగాక 'శ్రీమద్ వ్యోమ నసీమవాఙ్మనసయోః' (వైకుంఠము వాఙ్మనసాతీతము) అని శ్రీపరాశర భట్టరులు కూడ మరియొకచోట వర్ణించియున్నారు. ఇచట సాయుజ్య మనగా భగవ ద్గుణైక్యమే కాని భగవదైక్యముకాదు. 'సాయుజ్య ముజ్జ్వలముశన్తి యదా పరోక్ష్యం' (పరమపదముయొక్క దర్శనమే సాయుజ్యము) అని శ్రీవత్సాంకమిశ్రుల వాక్యము. 'తే సాధ్యాస్సన్తి దేవాః' అను (27వ) శ్లోకమున ఈగ్రంథకర్తచేకూడ 'గుణ రూపాదు లతో సమానులైన వయస్కులవలె ఉన్నవారలు' అని వర్ణింపబడినది. మరియు లక్ష్మి యొక్క కటాక్షమువలననే కవియైన గ్రంథకర్తకు కూడ 'వైకుంఠము వర్ణింపనలవి కానిది' అని చెప్పుటలో 'దేవి, త్వన్మహిమావధిర్నహరిణా నాపిత్వయా జ్ఞాయతే'

(దేవీ, నీ మహిమ నీకును నీభర్తకునుకూడ అంతుచిక్కనిది) అనియు, 'వాచో యదీయ విభవస్య తిరస్క్రియాయై' (నావాక్కులు ఆ వైభవమును పూర్తిగా వర్ణించలేవు) అనియు శ్రీవత్సాంకమిశ్రుల వాక్యములుకూడ ప్రమాణములగుచున్నవి. ఇచట లక్ష్మియొక్క నిత్యవిభూతి వర్ణింపబడినది. కావున 20, 21 శ్లోకములలో 'ఉభయ విభూతి' వర్ణింపబడినట్లయినది.

సంస్కృత వ్యాఖ్య :- యదితి। హే మాతః యత్ స్థానం మనసః దూరే స్మర్తుమశక్య మిత్యర్థః మనస ఇత్యసంకోచేనోక్తేః। బ్రహ్మాదీనామపి వాఙ్మనసా గోచరత్వం వివక్షితమ్। తదుక్తం శ్రీభాష్యకారైః 'బ్రహ్మాదీనాం వాఙ్మనసాగోచరే శ్రీమతి వైకుంఠే ఇతి। యత్తమస ఇతి। యత్ తమసః ప్రకృతి మండలస్య పార ఏవ పరస్తాదేవ। ఏవకారేణ రజస్తమో లవస్పర్శోఽపి నేతి సూచితమ్। యదేవ తమసః పారే యత్పద మేవ ప్రకృతిమండల పారవర్తి, బ్రహ్మాదీనాం పదంతు నతథా-ఇతి విశేష్య సంగత ఏవ వాయమేవకారః। 'క్షయం రజస్య తమసః పరాకే' ఇతిశ్రుతేః। రజస్తమ శ్శబ్దౌ తత్తద్గుణ ప్రధాన ప్రకృతి వాచినౌ। యదత్యద్భుతం అత్యాశ్చర్యా వహమ్। యత్ కాలాదప చేలిమం యత్ కాలాద్ధేతోః అపచేలిమం అపరిపక్వం అకాలకాల్యం 'నకాలస్తత్ర వైప్రభుః' ఇతి స్మృతేః। ప్రభుత్వం పరిపాక హేతుత్వమ్। సురపురీ సురాణాం బ్రహ్మ దీనాం పురీ, వైరాజామరావత్యాది రూపా, యద్గచ్ఛతః యత్ స్థానం గచ్ఛతః పుంసః, దుర్గతిః నరకః, 'ఏతేవై నిరయాస్తాత స్థానస్య పరమాత్మనః' ఇతి స్మృతేః ' సాయుజ్యస్య పరమ పురుష సామ్యాపత్తేః। యదేవ యత్ స్థానమేవ సూతిరుత్పాదకం నత్వితర దిత్యర్థః।

అథవా కిమేతై ర్లక్షణై రిదమేవ తల్లక్షణ మిత్యాహ। యద్దుర్గ్రహమితి। మద్గిరాం మద్వాచాం యద్దుర్గ్రహ మగోచరం విష్ణోః పరవాసుదేవస్య తత్పరమం పదం అత్యు త్కృష్టస్థానం తవకృతే త్వదర్థం త్వన్నిత్యవాసార్థమిత్యర్థః। సమామ్నాసిషుః అభ్యస్తవన్తః। వేదా ఇతి శేషః। సంపూర్వాత్ 'మాఅభ్యాసే' ఇత్యస్మాద్ధాతోః లుఙి ప్లేః సిచి యమరమ' ఇత్యాదినా ఇట్ సకోః కృతయోః ఆదేశ ప్రత్యయయోః ఇత్యషత్వే, ఝేర్జుసి 'సమామ్నాసిషు' రితి రూపమ్। 'తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయ' ఇతి శ్రుతిరిహ ప్రమాణం ద్రష్టవ్యమ్॥

అ :- సేశ్వరం విభూతిద్వయం తద్వర్తివస్తుజాతంచ లక్ష్మీ పరికర భూత మిత్యాహ।

శ్లో ॥ హేలాయా మఖిలం చరాచరమిదం భోగే విభూతిః పరా
పుణ్యాస్తే పరిచారకకర్మణి సదా పశ్యన్తి యే సూరయః।

శ్రీరఙ్గేశ్వరదేవి! కేవల కృపా నిర్వాహ్యావర్గే వయం
శేషిత్వే పరమః పుమాన్ పరికరాహ్యేతే తవ స్ఫూరణే ॥ 22

అ:- హే శ్రీరంగేశ్వరదేవి=శ్రీరంగరాజ పట్టమహిషివైన ఓ లక్ష్మీదేవీ, అఖిలం ఇదం చరాచరమ్=స్థావరజంగమాత్మకమైన ఈజగత్తంతయు, (తవ= నీయొక్క), హేలాయామ్=క్రీడయందు (వినియోగింపబడుచున్నది), పరా విభూతిః= అన్నిటి కన్న గొప్పదై శుద్ధసత్త్వ స్వరూపమైన నిత్యవిభూతి, (తవ= నీయొక్క) భోగే= భోగము నందు (వినియోగింపబడుచున్నది), యే=ఎవరైతే, సదా= ఎల్లప్పుడు, పశ్యన్తి =(నిన్ను నీప్రియుడైన రంగనాథుని) చూచుచున్నారో, పుణ్యాః= పుణ్యాత్ములైన (ధన్యులైన), తే సూరయః=ఆ విష్వక్సేనాదులు, (తవ=నీయొక్క) పరిచారకర్మణి =సేవ చేయుటయందు,(నియుక్తులై ఉన్నారు), వయమ్=మేము, (బుభుక్షు ముముక్షు రూపములో నున్న ఈ జీవ సంఘమంతయు) తవ=నీ యొక్క, కేవలకృపా నిర్వాహ్యావర్గే=దయార్ద్ర దృష్టిప్రసారమునకు పాత్రమైన వర్గమునందు) (వినియోగించ బడుచున్నాము), పరమః పుమాన్=పరమపురుషుడైన శ్రీరంగనాథుడు, (తవ=నీ యొక్క), శేషిత్వే=యాజమాన్యమున, (స్వామిగా వినియోగింప బడుచున్నాడు), ఏతే=ఈపైన చెప్పినవన్నియు, తవ=నీయొక్క, స్ఫూరణే=వైభవ వ్యాప్తియందు, పరికరా హి=సాధనములు (ఉపకరణములు) కదా ॥

తా :- ఓ లక్ష్మీదేవి! చరాచరరూపమైన ఈప్రపంచమును చూచుటకువచ్చుట నీకు క్రీడ. పరమపదము అనగా (ఉన్నతము ఉత్తమము అయిన స్థానముగా ప్రసిద్ధి చెందిన) వైకుంఠము నీయొక్క భోగస్థానము. నీయొక్కయు శ్రీమన్నారాయణుని యొక్కయు దివ్యమంగళవిగ్రహములను ఎల్లప్పుడును చూచుచు ధన్యులగు అనంత గరుడ విష్వక్సేనాదులు నీదాసవర్గమున చేరినారు. బుభుక్షువులు, ముముక్షువులు అని రెండు వర్గములుగా నున్న ఈ ప్రాణికోటియంతయు నీయొక్క కృపకు పాత్ర మైనది. నీయొక్క 'శేషి' రూపముగా అనగా లక్ష్మీపతిగా శ్రీమన్నారాయణుడు నిలచి యున్నాడు. జగజ్జననీ, ఇది యంతయు నీవైభవమును చాటి చెప్పు సాధనము.

వి :- ఇందును లక్ష్మియొక్క ఉభయ విభూతి వర్ణింపబడినది. 'హారే విహరసి క్రీడాకందుకైరివ జంతుభిః' (ఆటబంతులవలె ప్రాణులతో ఆడుకొనుచున్నావు) అని అన్నట్లుగా, ఈ ప్రాణులను చూచుట వారికి ఒక బంతి ఆట వంటిది 'అండాని తత్సుసదృశాని పరశ్శతాని క్రీడావిధేస్తవ పరిచ్ఛదతా మగచ్ఛన్' (క్రీడా విధివైన నీకు ఈ బ్రహ్మాండమంతయు ఆటకు స్థానమైనది.) అను వాక్యముకూడ ఇచట ప్రమాణము. **20, 21** శ్లోకములలో చెప్పబడినట్లుగా ఈ లోకము లీలావిభూతి. వైకుంఠము నిత్య విభూతి. ఈ లోకముకంటె వైకుంఠము మూడురెట్లు పెద్దది అని

'త్రి పాదస్యామృతం దివి' అను శ్రుతి చెప్పుచున్నది. అదియే ఆమెయొక్క భోగమునకు తార్కాణము. భోగ్యము భోగోపకరణము భోగస్థానము కూడ ఆమెకు అదియే. అనంత గరుడ విష్వక్సేనాదులు ఎల్లప్పుడును లక్ష్మీ నారాయణుల దర్శన భాగ్యము ననుభవించు వారలుగాన వారు ధన్యులు. వారి దాస్యముకూడ ధన్యమైనది 'వర్తిష్యంతే వితమసిపదే వాసుదేవస్య ధన్యాః' (ధన్యులైనవారు తమస్సులేని విష్ణువు యొక్క స్థానమునందు (వైకుంఠమునందు) నివసించుచున్నారు) అని వేదాంత దేశికులు. రాజునకు ఛత్ర చామరాది పరికరములెట్లో లక్ష్మీనారాయణులకు వారట్టి వారు 'సదా పశ్యంతి సూరయః' అను శ్రుతి ఇచట అనుకరించబడినది. భోగ మోక్షేచ్ఛలతో సతమతమగుచున్న ఈ ప్రపంచమునందలి ప్రాణికోటియంతయు ఆమెయొక్క కృపకు పాత్రమైనది. భోగములను వదలలేక మోక్షమును చేరలేక బాధపడుచున్న ఈ జీవులయందు దయచూపుటయే ఆమెయొక్క కర్తవ్యము. అందువలననే ఆమెయొక్క కృప సార్థకమగుచున్నది. శ్రీమన్నారాయణుడు ఆమెకు భర్త. వారిద్దరకును శేషశేషిభావము. ఆమె అందరకును 'శేషి' రూపమున నుండగా, ఆమెకు భగవంతుడు 'శేషి' రూపమున నున్నాడు. ఇచట 'పరమః పుమాన్' అను పదము శ్రీమన్నారాయణుని యొక్క పరమత్వమును, ఉత్తమత్వమును, సర్వోన్నతత్వము ను చాటుచు సార్థకమగుచున్నది. ఈ విధముగా పైనచెప్పిన ఈ పరికరములన్నియు లక్ష్మీదేవియొక్క వైభవవ్యాప్తినే చాటుచున్నవి. ఈ శ్లోకమున ఆమె యొక్క స్వాధీన పతికాత్వము చెప్పబడినది. 'త్వదాయత్తర్థిత్వేఽప్యభవ దపరాధీనవిభవః' అని 31వ శ్లోకములో కూడ ఈ విషయము వివరింపబడినది.

సంస్కృత వ్యాఖ్య :- హేలాయామితి। హే శ్రీరంగేశ్వరదేవి! శ్రీరంగరాజ ప్రియే। అఖిలం చరాచరం జంగమస్థావరాత్మకమిదం పరిదృశ్యమానం జగత్, తవ హేలాయాం క్రీడాయాం వినియుక్తం। 'హరే! విహరసి క్రీడాకందుకైరివ జంతుభిః' ఇత్యుక్తేః॥ పరా ఉత్కృష్టా పరమమహతీవా 'త్రిపాదస్యామృతం దివి' ఇతిశ్రుతేః। విభూతిః శుద్ధ సత్త్వ రూపా తవ భోగే వినియుక్తా। భోగ్య భోగోపకరణ భోగస్థాన త్వేన వినియుక్తేత్యర్థః । త్వాం త్వత్ప్రియంచ, యే, సదా పశ్యన్తి సాక్షాత్కుర్వన్తి। పుణ్యాః యుష్మత్పదాను భవహేతు సుకృతశీలాస్తే సూరయో విష్వక్సేనాదయః తే తవ పరిచారకకర్మణి వినియుక్తాః। వయం బుభుక్షు ముముక్షు భేదభిన్నాః జీవాః తవ కేవలకృపానిర్వాహ్యా వర్గే త్వన్నిర్హేతుక కృపానిర్వాహ కర్మీకృతానాం వర్గే సన్తతౌ వినియుక్తాః । పరమః పుమాన్ పరమః పురుషః త్వత్ప్రియః తవ శేషిత్వే వినియుక్తః । ఇత్యేతే పూర్వోక్తాః సర్వేఽపి తవ స్ఫారణే వ్యాప్తౌ త్వద్విభవ ఇత్యర్థః। పరికరాపి ఉపకరణభూతాః ఖలు హి ఇత్యాశ్చర్యే ॥

అ :- శ్రీ శ్రీపత్యోః పరమవ్యోమ్ని వైకుంఠనగరీ యోగమాహ।

శ్లో॥ అజ్ఞానుగ్రహ భీమకోమల పురీపాలా ఫలం భేజుషాం
యాయోధ్యే త్యపరాజితేతి విదితా నాకం పరేణ స్థితా।
భావైరద్భుత భోగభూమ గహనైః సాన్ద్రా సుధాస్యన్దిభిః
శ్రీరఙ్గేశ్వర గేహలక్ష్మి! యువయో స్తాం రాజధానీం విదుః॥ 23

అ:- శ్రీరంగేశ్వరగేహలక్ష్మి=శ్రీరంగనాథుని గృహలక్ష్మివైన ఓ లక్ష్మీదేవీ, యా =ఏనగరము, అజ్ఞాను...పాలా, అజ్ఞా=ఆజ్ఞచేతను, అనుగ్రహ= దయచేతను, భీమ=భయమును కలిగించునట్టియు, కోమల=మృదుస్వభావము కలిగి నట్టియు, పురీపాలా=నగరపాలకులు కలదో, భేజుషామ్=పొందదలచినవారలకు, (పొందు వారలకు), ఫలమ్=మోక్షరూప ఫలమైనదో, (మోక్షము నిచ్చునదో), అయోధ్యా ఇతి=యుద్ధముచేయుటకు శక్యముకానిది అని, అపరాజితా ఇతి=జయించుటకు శక్యముకానిది అని, విదితా=ప్రసిద్ధిని పొందినదో, నాకం పరేణ=ఆకాశమునకు (స్వర్గమునకు) కూడ పైన, స్థితా=ఉన్నదో,(పరమకాశమున నున్నదో), సుధా స్యన్దిభిః=అమృతమును ప్రవహింపచేయునట్టియు, (భోగ్యములై నట్టియు), అద్భుత ...గహనైః, అద్భుత=ఆశ్చర్యకరమైన, భోగ=భోగముల యొక్క, (సుఖముల యొక్క), భూమ=ఆధిక్యముచేత, గహనైః=గహనములై యున్న, భావైః= పదార్థము లతో, సాంద్రా=నిబిడితమైయున్నదో, (అంతటను వ్యాప్తమైయున్నదో), తామ్= అయోధ్యా, అపరాజితాది నామములతో వ్యవహరింపబడు ఆ నగరమును, యువయోః =మీ ఇద్దరకు (లక్ష్మీనారాయణులకు) రాజధానీమ్=ప్రధాన నగరమునుగా, విదుః =తెలిసికొనుచున్నారు.

తా :- శ్రీరంగనాయకుని దివ్యవిమానమునకు అలంకారభూతవైన ఓ లక్ష్మీదేవి! అయోధ్య అపరాజిత అను నామములతో ప్రసిద్ధిపొందిన దివ్యనగరము మీ ఇద్దరకును (శ్రీ శ్రీపతులకు) రాజధానిగా చెప్పబడినది. తత్పురపాలకులు ఆజ్ఞానుగ్రహములచేత భీమసౌమ్య స్వరూపములు కలవారు. శరణుపొంది చెంతచేరిన వారికి మోక్షమునిచ్చు ఆ దివ్యనగరము స్వర్గమునకు పైగా పరమాకాశమున ఉన్నది. ఆశ్చర్యకరములు బహుళములునైన సుఖానుభవములతో ఆ నగరము నిండియున్నది.

వి :- ఒక రాజునకు రాజధానివలె, అంతటను వ్యాపించియున్న వారైనను లక్ష్మీనారాయణులకు కూడ రాజధాని యనునదొకటి కలదు. అది వారి ప్రధాన నగరము. దానిని అయోధ్య అనియు అపరాజిత యనియు పిలచుచుందురు. అయోధ్య అనగా యుద్ధముచేయుటకు శక్యముగానిది. అపరాజిత యనగా జయించుటకు శక్యము కానిది అని అర్థము. 'దేవానాం పూః అయోధ్యా' 'విశాలా అపరాజితా' అని శ్రుతికూడ చెప్పుచున్నది. ఈ నగరము పరమాకాశమున నున్నది

అనుటకు 'పరేణ నాకం నిహితం గుహాయామ్' అను శ్రుతి ప్రమాణము. ఆ నగర రక్షకులు నిగ్రహానుగ్రహ సమర్థులు 'యథారాజా తథాప్రజాః' అనునట్లుగా లక్ష్మీ నారాయణులు ఎట్లు నిగ్రహానుగ్రహసమర్థులును శత్రుభయంకరులును మిత్రశుభం కరులును అయివున్నారో ఈ నగరపాలకులు కూడ ఆ విధముగనే ఉన్న వారలు. అచటి సుఖానుభవములు ఆశ్చర్యకరములు 'సర్వదా అనుభూయ మానైరపి అపూర్వవత్ ఆశ్చర్యమావహద్భిః' (ఎప్పుడును అనుభవించు చున్నప్పటికిని క్రొత్త వానిని అనుభవించువారివలె ఆశ్చర్యమును పొందు మహాపురుషులతో నిండినది) అని శ్రీమద్రామానుజుల వైకుంఠగద్య. తనను ఆశ్రయించిన వారలకు ఫలము నిచ్చునది అనగా మోక్షమును ప్రసాదించునది ఆ నగరమే. పురుషార్థములలో శ్రేష్ఠమైనదియు, మానవుల గమ్యస్థానమైనదియు అయిన మోక్షమునిచ్చునది ఆ నగరమే. పై లక్షణములతో కూడిన నగరము జగజ్జననీ జనకులైన లక్ష్మీనారాయణుల ప్రధాన నగరముగా వర్ణింపబడినది. అదియే వైకుంఠము. 'పరమపదమునందు అపరాజిత యను పేర నొకపట్టణము కలదు. ఈ పట్టణమున సహస్ర స్తంభములుగల రత్న మండపమునందు పర్యంకమున లక్ష్మితోనుండు శ్రీమన్నారాయణుడు నిత్య ముక్తులతో అనుభవింపబడుచుండునని - ఛాందోగ్యము, తైత్తిరీయము, కౌషీతకి మున్నగు వానిలో ప్రసిద్ధము' అని సహస్రనామ భాష్యమున 'క్షేత్రజ్ఞః' (16) అను నామములోను, అట్లే నిత్యమైన అజితమను నగరముకలవాడు అని 'అజితః' (553) అను నామములోను కూడ శ్రీ పరాశరభట్టారకుల భాష్యము. తరువాతి రెండు శ్లోకములలో పైవిషయమే వివరింపబడినది.

సంస్కృత వ్యాఖ్య :- ఆజ్ఞేతి । హే శ్రీరంగేశ్వరగేహలక్ష్మి! శ్రీరంగేశ్వర దివ్య విమానాలంకరణ భూతే! యాపురీ ఆజ్ఞానుగ్రహ భీమకోమల పురీపాలా, ఆజ్ఞయా శాసనేన, అనుగ్రహేణ దయయా యథాక్రమం, భీమాః భయంకరాః, కోమలాః సౌమ్యాః, పురీపాలాః నగరపాలకాః యస్యాస్సా తథోక్తా । భేజుషాం భజతాం ఫలం భక్తానాం ప్రపన్నానాంచ స్వతః పురుషార్థభూతా అయోధ్యేత్యపరాజితేతి యోద్ధు మశక్యేతి పరైరజితేతిచ హేతోర్వ్యా తత్తదాఖ్యయా విదితా ప్రసిద్ధా శ్రుతావితిశేషః 'దేవానాం పూరయోధ్యే' తి, విశాలాఉపరాజితా' ఇతిచ శ్రుతేః నాకంపరేణ నాకస్య పరామాకాశస్య పరేణ ఉపరిష్టాత్ పరమవ్యోమ్నీత్యర్థః । స్థితా వర్తమానా । పరేణనాకం నిహితం గుహాయామ్' ఇతిశ్రుతేః । సుధాస్యన్దిభిః భోగ్యతమై రిత్యర్థః । అద్భుత భోగ భూమ గహనైః అద్భుతభోగానాం ఆశ్చర్యసుఖానాం అనుభవానాం వా భూమ్నా బాహుళ్యేన గహనైః సంభృతైః భావైః పదార్థైః సాంద్రా నిబిడాచ భవతి । తాం యువయోః రాజధానీం ప్రధాననగరీం విదుః । శ్రుతయో మునయోవేతి శేషః । 'ప్రధాననగరీ రాజ్ఞాం రాజధానీతి కథ్యతే' ఇత్యమరశేషః ॥

అ :- తత్రస్థిత మాస్థాన మనుసంధత్తే।

శ్లో॥ తస్యాఞ్చి త్వత్కృపావ న్నిరవధి జనతా విశ్రమార్హావకాశం
సఙ్కీర్ణం దాస్యతృష్ణా కలితపరికరైః పుమ్భిరానన్ద నిఘ్నైః।
స్నేహాదస్థానరక్షా వ్యసనిభి రభయం శార్ఙ్గ చక్రాసిముఖ్యైః
ఆనన్దైకార్ణవం శ్రీః! భగవతి! యువయో రాహు రాస్థానరత్నమ్॥

అ :- భగవతి=షాడ్గుణ్యయుక్తవై మహిమాన్వితవైన, హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ, తస్యామ్ =ఆ నగరియందు (వైకుంఠమునందు), త్వత్కృపావత్=నీదయవలనే, నిరవధి =హద్దు లేని, (లెక్కపెట్టలేని) జనతా= జనసమూహము యొక్క, విశ్రమార్హ= విశ్రాంతికి తగిన, అవకాశమ్=అవకాశము కలదానినిగాను, దాస్యతృష్ణాకలిత పరికరైః, దాస్యతృష్ణా=కైంకర్యమునందలి కోరికతో, కలిత=గ్రహింపబడిన, పరికరైః= ఛత్రచామరాది పరికరములు కలిగిన, ఆనంద నిఘ్నైః=ఆనందపరవశులైన, పుంభిః= ముక్తులైన పురుషులచేత, సంకీర్ణమ్=వ్యాప్తమైన దానినిగాను, స్నేహాత్= ప్రేమాధిక్యము వలన, అస్థాన రక్షావ్యసనిభిః, అస్థాన=భయములేని సమయము నందు కూడ, రక్షా=రక్షించుటయందు, వ్యసనిభిః=ఆసక్తములైన, శార్ఙ్గచక్రాసి ముఖ్యైః=శంఖము, చక్రము, గద, ఖడ్గము, శార్ఙ్గము మొదలగు ఆయుధములచేత, అభయమ్= భయరహితమైన దానినిగాను, ఆనందైకార్ణవమ్=అపరిచ్ఛిన్న ఆనంద ప్రవాహమైన దానినిగాను, యువయోః= మీ ఇద్దరియొక్క, ఆస్థాన రత్నం చ =శ్రేష్ఠమైన ఆస్థాన మంటపమును కూడ (ఆహుః= ఉపనిషత్తులు చెప్పినవి).

తా :- ఓ లక్ష్మీదేవి! పూర్వోక్త లక్షణయుక్తమైన వైకుంఠమునందు మీ ఇద్దరకును ఆస్థానమండపముకూడ కలదని ఉపనిత్తులలో వర్ణించబడినది. అది నీయొక్క దయవలనే అపరిమితము, అతి విశాలమునై అంతులేని జనసమూహమున కాశ్రయమైనది. ఛత్ర చామరాది కైంకర్యముల యందాసక్తులైన ముక్తులతో నిండి యున్నది. భగవద్దివ్య మంగళ విగ్రహమునందలి ప్రేమాతిశయమున భయరహితమైన సమయమునకూడ పంచాయుధములు అచట తమతమ రక్షణ కార్యక్రమములో నున్నవి. మరియు ఆనంద నిలయమైనదిగా కూడ ఆ అస్థాన రత్నము వర్ణించబడినది.

వి :- 'ప్రజాపతే స్సభాం వేశ్మ ప్రపద్యంతే' అను శ్రుతి ప్రమాణముగా ఇందు లక్ష్మీ నారాయణుల ఆస్థానమంటపము వర్ణించబడినది. అది అతి విశాలము. వారి దయ ఎంత విశాలమైనదో అంత విశాలము. ఎంతమంది వచ్చినను ఇంకను అంత మందికి అవకాశము నిచ్చునది. దీనివలన వారి దయకూడ అట్టిదే అని సూచితము. అందు ముక్తులైన పురుషులు భగవత్సేవకై (ఛత్ర చామరాది కైంకర్యముల కొరకై) త్వరపడు చుందురనుట వారి కైంకర్య తృష్ణకు నిదర్శనము. 'గృహీత తత్త త్పరిచార సాధనైః

నిషేవ్యమాణం పురుషైః' (ఆయా పరిచార సాధనములు గ్రహించిసేవకై త్వరపడు చున్న పురుషులతో సేవింపబడుచున్న) అని స్తోత్రరత్నము. ఎప్పుడును ఏవిధమైన భయమును లేకపోయినను పంచాయుధములు సదా భగవానుని వదలక రక్షణజాగరూకములై ఉన్నవని చెప్పుటవలన సదాపంచాయుధ సాన్నిధ్యము సూచితము. అదియే అభయమునకు కారణము.

ఆనందమనగా అనుకూల జ్ఞానము. (ముక్తికి అనుకూలమగు జ్ఞానము). ఆ ఆనందముయొక్క అర్ణవము అనగా ఆధిక్యము. అట్టి నిరవధిక జ్ఞానానంద యుక్త మైనది ఆ ఆస్థానమంటపము. రత్నమనగా ఉత్కృష్టము. అన్నింటికంటె (ఆ జాతిలో) గొప్పది అని అర్థము. ఈ మంటపముకూడ అట్టి ఉత్కృష్టతను కలిగినది యే. ఆ ఆస్థాన మంటపము కూడ వైకుంఠముతో పాటు శ్రీ శ్రీపతులకే చెందునని, 'తస్యాంచ' అను పదమున 'చ' కారము ద్వారా సూచింపబడినది.

'త్వాం సేవితం జలజ చక్ర గదాసి శార్ఙ్గైః
తార్క్ష్యేణ సైన్యపతినా నుచరై స్తథాన్యైః ।'

(శంఖ చక్రాదులతోను గరుడ విష్వక్సేనాదులతోను సేవింపబడుచున్న నిన్ను) అని వైకుంఠస్తవము. 'అతిప్రమాణే దివ్యాయతనే కస్మింశ్చి ద్విచిత్ర దివ్య రత్నమయే దివ్యాస్థానమంటపే' (మిక్కిలి పెద్దదైన దివ్యాయతనము అందు చిత్రవిచిత్ర రత్నమయ మైన దివ్యాస్థానమంటపమునందు) అని శ్రీవైకుంఠ గద్య।

సంస్కృత వ్యాఖ్య :- తస్యామితి । భగవతి । షాడ్గుణ్యపరిపూర్ణే । హే శ్రీః । తస్యాంపురి త్వత్కృపావత్ త్వద్దయేవ నిరవధిజనతా విశ్రమార్హావకాశం నిరవధేః అవధిశూన్యాయాః అసంఖ్యాయాః, జనతాయాః జనసమూహస్య విశ్రమర్హః విశ్రాన్తి యోగ్యః అవకాశః అంతరం యస్మిం స్తథోక్తమ్ । త్వత్కృపాయా స్సర్వవిషయ త్వాత్ తథాత్వమవివాదం తద్వదిద మపీతి భావః । దాస్యతృష్ణాకలిత పరికరైః దాస్యే కైంకర్య కరణే తృష్ణయా స్పృహయా కలితాః గృహీతాః పరికరాః ఛత్ర చామర పతద్గ్రహ కలాచి కాదయో యైస్తైః ఆనందనిఘ్నైః ఆనందవివశైః పుంభిః ముక్తపురుషైః సంకీర్ణం సంభృతం । స్నేహాత్ భగవ ద్దివ్యమంగళవిగ్రహ ప్రేమ్ణః అస్థానరక్షావ్యసనిభిః అస్థానే అకాండే రక్షాయాం రక్షణే వ్యసనిభిః వ్యాకులైః, పరమపదే భయశంకాయా అనవకాశాత్ రక్షావ్యసనస్యా స్థానత్వమ్ । శార్ఙ్గ చక్రాసి ముఖ్యైః చాప సుదర్శన ఖడ్గప్రభృతిభిః పంచాయుధైః, అభయం భయరహితమ్ । ఆనందైకార్ణవమ్ ఆనందస్యా నుకూల జ్ఞానస్యా ర్ణవం సముద్రం, అపరిచ్ఛిన్నా నందావరా మిత్యర్థః । తథాభూతం యువయోః శ్రీ శ్రీపత్యోః ఆస్థానరత్నం మహామణి మంటపశ్రేష్ఠంచాహుః । వేదాంతా ఇతిశేషః । తస్యాం చేత్యత్ర 'చ' శబ్దస్య ఆస్థానరత్నం చాహురిత్యుత్తరత్రాన్వయః । 'ప్రజాపతే స్సభాంవేశ్మ ప్రపద్యస్తే' ఇతిశ్రుతిరత్ర ప్రమాణతయానుసంధేయా'।

అ:- తన్మండపే శేషసింహాసనే విశ్వరక్షా దీక్షితేన స్వామినా సహ సర్వానందావహత్వ మాహ।

శ్లో॥ తత్ర స్రక్ స్పర్శగన్ధం స్ఫురదుపరి ఫణారత్న రోచిర్వితానం
విస్తీర్యానన్త భోగం తదుపరి నయతా విశ్వ మేకాధిపత్యమ్।
తైస్తైః కాన్తేన శాన్తోదిత గుణవిభవై ర్హరతా త్వామసంఖ్యైః
అన్యోన్యాద్వైతనిష్ఠా ఘనరసగహనాన్ దేవి! బధ్నాసి భోగాన్॥

అ:-దేవి= ఓ లక్ష్మీదేవీ, (శ్రీరంగరాజపట్టమహిషీ), తత్ర= ఆ అస్థాన మంటపము నందు, స్రక్స్పర్శగంధమ్= పూలమాలయొక్క స్పర్శవలె మెత్తని స్పర్శయు, దాని యొక్క వాసనవంటి సువాసనయు కలిగినట్టియు, స్ఫుర... వితానం, స్ఫురత్= ప్రకాశించుచున్న, ఉపరి= పైనగల, ఫణారత్న= పడగలయందలి రత్నముల యొక్క, రోచిః= కాంతులే, వితానమ్= చాందినీగా గలిగినట్టియు, అనంతభోగమ్= అనంతుని యొక్క పడగను, విస్తీర్య= విస్తరింపచేసి, తదుపరి= ఆ పడగపైన (కూర్చొని), విశ్వమ్ = లీలావిభూతి నిత్య విభూతి రూపములోనున్న ఈ ప్రపంచమును, ఏకాధిపత్యమ్= ఏకచ్ఛత్రాధిపత్యము కలదానినిగా, నయతా= పొందించుచున్నట్టియు, అసంఖ్యైః= లెక్కలేనట్టియు, తైస్తైః= ఆయా (అవాఙ్మానస గోచరములైన), శాంతోదితగుణవిభవైః = భగవద్వైశ్వరూపరూపమైన శాంతోదిత దశయొక్క గుణవైభవములచేత, త్వాం అర్హతా= నీకు అన్ని విధములతగిన, కాంతేన= ప్రియుడు మనోహరుడునైన శ్రీమన్నారాయణునితో, అన్యోన్య= పరస్పరము, అద్వైతనిష్ఠా= ఏకీభావముచేత, ఘన= దట్టమైన, (నిబిడమైన), రస= ఆనందముచేత, గహనాన్= నిర్భరములైయున్న, (సర్వత్ర వ్యాప్తములైవున్న), భోగాన్= భోగములను, బధ్నాసి= అనుభవించు చున్నావు.

తా :- ఓ లక్ష్మీదేవి! పుష్పమాలవంటి సౌకుమార్యము, సౌగంధ్యము కలిగి, తన పడగల యందలి రత్నకాంతులే చాందినీగాగల శేషునిపై కూర్చుండి తనగుణములను తానే యనుభవించెడి 'శాంతోదిత' దశయందు నీకు తగినగుణములతో కూడి నట్టియు, ఏకచ్ఛత్రాధిపతి య్యైనట్టియు శ్రీమన్నారాయణుని యొక్క గాఢాను రాగానందమును అనుభవించుచు ఆ ఆనందమును ముక్తులకుకూడ పంచి ఇచ్చు చున్నావు.

వి :- లక్ష్మీనారాయణుల పాన్పు ఆదిశేషుడు. అతనియందు శీతలత్వము సౌకుమార్యము సౌగంధ్యము అనుగుణములున్నవని చెప్పుటకు పుష్పమాల ఉపమానముగా నీయబడినది. మరియు ఆదిశేషుడు తెల్లగానుండునుగాన అతని కుపమానముగా నీయబడిన పుష్పమాలకూడ తెల్లగానే యున్నదని భావింప నగును. తెల్లదనము స్వచ్ఛతకు చిహ్నము, 'విస్తరించి ఉండుట' పైన ఉండుట' అనుపదముల

వలన ఆదిశేషుని యొక్క వైశాల్యము ఔన్నత్యము తెలియు చున్నవి. ఈ విధముగా శేషుడు శయ్యగా నుండుటకు తగినవాడని నిరూపింపబడినది. ఆ ఆదిశేషుని పడగల యందలి మణుల కాంతులే చాందిని. ఆ చాందిని క్రిందనుండుట శ్రీమన్నారాయణుని యాధిపత్యమును సూచించును. అనంతు డనగా అనంతములైన గుణములుకల వాడని యర్థము. రక్షించుటలో శ్రియఃపతికివలెనే దాసభావమున (భగవత్కైంకర్యమున) ఈతని గుణముల కంతములేదు. అందువలననే అతడు శేషభూతుడై సార్థక నామ ధేయుడై యున్నాడు. ప్రపంచమంతయు ఏకచ్ఛత్రాధిపత్య మనుట వలన వేరొక ప్రభువు లేడని చెప్పినట్లయినది. శాంతోదితదశ యనగా భగవంతుడు తనగుణములను తానే యనుభవించు దశ. అద్వైతనిష్ఠయనగా ఇద్దరును వేరుకాదు. ఒక్కరే (టే) యని భావింపబడు స్థితి. అట్టి స్థితిలోనుండి శ్రీమహావిష్ణువుతో భోగములనుభవించుచు ఆనందించుచున్నది లక్ష్మీదేవి యని అర్థము. పైన చెప్పబడిన లక్ష్మీనారాయణుల ఏకత్వములో లక్ష్మియొక్క గుణానుభవము భగవంతునకు స్వగుణానుభవముతో సమానము. అట్లే భగవద్గుణానుభవము లక్ష్మికి స్వగుణానుభవముతో సమానము. ఆనందమునకు ఒక్కరు అనుభవించుట కంటె అందరకును పంచి ఇచ్చుటలోనే సార్థకత సిద్ధించును. ఇచట లక్ష్మీదేవి తాను అనుభవించుచు ఇతరులకు కూడ పంచి ఇచ్చినదని చెప్పబడినది. దీని తరువాతి (26వ) శ్లోకముననే ఆమె యానందమును ఎవరికి ఎట్లు పంచి ఇచ్చినదో వివరింపబడినది. ఇచట :-

శ్లో॥ 'తయాసహాసీన మనన్తభోగిని ప్రకృష్టవిజ్ఞాన బలైకధామని।
ఫణామణివ్రాత మయూఖమండల ప్రకాశమానోదర దివ్యధామని॥'

'నివాస శయ్యాసన పాదుకాంశుకో పధాన వర్షాతప వారణాదిభిః।
శరీరభేదై స్తవ శేషతాంగతైః యథోచితం శేష ఇతీరితే జనైః॥'

(నివాసము, శయ్య, ఆసనము, పాదుకలు మొదలగువాని రూపమున, స్వామి యందు తన శేషత్వమును సార్థకపరచుకొను చున్నట్టి అనంతుని పడగల యందు లక్ష్మితో కలిసికూర్చున్న వానిని) అని స్తోత్రరత్నము. 'దేవ్యా శ్రియాసహ వసన్త మనన్తభోగే' (అనంతుని భోగమునందు పట్టమహిషియైన లక్ష్మితో కలిసి కూర్చున్న వానిని) అని వైకుంఠస్తవము- వీనియందు శేషుని శేషత్వము లక్ష్మీ నారాయణుల శేషశయ్యాధివాసమున్ను చెప్పబడినవి. అట్లే శేషుని పుష్పమాలతో పోల్చుటకు 'సుదామరుచి ప్రదిమ సుగంధి' (తెల్లటిపుష్పములను బోలినవర్ణము, సుకుమారత, సౌగంధ్యము కలవాడు) అని ఈ గ్రంథకర్తయొక్క శ్రీరంగరాజస్తవమే ప్రమాణము. అదేవిధమున ఈగ్రంథకర్తయే శ్రీరంగరాజస్తవముననే 'త్వమేవ త్వాం వేత్థ స్తిమిత వితరంగం వరద భోః' (తరంగములు లేక నిశ్చలముగానున్న సముద్రము యొక్క

స్థితిలో నుండి నిన్ను నీవే తెలిసి కొనుచున్నావు) అని శాంతోదితదశను వర్ణించుటయు గమనించతగినది. (ఈ శ్లోక వివరణమున 'సువర్ణకుంచిక' నుండి కొన్ని వాక్యములు గ్రహింపబడినవి)

సంస్కృత వ్యాఖ్య :- తత్రేతి। హే దేవి! తత్ర మహామణి మంటపే స్రక్ స్పర్శ గంధం స్రజః పుష్పమాలికాయాః స్పర్శ గంధావివ స్పర్శగంధౌ యస్య తం తథోక్తమ్ । స్ఫురదుపరి ఫణారత్న రోచిర్వితానం స్ఫురతా ముపరి ఫణారత్నానాం ఉపరితన మాణిక్యానాం రోచింష్యేవ వితానం ఉల్లోచః యస్యతమ్ । అనంతభోగం అనంతస్య శేషస్య భోగం కామం విస్తీర్య విస్తృతం కృత్వా తదుపరి అనంత భోగోపరి, నివిశ్యేతి శేషః । విశ్వం విభూతిద్వయం ఏకాధిపత్యం ఏకచ్ఛత్రాధిపత్యం నయతా గమయతా అసంఖ్యైః సంఖ్యాతీతైః । తైః అవాఙ్మానస గోచరైః । శాంతోదిత గుణవిభవైః శాంతోదితస్య భగవచ్ఛాన్తోదిత దశాయాః స్వవైశ్వరూప్యానుభవరూపాయాః గుణవిభవైః గుణాతిశయైః త్వామర్థతా త్వదనురూపేణ ప్రియేణ కాంతేన హరిణాసహ అన్యోన్యాద్వైతనిష్ఠా ఘనరసగహనాన్ అన్యోన్యం పరస్పరం అద్వైత నిష్ఠయా ఏకీభావేన, పరస్పర గాఢానురాగేణేత్యర్థః॥ ఘనేన నిబిడేన రసేన ఆనందేన గహనాన్నిర్భరాన్ భోగాన్ అనుభవాన్ బధ్నాసి ఘటయసి । యువయోః సేవకానాం సూరి పరిషదాం చేతి భావః। 'బధ బంధనే' ఇత్యస్మాద్ధాతోః శ్నాప్రత్యయే లటస్సిపి 'బధ్నాసీ' తి రూపమ్ ॥

అ :- నకేవలం పత్యు స్త్వమేవానన్దావహా। త్వమివ పత్యు స్తవచ భోగ్య భూతాః పరస్సహస్రం సపత్న్య స్సన్తీత్యాహ ।

శ్లో ॥ భోగ్యా వామపి నాన్తరీయకతయా పుష్పాఙ్గరాగై స్సమం
నిర్వృత్త ప్రణయాతివాహనవిధౌ నీతాః పరీవాహతామ్ ।
దేవి! త్వామను నీలయాసహ మహీ దేవ్య స్సహస్రం తథా
యాభి స్త్వం స్తనబాహుదృష్టిభిరివ స్వాభిః ప్రియం శ్లాఘసే ॥ ౨౬

అ:- హే దేవీ= ఓ లక్ష్మీదేవీ, వాం అపి= మీ ఇద్దరకుకూడా, (లక్ష్మీనారాయణులకు), పుష్పాంగరాగైస్సమమ్= పుష్పమాల, చందనము, కస్తూరి, కర్పూరము, కుంకుమ మొదలగు వానితో సమానముగా, నాంతరీయకతయా= తప్పని సరియైన భోగ్యవస్తువులుగా, ప్రణయఅతివాహనవిధౌ= ప్రేమను అత్యధికముగా ప్రవహింప చేయుట అను కార్యమునందు, పరీవాహతామ్= ప్రవాహత్వమునను, (నిర్గమన మార్గమగుటను), నీతాః= పొందించబడినవారైన, నీలయాసహ= నీలాదేవి తో కూడిన, మహీ= భూమియు, తథా= ఆ విధముగనే, సహస్రం దేవ్యః= వేలకొలది రాణులు, త్వాం అను= నిన్ను అనుసరించుచున్నారు, యాభిః= ఏభూనీలాదులచేత,

స్వాభిః= తన సంబంధమైన (నీయొక్క), స్తనబాహుదృష్టిభిరివ= అవయవ సౌందర్యము చేత వలె, త్వమ్= నీవు, ప్రియమ్= నీప్రియుడైన శ్రీరంగనాథుని, శ్లాఘసే =సంతోష పెట్టుచున్నావో...

తా :- ఓ లక్ష్మీదేవి! మీ ఇద్దరియొక్క ప్రేమప్రవాహాధిక్యమునకు మార్గరూపములై, స్రక్ చందనాదులతో సమానమైన ఆదరము గౌరవము కలవారలై, భూదేవియు, ఆమెవెంట నీలాదేవియు, ఆమెవెంట వేలకొలది దేవేరులు నిన్ను అనుసరించుచున్నారు. నీవును వారియందు ఏవిధమైన అసూయయు లేక, నీయొక్క అవయవసౌందర్యము స్వామికి ఎంతప్రీతికరమో అటువంటి సౌందర్యముతో సమానముగా నున్న వారందరి తోను నీ విభుని సంతోషపెట్టుచున్నావు.

వి :- ఈ పద్యమున శ్రీదేవితోపాటు భూనీళాది దేవేరులందరును స్వామిని సేవించు చున్నారు అని వర్ణింపబడినది. ఒక చెరువులో అధికముగా ఉన్న నీరు ఎట్లు మరియొక మార్గముద్వారా ప్రవహించునో, అట్లే లక్ష్మీనారాయణుల ప్రేమ సంపూర్ణతను పొంది భూనీళాదుల ద్వారా ప్రవహించినది. 'నీలయాసహ మహీ' అని నీలాదేవి భూదేవితో కలిసినట్లు వర్ణించుట నీలాదేవి కంటె భూదేవికి ప్రాధాన్యమును సూచించు చున్నది. ఇట్లే ఇతర రాణులకంటె నీలాదేవికి ప్రాధాన్యము ఈయబడినది అనగా ఇతర రాణులందరును నీలాదేవిని ఆశ్రయించగా, వారలతో కలిసి ఆ నీలాదేవి భూదేవిని, ఆ భూదేవి శ్రీదేవిని ఆశ్రయించుచున్నారని అర్థము.

లక్ష్మీదేవికి భూనీలాదుల యందును, అట్లే వేలకొలది గల సవతులయందును అసూయ లేకపోవుటయేకాక వారిచేత సేవింపబడుచున్నదై ఆమె, శ్రీరంగనాథుడు కేవలము తన అవయవ సౌందర్యము చూచి ఎట్లుసంతోషించునో, అట్లే తన అవయవ సౌందర్యముతో సమానమైన సపత్నుల సౌందర్యముతో కూడ తననాథుని సంతోష పెట్టుచు, తానుకూడ సంతోషించుచున్నది. ఇచట క్రమముగా భూదేవికి లక్ష్మీ స్తనసామ్యమును, నీళాదేవికీ లక్ష్మీబాహుసామ్యమును, ఇతరదేవేరులకు లక్ష్మీ దృష్టి సామ్యమును చెప్పుకొనవచ్చును. ఈ విధముగా భూనీలాదులకు బాహ్యానందము శ్రీదేవికి ఆంతరానందము వర్ణింపబడినవి.

మర్మస్పృశో (45) అను: శ్లోకమున శ్రీదేవి యొక్క ఈ ఆంతరానందమే వివరింపబడినది. ఏ ఆనందమునైనను ఇతరులకు పంచి ఇచ్చుట ఆమెయొక్క అసూయ లేక పోవుటకు నిదర్శనము. 'నాంతరీయకతయా' అను పదముకూడ భూనీలాదు లను స్రక్చందనాదులవలె తప్పనిసరియైన భోగ్య వస్తువులలో చేర్చి పైయర్థమునే బలపరచు చున్నది. మరియు ఇచట 'దేవి' అను సంబోధన సాభిప్రాయము. 'దేవీ కృతాభిషేకాయాం' (దేవియనగా పట్టమహిషి) ఎంతమంది భార్యలున్నను పట్టపురాణి

లక్ష్మియే, మిగిలినవారు భార్యలు మాత్రమే అని. మిగిలిన వారందరు ముందుగా లక్ష్మినే ఆశ్రయించి తరువాత ఆమెయొక్క అంగీకారముతోనే (ప్రేమపురస్సరముగా) శ్రీమన్నారాయణుని సేవించుచున్నారు. స్వామికూడ లక్ష్మియొక్క అవయవ సౌందర్యమునందు వలెనే వారియందు కూడ సమానమైన ప్రేమను కనపరచు చున్నారు. ఈ విధముగా లక్ష్మి సపత్నులచేత సేవింప బడుచున్నట్లు వర్ణింపబడినది.

'శ్రీకృష్ణ జారత్వాద్యనుమోదినీ' (శ్రీ కృష్ణుని జారత్వాదులను అంగీకరించునది) అని శ్రీ గోదాష్టోత్తర శతనామములలో ఒక నామము, 'భూమినీళాది సంసేవ్యే స్వామి చిత్తానువర్తినీ' (భూనీళాదులచేత సేవింపబడునది భగవంతుని మనస్సునకు అనుగుణముగా నుండునది) అని లక్ష్మీ సహస్రములోని వాక్యము కూడ పై విషయమును ధృవపరచుచున్నవి.

సంస్కృత వ్యాఖ్య :- భోగ్యా ఇతి। హే దేవి! వామపి భోగ్యభూతయో ర్యువ యో రపి, పుష్పాంగరాగై స్సమం స్రక్చందనాది తుల్యం అంగరాగ శబ్దేన అంగరచనా హేతుభూత ఘనసార కుంకుమ కస్తూర్యాదయోఽపి గృహ్యంతే। నాంతరీయక తయా స్వభోగ్యతో పయోగేన భోగ్యాః యథా పుష్పాంగరాగాదీనాం ప్రధానభూత స్వభోగ్యతోపయోగేన భోగ్యత్వం తథా తాసామపీతి భావః। నిర్వృత్త ప్రణయాతి వాహన విధౌ నిర్వృత్తస్య పరిపూర్ణస్య ఉద్వేలస్యేత్యర్థః। ప్రణయస్య ప్రేమరసస్య అతి వాహనవిధౌ అతి ప్రవాహణే పరీవాహతాం నిర్గమ ప్రవాహతాం నీతాః ప్రాపితాః శ్రీ శ్రీపత్యోః ఉన్మస్తకః ప్రేమరసః సపత్నీ ముఖేన ప్రవహతీతి భావః।

యథా తటాకః పరిపూర్ణస్సన్నిర్గమ ప్రవాహం వినా ననిర్వహతి తథా శ్రీ శ్రీశయో రత్యుత్కటః ప్రేమరసః భూనీలాది సపత్నీ ముఖేన ప్రవహణం వినా ననిర్వహతీతి హృదయమ్॥ నీలయా నీలాదేవ్యాసహ మహీభూదేవి త్వామను త్వదావ్యాపృతయా ఇత్యర్థః। నీలయా సహేతి నీలాదేవ్యా భూమ్యపేక్షయాఽవ్యాపృత్వం స్ఫుటమ్। 'సహాయుక్తేఽ ప్రధానే' ఇత్యనుశాసనాత్।

తథా భూనీలే ఇవ త్వామనుసృత్య సహస్రం దేవ్య స్సన్తీతిశేషః। త్వం యాభిః దేవీభిః స్వాభిః స్వకాభిః స్తన బాహుదృష్టిభిరివ స్వావయ వైరివ ప్రియం ప్రేయాంసం శ్లాఘసే సంతోషయసి। 'శ్లాఘృకత్థనే' ఇత్యస్మాద్ధాతోః లడాత్మనేపది మధ్యమపురుషైకవచనమ్ । స్తనబాహుదృష్టిభిరిత్యత్ర మహావిభాషయా ద్వంద్వైకవ ద్భావ వికల్పః। నకేవలం లక్ష్మ్యా తాభిస్సమం సాపత్న్య కలహాభావః కిన్తు భగవతః తాభి స్సహ సంశ్లేషే స్వావయవ సంశ్లేష ఇవ తస్యా మహతీ ప్రీతి ర్వర్ధత ఇతి భావః।

అ :- ఇత్థం లక్ష్మ్యా స్సపత్నీసహస్రముక్త్వా పరిచారక వర్గమాహ।

శ్లో॥ తే సాధ్యా స్సన్తిదేవాః జనని గుణవపు ర్వేష వృత్తస్వరూపైః
భోగైర్వా నిర్విశేషా స్సవయస ఇవ యే నిత్యనిర్దోషగన్ధాః।
హే శ్రీః! శ్రీరఙ్గభర్తు స్తవచ పదపరీచారవృత్త్యై సదాపి
ప్రేమప్రద్రాణభావావిలహృదయ హఠాత్కారకైఙ్కర్యభోగాః ౮౭

అ:- జనని=లోకమాతవైన, శ్రీః=ఓ లక్ష్మీదేవి, సాధ్యాః=సాధ్యులను పేరు గల, దేవాః=దేవగణవిశేషములు, నిత్య..గంధాః, నిత్య=ఎల్లప్పుడును, నిర్దోష గన్ధాః=దోషలేశమును లేనివారై, గుణ..స్వరూపైః, గుణ=గుణములతోను, (అపహతపాప్మత్వ, జ్ఞానశక్త్యాదులతో), వపుః=శరీరముతోను, వేష= శంఖ చక్రాద్యలంకారయుక్తమైన వేషముతోను, వృత్త=నడవడులతోను, స్వరూపైః= జ్ఞానానందములచేత స్వచ్ఛములగు స్వరూపములతోను, భోగైః వా(చ)= భగవత్కల్యాణ గుణానుభవముతోను కూడ, నిర్విశేషాః=సమానులై, సవయసః ఇవ= సమాన వయస్సుగల స్నేహితులవలె (వారిలో ఒకరికొకరు - భగవంతునికి కూడ), యే=ఎవరైతే కలరో, ప్రేమ..భోగాః, ప్రేమ=ప్రేమచేత, ప్రద్రాణ=ద్రవించుచున్న, భావ=భావముచేత, ఆవిల=స్వచ్ఛమైన, హృదయ=హృదయముచేత, హఠాత్కార =హఠాత్తుగా ఆచరించునట్టి, కైంకర్య=సేవయు, భోగాః= సుఖమును కలవారై, తే -ఆ సాధ్యులను దేవతలు, శ్రీరంగభర్తుః=శ్రీరంగనాథునకు, తవచ=నీకున్ను, సదా అపి=ఎల్లప్పుడున్ను, పదపరీచారవృత్త్యై=శ్రీపాద కైంకర్యము కొరకు, సన్తి=కలరు.

తా:- ఓ జననీ, నీకును శ్రీరంగనాథునకును శ్రీపాదకైంకర్యమునకై (సేవ కొరకై) సాధ్యులనబడు దేవతలు గలరు. వారినే నిత్యసూరులు అని కూడ అందురు. వారు సంసారబంధములు లేనివారు కాబట్టి దోషలేశముకూడ వారిని స్పృశించదు. గుణములు, శరీరము, వేషము, స్వరూపము, భోగము మొదలగు వానిలో ఒకరికొకరు సమానులగుచు భగవంతునితోకూడ సమానముగనున్నవారివలె కన్పడుదురు. వారు ఒకరిప్రేరణ లేకుండగనే అనగా సహజప్రేమార్ద్ర భావముతోనే హఠాత్తుగా పరిచర్యచేయుటకు సంసిద్ధులైనవారు. అట్టి పరిచారకవర్గముతో కూడిన వారు మీరిద్దరు.

వి:- ఇచట లక్ష్మీనారాయణుల పరిచారకులు చెప్పబడిరి. వారే సాధ్యులని పిలవబడు అనంతగరుడ విష్వక్సేనాదులు. వారు పాపములు లేకపోవుట, జ్ఞాన శక్త్యాదులు కలిగియుండుట అనుగుణములతోను, తదనుగుణములైన వేషములతోను, శంఖచక్రాదులతోను, స్వచ్ఛములైన శరీరములతోను, భోగములతోను ఒకరికొకరు సమానులగుచు శ్రీమన్నారాయణునకు కూడ సమానులా? అనునట్లు కనపడుదురు. వారి స్వరూపాదులవలె వారిమనస్సుకూడ స్వచ్ఛమైనది. కనుక లక్ష్మీనారాయణుల

(పాద)సేవకు ఒకరి ప్రేరణ లేకుండగనే వారంతటవారే ప్రేమార్ద్రమైన హృదయము తో ఎల్లప్పుడును హఠాత్తుగానే సిద్ధమగుచుందురు. ఆహా! అట్టి సేవాభాగ్యము లభించినవారు ధన్యులుకదా! 'యత్ర పూర్వే సాధ్యా స్సన్తి దేవాః' (ఎచ్చటైతే సాధ్యులను దేవతలు కలరో) పురుషసూక్తము.

'హతాఖిలక్లేశమలైః స్వభావతః నిషేవ్యమాణం సచివై ర్యథోచితమ్' (క్లేశము గాని దోషముగాని లేకుండగనున్న పరిచారక వర్గముచేత సేవించబడుచున్న) అని యాళ్వందార్ స్తోత్రము.

'స్వచ్ఛందానువర్తి స్వరూపస్థితి భేదాశేషశేషతైకరతి రూపనిత్య నిరవద్య నిరతిశయ జ్ఞాన క్రియైశ్వర్యాద్యనంత కల్యాణగుణగణ శేష శేషాశన గరుడ ప్రముఖ నానావిధానంత పరిజన పరిచారికా పరిచరిత చరణ యుగళ' (నిత్యకైంకర్య నిరతియు, జ్ఞానైశ్వర్యాది సంపత్తియుకల అనంత గరుడ విష్వక్సేనాది పరిచారకబృందముచేత సేవింపబడు చరణయుగలము కలవాడా) అని శ్రీభాష్యకారుల శరణాగతి గద్యము.

సంస్కృత వ్యాఖ్య :- త ఇతి। హే జనని! శ్రీః! సాధ్యాః సాధ్యనామకా దేవా ద్యోతమానా మోదమానావా నిత్యనిర్దోషగంధాః నిత్యం కాలత్రయేఽపి నిర్దోష గంధాః నిర్గతావద్యలేశాః।'లేశేఽపి గంధ, ఇత్యమరః। అస్పృష్టసంసారగంధా ఇత్యర్థః । గుణ వపుర్వేష వృత్తస్వరూపైః గుణైః అపహత పాప్మత్వాదిభిః జ్ఞాన శక్త్యాదిభిశ్చ, వపుర్భిః విగ్రహైః వేషైః శంఖచక్రాద్యలంకారైః వృత్తైః నిరంకుశవ్యాపారైః స్వరూపైః, భోగైః సవిభూతిక భగవత్కల్యాణ గుణానుభవైర్వా, వాశబ్దశ్చార్థః । భోగైశ్చేత్యర్థః । నిర్విశేషాం విశేషరహితాః। యువాభ్యాం పరస్పరం చేతి శేషః। అత ఏవ సవయస ఇవ సమానవయస్కా ఇవ సఖాయ ఇవవా యే సన్తి తే సూరయః శ్రీరంగభర్తుః తవ చ పదపరీచారవృత్త్యై శ్రీపాద కైంకర్యకరణాయ సదాపి సర్వదేశ సర్వకాల సర్వావస్థా స్వపి ప్రేమప్రద్రాణ భావావిల హృదయహఠాత్కార కైంకర్యభోగాః ప్రేమ్ణా ప్రీత్యా ప్రద్రాణేన ద్రవీభూతేన భావేన అభిప్రాయ విశేషణ అవస్థా విశేషేణవా ఆవిలేన కలితేన హృదయేన మనసా హఠాత్కారో ఝటిత్యాచరణం యస్య తత్తథోక్తమ్। తథాభూతం, కైంకర్యం పరిచరణమేవ, భోగో భృతిః సుఖంవా యేషాం తే తథోక్తాః। తథాభూతా భవంతీతి శేషః। 'భోగస్సుఖే స్త్ర్యాదిభృతౌ' ఇత్య మరః।

యద్వా యే సాధ్యా సాధ్య నామకాః ఇత్యాది పూర్వవిశేషణ విశిష్టాః ప్రేమ ప్రద్రాణ భావావిల హృదయ హఠాత్కార కైంకర్య భోగాస్తే సూరయః శ్రీరంగభర్తు స్తవచ పదపరీచార వృత్త్యై సంతీత్యన్వయః॥

అ :- అథ లక్ష్మ్యా భగవత్ స్వరూప నిరూపక ధర్మతామాహ।

శ్లో॥ స్వరూపం స్వాతన్త్ర్యం భగవత ఇదం చన్ద్ర వదనే
త్వదాశ్లేషోత్కర్షా ద్భవతి ఖలు నిష్కర్షసమయే ।
త్వమాసీర్మాతః! శ్రీః కమితు రిదమిత్థం త్వ విభవః
తదన్తర్భావాత్త్వాం నపృథగభిధత్తే శ్రుతిరపి ॥ ౨౮

అ:- చంద్రవదనే=చంద్రునితోసమానమైన ముఖముకలిగిన, మాతః= జననివైన, హే శ్రీః=లక్ష్మీదేవీ, నిష్కర్షసమయే=నిర్ణయవేళయందు, భగవతః= మహిమాన్వితుడైన శ్రీమన్నారాయణుని యొక్క, ఇదమ్=ఈ, స్వరూపమ్=దివ్యాత్మ స్వరూపమున్ను, స్వాతంత్ర్యమ్= నిరంకుశత్వాది అధికారమున్ను, త్వదాశ్లేషోత్కర్షాత్=ఎల్లప్పుడును అధికముగా నీతో కలిసియుండుటవలన, భవతి ఖలు= అగుచున్నది కదా, త్వమ్=నీవే, కమితుః=ప్రియుడైన శ్రీరంగనాథుని యొక్క, ఇదం ఇత్థం త్వవిభవః =స్వరూప స్వభావ ఉభయవైభవములను నిర్ణయించుదానవు, ఆసీః=అయివున్నావు, శ్రుతిః అపి=వేదముకూడ, తదంతర్భావాత్=భగవంతుని నిరూపించుటలో అంతర్భవించుట వలన, త్వామ్=నిన్ను, పృథక్=వేరుగా, న అభి ధత్తే=చెప్పుటలేదు.

తా:- ఓ లక్ష్మీదేవీ, భగవంతునియొక్క స్వరూపస్వాతంత్ర్యాది నిర్ణయము నీయొక్క ఆశ్లేషాతిశయము వలననే జరుగుచున్నది. అట్లే ఆ భగవానునియొక్క స్వరూపము ఇది అనియు, స్వభావము ఇటువంటిది అనియుకూడ నీవలననే తేలుచున్నది. భగవంతుని పరతత్త్వతా నిర్ణయకోటిలో నీవుకూడ అంతర్భాగమై యున్నందున వేదములుకూడ నిన్ను ఆ పరమాత్మకంటె వేరుగా చెప్పలేదు.

వి:- ఇచట 'చంద్రవదనే' 'మాతః' 'శ్రీః' అను పదములు సాభిప్రాయములు. ఎట్లనగా -'చంద్రవదనే' అను పదము ఆశ్రితులకు, శ్రీమన్నారాయణునకును కూడ ఆనందమును కలుగచేయునది అను అర్థమును సూచించుచున్నది. ఆశ్రితులకానందము కలుగచేయుట వారిని భగవంతుని పొందించుట ద్వారా జరుగుచున్నది. ఇక తాను భగవంతుని ఆశ్రయించి యుండుటచేతనే శ్రీమన్నారాయణుడే పరతత్త్వమని నిర్ణయింపబడినది. ( ఇది భగవంతునకు ఆనందదాయకము) 'వేదాంతా స్తత్త్వచింతాం మురభిదురసి యత్పాదచిహ్నైస్తరన్తి' అని4వ శ్లోకమున చెప్పబడియే యున్నదికదా. అట్లే 'మాతః' అనుపదమునకు కొలచునది అను అర్థము చెప్పుకొనినచో శ్రీమన్నారాయణుని స్వరూప స్వభావములయొక్క ప్రమాణ పరిమాణములను వ్యక్తము చేయునది- అను అర్థముకూడ వచ్చును.

"శ్రీః" అను పదమునకు మొదటి శ్లోకములో వివరింపబడిన ఆరువిధములైన అర్థములను పరిశీలించినచో ఆమె భగవ ద్గుణనిరూపణకోటిలోనే యున్నది కావున శ్రుతి ఆమెను శ్రీమన్నారాయణునికంటె వేరుగా చెప్పలేదని సూచింపబడుచున్నది.

ఈ విధముగా ఈ మూడు సంబోధనల తోనే ఈ శ్లోకముయొక్క భావము సూచింపబడినది. పరమాత్మయందు నిత్యము నివసించుచున్న ఆమెను చూచియే పరతత్త్వ నిర్ణయము జరుగుచున్నదనియు, ఆమె యొక్క భర్తగానే శ్రీమహావిష్ణువునకు ఈశ్వరత్వమనియు సారాంశము.

సంస్కృత వ్యాఖ్య :- స్వరూపమితి! హే చంద్రవదనే! ఆశ్రితానందముఖి! మాతః శ్రీః! నిష్కర్షసమయే నిర్ణయవేలాయాం భగవతః శ్రీమన్నారాయణస్య ఇదం స్వరూపం దివ్యాత్మస్వరూపం స్వాతంత్ర్యం నిరంకుశ స్వతంత్రత్వం చ త్వదాశ్లేషోత్కర్షాత్ త్వన్నియోగాతిశయాత్ భవతి ఖలు। తత్ర హేతుమాహ। త్వమాసీరితి, కమితుః ప్రేయసః త్వ మిద మిత్థం త్వవిభవః ఆసీః।

అయమీశ్వరః ఇతీదం త్వవిభవః। ఈదృశ ఈశ్వర ఇతీత్థం త్వవిభవః। ఉభయమపి త్వమేవా భవః! సన్తః త్వాం భగవతి దృష్ట్వా త్వదాశ్రయమీశ్వరం నిశ్చిన్వన్తి। త్వత్పతిత్వమీశ్వరలక్షణం జానన్తి చేతిభావః। శ్రుతి స్త్వామపి తదంతర్భావాత్ భగవత్ స్వరూప నిరూపక కోటావంత ర్భావాత్, పృథక్ భగవతః పృథక్కృత్య నాభిధత్తే నవదతి! అభిపూర్వాత్ 'డుధాఞ్ ధారణ పోషణయోః' ఇత్యస్మాద్ధాతోః జౌహోత్యాదికాత్ శపఃశ్లౌ 'శ్లౌ' ఇతిద్విత్వే, అభ్యాసహ్రస్వత్వే 'శ్నాభ్యస్తయోరాతః' ఇతి ఆలోపే 'దధస్తథోశ్చ' ఇతి భష్భావే అభిధత్త' ఇతిరూపమ్॥

అ:- 'మంగళం భగవాన్విష్ణుః మంగళం మధుసూదనః మంగళం పుండరీకాక్షో మంగళం గరుడధ్వజః'। 'పవిత్రాణాం పవిత్రంయో మంగళానాం చ మంగళమ్'। ఇతి భగవతి ప్రయుజ్యమానం మంగళపదం శ్రీసంబంధాయత్త మిత్యాహ।

శ్లో॥ తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మఙ్గళపదం
తవేదం నోపాధే రుపనిపతితం శ్రీరసి యతః।
ప్రసూనం పుష్యన్తీమపి పరిమళర్ధిం జగదిషుః
నచైవం త్వాదేవం స్వదత ఇతి కశ్చిత్కవయతే॥ ౨౯

అ:- హే కమలే= ఓ లక్ష్మీదేవీ, ఈశమ్= ప్రభువైన రంగనాథుని, తవ స్పర్శాత్= నీయొక్క సంబంధమువలననే, మంగళపదమ్= మంగళ శబ్దము, స్పృశతి= స్పృశించుచున్నది, యతః= ఎందువలన, శ్రీః అసి= లక్ష్మివి (మంగళ ప్రదురాలవు) అగుచున్నావో, తతః= అందువలన, ఇదమ్= ఈ మంగళపదము, తవ= నీకు, ఉపాధేః= మరియొకరి కారణముగా, (నీప్రియునకు నీవు కారణమైనట్లుగా) నఉపనిపతితమ్ = వచ్చిపడలేదు (సహజముగానే ఉన్నది), ప్రసూనమ్= పుష్పమును, పుష్యన్తీ= గొప్పదానినిగా చేయునట్టి, పరిమళర్ధిం అపి= సువాసనయనెడి ఐశ్వర్యమును కూడ, జగదిషుః= చెప్పదలచినవాడై, కశ్చిత్= ఏ ఒక్కడున్ను, ఏవం త్వాత్= ఈ విధమైన

గుణముకలది కావున, ఏవం స్వదతే=ఈ విధముగా హృద్యముగా నున్నది, ఇతి=అని, నచ కవయతే=చెప్పియుండలేదు.

తా :- ఓ లక్ష్మీదేవీ! నీస్పర్శవలననే విష్ణువు మంగళప్రదుడగుచున్నాడు. స్వయముగ నీవే లక్ష్మివి కాబట్టి నీకీ మంగళపదము మరియొకరి కారణముగా రాలేదు. ఎట్లనగా పుష్పముయొక్క శోభను సౌగంధ్యము అతిశయింపచేయును. కానీ ఆ సౌగంధ్యము నకు మరియొక కారణమును ఏకవియు వర్ణించియుండలేదు. అదియు నీవలె స్వతస్సిద్ధముగా నున్నదే కదా!

వి- శ్రీమన్నారాయణుడు లక్ష్మియొక్క స్పర్శతోనే మంగళ ప్రదుడగు చున్నట్లును, లక్ష్మి స్వయముగానే 'మంగళదేవత' కాబట్టి ఆమెకు వేరొక కారణముగా మంగళత్వము రాలేదనియు అది సహజమైనదే ననియు వర్ణింపబడినది. దీనికి దృష్టాంతముగా పుష్పము-సుగంధము ఈయబడినవి. పుష్పము ఎంత అందముగా నున్నను సువాసనలేనిదే గ్రాహ్యముకాదు. ('వాసనలేని పువ్వు... కొరగానివి' అనియు 'న శోభన్తే నిర్గంధాఇవ కింశుకాః' అనియు కవులు వర్ణించుట గమనించ తగినది) కావున ఇచట పుష్పముయొక్క శోభను అతిశయింపచేయునది సౌగంధ్యము. ఈ విషయమును కవులందరును చెప్పిరి. కాని ఆ సుగంధమునకు, ఆ గుణము సహజము కాబట్టి, అది మరియొక కారణముగా వచ్చినట్లు ఏ కవియు వర్ణించుటలేదు. అట్లే లక్ష్మీనారాయణుల విషయమున కూడ ఇచట పుష్పరూపములో నున్నది శ్రీమన్నారాయణుడు. సుగంధరూపములో నున్నది శ్రీలక్ష్మీదేవి. పుష్పము కంటె సుగంధము విడిగా ఉండకుండగనే ఆ పుష్పముయొక్క శోభను ఎక్కువ చేయుటకు కారణమగును. అట్లే లక్ష్మీదేవి కూడ శ్రీమన్నారాయణుని విడువకయుండి ఆయనకు మంగళత్వము నాపాదించుచున్నది. వారిద్దరును 'పూవు-తావి' వలె ఒకరినొకరు ఎల్లప్పుడును విడిచియుండరనునది ఇచట వ్యంగ్యము. మరియు శ్రీమన్నారాయణుడు పుష్పసుకుమారుడు. లక్ష్మీదేవి నిత్యసుగంధ సంపదతో కూడినది. వారిద్దరి సర్వావయవ సౌందర్యమును కమలముతో పోల్చుట ప్రసిద్ధము. కావున ఇచట 'కమలే' అను సంభోధనకూడ సార్థకతను పొందుచు లక్ష్మియొక్క పద్మినీ జాతిత్వము ను స్పష్టము చేయుచున్నది.

'పద్మాలయాం పద్మకరాం పద్మపత్ర నిభేక్షణామ్ ।
వందే పద్మముఖీం దేవీం పద్మనాభప్రియా మహమ్ ॥'

అను శ్రీస్తుతి యందలిశ్లోకము ఆమె సర్వావయవ సౌందర్యముతోపాటు మంగళ ప్రదత్వమును కూడ చెప్పుచున్నది. సారాంశముగా :-

'మంగళం భగవాన్విష్ణుః మంగళం మధుసూదనః ।
మంగళం పుండరీకాక్షో మంగళం గరుడధ్వజః ॥'

అనియు, పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్ అనియు శ్రీమహావిష్ణువునకు చెప్పబడిన మంగళపదము శ్రీసంబధమువలన వచ్చినదే యని తెలియనగును. సహస్రనామభాష్యము కూడ ''శివః'' (27) అను పదముయొక్క వివరణమున 'మంగళకరుడు' అని అర్థము చెప్పుచు ఈ విషయమునే బలపరచుచున్నది.

సంస్కృత వ్యాఖ్య :- తవేతి। హే కమలే! ఈశం స్వామినం తవ స్పర్శాత్ త్వత్సంబంధాత్ మంగళపదం మంగళశబ్దః స్పృశతి బోధయతి, ఇదం ఏతన్మంగళపదం ఉపాధేః ప్రయోజకాంతరాత్ తవోపనిపతితం నత్వద్వాచకత్వేన సంబద్ధమ్ । కింతు స్వతఏవ। తత్ర హేతుమాహ యతః శ్రీరసీతి యతో హేతోః త్వం శ్రీః మంగళం అసి । తత్ర దృష్టాంతమాహ। ప్రసూనమితి । ప్రసూనం పుష్పం పుష్యన్తీం అతిశయితం కుర్వన్తీమ్ । పరిమళర్ధిమపి గంధసంపదమపి జగదిషుః స్వాద్యాం గదితుమిచ్ఛుః। ఏవం త్వాత్ ఏతాదృశగుణ యోగాత్ ఏవం స్వదతే ఇత్థం హృద్యా భవతి ఇతి కశ్చిత్ కోఽపి పుమాన్ నచ కుయతే నకథయతి హి। చోహ్యర్థః।

పుష్పాతిశయని రూపణే పరిమళాపేక్షేవ పరిమళాతిశయ నిరూపణే గుణాంతరాపేక్షా యథా నాస్తి, తథా భగవన్మంగళత్వే శ్రీసంబంధః నియామకః, నతు తస్యాస్తత్వే నియామకాంతరాపేక్షేతి భావః।

అ :- సర్వేశ్వరస్య లోకపాలానాంచ లక్ష్మీకటాక్షలబ్ధ విభవత్వముక్త్వా సర్వేశ్వరం లోకపాలాంశ్చ ప్రతిపాదయన్ వేదః త్వామేవ ప్రతిపాదయతీత్యాహ।

శ్లో॥ అపాఙ్గా భూయాంసో యదుపరి పరంబ్రహ్మ తదభూత్
అమీ యత్ర ద్విత్రాః సచ శతమఖాది స్తదధరాత్।
అత శ్శ్రీ రామ్నాయ స్తదుభయ ముశంస్త్వాం ప్రణిజగౌ
ప్రశస్తి స్సా రాజ్ఞో యదపిచ పురీకోశ కథనమ్॥ 30

అ :- హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ, తవ=నీయొక్క, భూయాంసః=ఎక్కువైన, అపాంగాః=క్రీగంటిప్రసారములు (కటాక్షములు), యదుపరి=ఏవస్తువు (ఎవరి) యందైతే ప్రసరించునో, తత్=ఆ వస్తువే, పరంబ్రహ్మ=సర్వోత్కృష్టమైన బ్రహ్మ పదార్థముగా, అభూత్=అయ్యెను, అమీ=ఈ కటాక్షములే, యత్ర= ఏవస్తువునందు, ద్విత్రాః=రెండుమూడు మాత్రమే (తక్కువగా) పడుచున్నవో, సచ= అదియున్ను, తదధరాత్=ఆపరబ్రహ్మకంటె తక్కువైన, తరువాతిదియునైన, శతమఖాదిః= ఇంద్రుడు మొదలైన పదార్థముగా, (అభూత్=అయ్యెను), అతః=అందు వలన (నీ కటాక్షము వలననే పొందబడిన ఐశ్వర్యము కలవారగుటవలన) తదుభయమ్= పరబ్రహ్మరూపమైన ఇంద్రాదిరూపమైన ఆరెండు పదార్థములను, ఉశన్=చెప్పుచు,

ఆమ్నాయః=వేదము, త్వామ్=నిన్ను, ప్రణిజగౌ=బాగుగా చెప్పెను, పురీకోశ కథనమ్=పట్టణముయొక్క, కోశాగారముయొక్క ప్రశస్తిని వర్ణించుట, యత్=ఏదైతే కలదో, సాచ=అదియుకూడ, రాజ్ఞః=రాజుయొక్క, ప్రశస్తిః=ప్రసిద్ధియేకదా.

తా :- ఓ లక్ష్మీదేవీ, నీయొక్క కటాక్షములు అధికముగా ప్రసరించిన వస్తువు పరబ్రహ్మపదార్థముగ మారినది. ఆ కటాక్షములే తక్కువగా ( అనగా రెండుమూడు) ప్రసరించినచోట ఇంద్రాది దిక్పాలులు ఉద్భవించిరి. అట్టి వీరందరను చెప్పుటద్వారా వేదము నీయొక్క ప్రశస్తినే చెప్పినది. ఎట్లనగా రాజధాని యొక్కయు కోశాదుల యొక్కయు వర్ణనము రాజుయొక్క ప్రశస్తినే చెప్పునుగదా.

వి :- ఇచట అర్థాంతరన్యాసముద్వారా విషయము వివరింపబడినది. ఒక రాజుయొక్క ప్రశస్తిని వర్ణించుటకు రాష్ట్ర కోశాదివర్ణనము ఉపయోగపడినట్లే లక్ష్మీదేవియొక్క ప్రశస్తిని చెప్పుటకు శ్రీమన్నారాయణుని యొక్కయు బ్రహ్మ రుద్రేంద్రాదుల యొక్కయు వర్ణనము ఉపయోగపడినదని చెప్పుట ముఖ్యోద్దేశ్యము. ఎట్లన :-

వేదములు శ్రీమన్నారాయణుని యొక్కయు బ్రహ్మరుద్రేంద్రాదుల యొక్కయు వర్ణనలను సాక్షాత్తుగా చేసి తద్ద్వారా లక్ష్మియొక్క ప్రశస్తిని చెప్పినవి. ఎందువల్ల ననగా వారందరును ఈమెయొక్క కటాక్షములద్వారానే అంతటివారైరి. అందునను ఎక్కువ కటాక్ష ప్రసరణము పరబ్రహ్మగాను, అంతకంటె తక్కువయైన కటాక్ష ప్రసరణము వరుసగా ఇంద్రాదులు గాను, తయారగుట తత్ కటాక్ష ప్రసరణము యొక్క తారతమ్యరూపమే. వారలను వర్ణించినచో పరోక్షముగా లక్ష్మిని వర్ణించినట్లే యని సారాంశము. ఇచట 'శ్రద్ధయా దేవో దేవత్వ మశ్నుతే' ( లక్ష్మివలననే భగవంతుడు దేవత్వమును పొందుచున్నాడు) అను శ్రుతియు,

బ్రహ్మాద్యాశ్చ సురాస్సర్వే మునయశ్చ తపోధనాః ।
ఏధన్తే త్వత్పదచ్ఛాయా మాశ్రిత్య కమలేశ్వరి! ।

( బ్రహ్మాది దేవతలు మునులందరుకూడ, ఓ లక్ష్మీదేవి! నీయొక్క పదకమలము లను ఆశ్రయించియే వర్ధిల్లుచున్నారు) అను సూక్తియు, 'సదయాపాంగ సందత్త బ్రహ్మేంద్రాది పదస్థితిః' శ్రీమన్మందకటాక్ష లబ్ధవిభవ బ్రహ్మేంద్ర గంగాధరాం' (తనయొక్క కటాక్షప్రసరణముచేతనే పొందబడిన ఐశ్వర్యముగల బ్రహ్మేంద్రాదులు కలది) అను లక్ష్మీసహస్రనామ, అష్టోత్తరశతనామ స్తోత్రముల యందలి వాక్యములు ను అనుసంధేయములు. మరియు 'నారాయణాత్ బ్రహ్మ జాయతే' నారాయణాత్ రుద్రోజాయతే' ( నారాయణుని నుండియే బ్రహ్మ, రుద్రుడు కూడ ఉద్భవించినారు) అను శ్రుతియు;

క ఇతి బ్రహ్మణో నామ ఈశో౾హం సర్వదేహినామ్ ।
ఆవాం తదంగే సంభూతౌ తస్మాత్కేశవ నామవాన్ ॥

(క శబ్దమునకు అర్థమైన బ్రహ్మయు, ఈశ శబ్దమునకర్థమైన ఈశ్వరుడును విష్ణువు యొక్క శరీరమునుండియే ఉద్భవించిరి కావున విష్ణువు 'కేశవ' (క+ఈశ+వత్) శబ్దము చేత పిలువబడుచున్నాడు) అను స్మృతియు బ్రహ్మరుద్రాదులందరును విష్ణువు నుండియే ఉద్భవించిరని చెప్పుచున్నవి.

ఇంతకు పుందు లక్ష్మీనారాయణులకు అభేదము, విష్ణువుయొక్క సృష్టి కార్యక్రమమునకు లక్ష్మియొక్క అంగీకారము మొదలైనవి చెప్పబడి యున్నవి కావున, బ్రహ్మరుద్రేంద్రాదుల ఉత్పత్తికి విష్ణువు కారణముగాను, వారి తరతమభావమునకు లక్ష్మీకటాక్ష ప్రసరణము కారణముగాను చెప్పుకొనవలయును. ఈ విధముగా బ్రహ్మరుద్రేంద్రాదుల ప్రశస్తి పరోక్షముగా లక్ష్మియొక్క ప్రశస్తికే కారణమగుచున్నది.

సంస్కృత వ్యాఖ్య :- అపాంగా ఇతి। హే శ్రీః । తవ భూయాంసః బహు సంఖ్యాః అపాంగాః కటాక్షాః యదుపరి యస్యవస్తున ఉపరి ప్రసృతా ఇతిశేషః తద్వస్తు పరంబ్రహ్మభూత్। తవ భూయః కటాక్ష విషయీభూతం వస్తుపరబ్రహ్మత్వమగమ దిత్యర్థః । అమీ అపాంగాః యత్ర వస్తుని ద్విత్రాః ద్వౌవాత్రయోవా మానం యేషాం తే ద్విత్రాః తేప్రసృతాః, సచతదధరాత్ తతః పరబ్రహ్మణః అధరాత్ అర్వాచీనః శతమఖాదిః అభూత్ । ఇదముపలక్షణం విధిశివయోరపి తదవరత్వం బోధ్యమ్ । 'నారాయణాత్ బ్రహ్మాజాయతే, నారాయణా ద్రుద్రోజాయతే'।' కఇతి బ్రహ్మణో నామ ఈశో౾హం సర్వదేహినామ్ । ఆవాం తదంగే సంభూతౌ తస్మాత్కేశవ నామవాన్' ఇతి బ్రహ్మరుద్రయోరపి భగవత ఉత్పన్నతయా శ్రుతి స్మృత్యవగతత్వాత్ సచేతి శతమఖాద్యపేక్షయా పుంలింగ నిర్దేశః। అతస్త్వత్కటాక్షలబ్ధ విభవత్వా త్తదుభయం పరబ్రహ్మ విధి శివ శతమఖాదిరూపం ఉశన్ కామయమానః వదన్నిత్యర్థః। అమ్నాయో వేదః త్వాం ప్రణిజగౌ । ప్రవ్యక్తం గదితవాన్ । ప్రణి పూర్వాత్ 'గైశబ్దే' ఇత్యస్మాద్ధాతోః లిట్ పరస్మైపద ప్రథమ పురుషైక వచనమ్ ।

తథాహి :- పురీ కోశాదికథనం పుర్యాః రాజధాన్యాః కోశస్య ధనసంచయాదేశ్చ, కథనం అతిశయేన వర్ణనం క్రియత ఇతియత్, జనైరితి శేషః, సా రాజ్ఞః తత్పరిపాలకస్య ప్రభోః ప్రశస్తిః ప్రసిద్ధిః అత్ర పురీకోశకథనం రాజ్ఞః ప్రశస్తిరితి సామాన్య నిర్దేశేన పరబ్రహ్మాది పరామ్నాయకృత లక్ష్మీ ప్రశస్తికథన విశేషస్య సమర్థనాత్ సామాన్యేన విశేష సమర్థన రూపార్థాంతరన్యాసాలంకారః ।

అ:- భగవత్ స్వరూపం స్వాతంత్ర్యం త్వదాశ్లేషాది ప్రాగుక్తం సింహావలోకనేన

నిరీక్ష్య తథాత్వే పరాధీనత్వ మన్యాహితాతిశాయిత్వం విగుణత్వంచ ప్రసజ్యేదిత్యా శంకాం హేతువిశేషేణ దృష్టాన్తబలేనచ పరిహరతి।

శ్లో ॥ స్వత శ్రీ స్త్వం విష్ణోః స్వమసి తత ఏవైష భగవాన్
త్వదాయత్తర్ధిత్వేఽప్యభవ దపరాధీన విభవః।
స్వయాదీప్త్యా రత్నం భవదపి మహార్ఘం న విగుణం
నకుణ్ఠ స్వాతన్త్ర్యం భవతిచ నచాన్యాహితగుణమ్ ॥ 30

అ:- హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ, త్వమ్=నీవు, విష్ణోః= విష్ణువునకు, స్వతః =స్వభావము వలననే, స్వం అపి= తనదానివైతివి, (శేషత్వమును పొందితివి) తతః ఏవ=అందు వలననే, ఏష భగవాన్= భగవంతుడైన ఈ శ్రీరంగనాథుడు, త్వదాయత్త ఋద్ధిత్వే అపి= నీయందే ఆధీనమైన ఐశ్వర్యముకలవాడైనను, అపరాధీన విభవః= పరాధీనమైన విభవముకానివాడు, అభవత్=అయ్యెను, (తథాహి=అది యుక్తమే కదా) రత్నమ్ =రత్నము, స్వయాదీప్త్యా=తనయొక్క కాంతితోనే, మహార్ఘమ్= గొప్పవిలువైనది, భవదపి= అయినప్పటికిన్ని, విగుణం న= గుణహీనము కాదు, కుంఠస్వాతంత్ర్యం నచ= పోయిన స్వాతంత్ర్యముకలదియు కాదు, అన్యాహిత గుణం నచ= పరాధీనమైన అతిశయముకలదియు కాదు.

తా:- ఓ లక్ష్మీదేవీ, నీవు స్వయముగానే (ఒకరిప్రేరణలేకుండగనే), శ్రీమన్నారాయణు నకు శేషస్థానమున ఉన్నావు. అందువలననే భగవంతుని సంపదయంతయు నీ యధీనమే అయి ఉన్నప్పటికిని ఆతడు విగుణత్వాది దోషములను పొందలేదు. ఎట్లనగా రత్నమునకు వచ్చినవిలువ తనయొక్క కాంతి వలననే అయినను అది అమూల్యముగనే ఉండునుగాని గుణరహితము, స్వాతంత్ర్యహీనము, అన్య సంక్రాంతగుణమును కాదు కదా।

వి :- సత్వమాత్మనిసంజాతం స్వామిత్వం బ్రహ్మణిస్థితమ్।
ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావంచ సదాస్మర ॥

(శ్రీమన్నారాయణుడుస్వామి- మనము ఆయనకు భృత్యులము. ఆ విధముగా ఆయనకు మనయందు స్వత్వమున్నది) అనునట్లుగా లక్ష్మికి శేషత్వము, శ్రీమ న్నారాయణునకు శేషిత్వము. అందువలన లక్ష్మియందు భగవంతునకు స్వత్వము. కావున భగవంతుని వైభవమంతయు తన ''స్వం'' అయిన లక్ష్మియందే అధీనమై యున్నది. (లక్ష్మిద్వారానే భగవంతుని తత్త్వము ప్రకటింపబడినది కదా) అయినను భగవంతునకు విగుణత్వాది దోషములంటులేదు. సాధారణముగా పరాధీనవైభవము కలవారికి అట్టి దోషములంటుటకు అవకాశమున్నది. శ్రీమన్నారాయణుడు లక్ష్మ్యధీన

మైన విభవముకలవాడయ్యును పరాధీనవిభవము కలవాడు కాలేదు. ఆమెయందు భగవంతునకు స్వత్వము ఉండుటయే కారణము. భగవంతుని భక్తపరాధీనతకు ఇది నిదర్శనము. అట్టి విగుణత్వాద్యభావమునకు రత్నము దృష్టాంతముగా ఈయబడినది. ఎట్లన :-

రత్నము తనకాంతి మూలముగనే గొప్ప విలువగలది యగుచున్నది. అంత మాత్రమున ఆ రత్నమునకు హీనత్వము, స్వాతంత్ర్యాభావము, అన్యసంక్రాంత గుణత్వము అనెడి దోషములంటవుకదా। అట్లే శ్రీమన్నారాయణునకు కూడ - ఇచట రత్నము విష్ణువు. కాంతి లక్ష్మీదేవి. కాంతి రత్నము యొక్క విలువను పెంచినట్లే లక్ష్మీదేవి విష్ణువుయొక్క విలువను పెంచుచున్నది. అయినను రత్నమునకు వలెనే భగవంతునకు కూడ ఏమియు లోటులేదు. ఆ విలువయే మరొక కారణముగా వచ్చినచో స్వాతంత్ర్యాది భంగముకలిగి యుండెడిదనియు, తనలో ఒక భాగమైన పదార్థము ద్వారానే వచ్చినది కావున ఆ విధముగా జరుగ లేదనియు సారాంశము. ఈ శ్లోకమున దీప్తిపదము కేవలము రత్నముయొక్క కాంతిని చెప్పుటయేగాక లక్ష్మియొక్క ప్రకాశమానత్వమును కూడ ద్యోతనము చేయుచున్నది. అంతేగాక - ఇచట లక్ష్మినారాయణుల 'శేష - శేషి' భావము, శ్రీమన్నారాయణుని భక్త పరాధీనత్వము అయినను స్వాతంత్ర్యాద్య కుంఠితత్వము మరొకమారు నిరూపించ బడినవి.

మరియు 'ఆలు నిర్వాహకురాలు భూదేవియై అఖిల భారకుడన్న ఆఖ్యతెచ్చె, ఇష్ట సంపన్నురాలిందిర భార్యయై కామితార్థదుడన్న ఘనత తెచ్చె... ఆంద్రుబిడ్డలు తెచ్చు ప్రఖ్యాతిగాని మొదటినుండియు, నీవు దామోదరుడవే, చిత్ర చిత్ర ప్రభావ...' అను శ్రీకాసుల పురుషోత్తమ కవిగారి పద్యమును కూడ అన్వయించు కొనవచ్చును.

సంస్కృత వ్యాఖ్య :- స్వతఇతి హే శ్రీః । త్వం విష్ణోః స్వతః స్వభావాత్ నిరుపాధికాత్మ స్వరూప స్వభావాదిత్యర్థః । స్వమసి శేషభూతాసి 'స్వత్వమాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్ । ఆత్మదాస్యం హరేస్స్వామ్యం స్వభావంచ సదాస్మర ఇత్యాద్యనేక ప్రమాణసిద్ధేః తత ఏవ స్వత్వాదేవ ఏష భగవాన్ శ్రీరంగరాజః త్వదా యత్తర్ధిత్వేఽపి అపరాధీన విభవోఽభవత్। తథాహి రత్నం మాణిక్యం స్వయా దీప్త్యా స్వకాన్త్యా మహార్ఘం నిరవధిక మూల్యం భవదపి, విగుణం గుణహీనంన, కుంఠ స్వాతంత్ర్యం ప్రతిహత స్వోత్కర్షంచన, అన్యాహితగుణం పరాధీనాతిశయంచ న భవతి । తద్వత్ త్వచ్ఛ్రియోఽపి త్వదధీన సంపత్త్వేఽపి న విగుణో న కుంఠ స్వాతంత్ర్యో నాన్యాహితాతిశయశ్చ భవతీతి భావః।

అ :- ఇత్థం లక్ష్మీస్వరూప మనుసంధాయ స్వరూపాశ్రితాన్ దివ్యమంగళ

విగ్రహాశ్రితాంశ్చ కల్యాణగుణాన్ వివక్షుః ప్రథమం శ్రీశ్రీశయోస్సాధారణ గుణానను సంధత్తే ।

శ్లో ॥ ప్రశకన బల జ్యోతిర్ జ్ఞానైశ్వరీ విజయప్రథా
ప్రణతవరణ ప్రేమ క్షేమఙ్కరత్వ పురస్సరాః ।
అపి పరిమలః కాన్తి ర్లావణ్య మర్చి రితీన్దిరే
తవ భగవతశ్చైతే సాధారణా గుణరాశయః ॥ 32

అ:- హే ఇందిరే= ఓ లక్ష్మీదేవీ (ఐశ్వర్యప్రదురాలా!), ప్రశక...పురస్సరాః, ప్రశకన=గొప్పశక్తియు, బల=జగత్తును రక్షించు సామర్థ్యమున్ను, జ్యోతిః= తేజస్సున్ను, జ్ఞాన=జ్ఞానము (అన్ని సమయములయందును అన్ని వస్తువులను తెలిసికొనుట), ఐశ్వరీ=ప్రభుత్వమున్ను, విజయప్రథా=జయశీలత్వము యొక్క ప్రశస్తియు, ప్రణతవరణ=ఆశ్రితులను వశముచేసికొనుట, ప్రేమ=ఆశ్రిత పక్షపాతము, క్షేమంకరత్వ=(ఆశ్రితుల యొక్క ఇష్టసాధనత్వ అనిష్టనివారకత్వ రూపమైన) క్షేమమును కలుగచేయుట, పురస్సరాః=మొదలైన, ఏతే=ఈ దివ్యాత్మస్వరూప గుణములున్ను, పరిమళః=పరిమళము, కాంతిః=సౌందర్యము, లావణ్యమ్ =లావణ్యము, అర్చిః=ప్రకాశనము, ఇతి అపి గుణరాశయః=అనెడి శరీరమునకు సంబంధించిన గుణములున్ను, తవ=నీకును, భగవతశ్చ=భగవంతునకున్ను, సాధారణాః-సమానములు.

తా:- ఓ లక్ష్మీదేవీ, శక్తి, బలము, తేజస్సు, జ్ఞానము, ప్రభుత్వము, జయశీలత్వము, ఆశ్రితపక్షపాతము, ఆశ్రితక్షేమంకరత్వము మొదలైన ఆత్మ గుణములున్ను, పరిమళము, కాంతి, లావణ్యము, ప్రకాశము మొదలైన శరీర గుణము లున్ను, ఈ రెండురకములైన గుణములున్ను నీకును శ్రీమన్నారాయణునకు కూడ సమానములు.

వి:- గుణములలో బాహ్య సౌందర్యమును వృద్ధిచేయునవి కొన్ని, అంతః సౌందర్యమును పెంపొందించునవి కొన్ని. వీనిలో శక్తి, బల, తేజో, జ్ఞాన, ప్రభుత్వ, జయశీలత్వాదులు అంతఃకరణ గుణములు. ఈ ఆరింటికిని షాడ్గుణ్యము అనికూడ పేరు. సౌందర్య సౌగంధ్యాదులు బాహ్యశరీర గుణములు. ఈ బాహ్యాభ్యంతర గుణములు లక్ష్మీనారాయణులకు సమానములని ఈ శ్లోకమున చెప్పబడినది. ఇవి భగవంతునకు స్వతస్సిద్ధములనియు లక్ష్మికి భగవంతునిద్వారా వచ్చినవనియు తెలియ నగును. వీనిలో ప్రశకనమనగా ఉత్కృష్టమైనశక్తి, బలమనగా తన సంకల్పము తోనే వస్తువులన్నింటిని ధరించుశక్తి, జ్యోతిస్సు అనగా ఇతరులను ఎదిరించు సామర్థ్యము, జ్ఞానమనగా అన్ని విషయములను ఒకేకాలమునందు ఉన్నవి ఉన్నట్లుగా తెలిసికొనుట, ఐశ్వరియనగా అన్నింటిని తన ఇష్టప్రకారము నియమింపచేయు సామర్థ్యము,

అనాయాసముగా ఇతరులను జయించుట విజయము (విశేషజయము) దానివలన వచ్చెడి ప్రశస్తి విజయప్రథ. ప్రణతవరణమనగా దాసులను అంగీకరించుట, ప్రేమయనగా దాసుల వియోగమును సహింపలేకపోవుట, క్షేమంకరత్వమనగా ఆశ్రయించినవారలకు అనిష్టమును నివారించుట ఇష్టమును కలుగచేయుట అని సువర్ణకుంచికాకారుల వివరణము. ఇక శరీరగుణములలో కాంతియనగా ప్రత్యవయవ సౌందర్యమనియు, లావణ్యమనగా సముదాయసౌందర్య మనియు తెలియనగును అర్చిస్ (ప్రకాశకత్వము) అనగా ఇతరులను ప్రకాశింపచేయుట. తమను చేరినవారిని వీరిద్దరును ముందు తమశరీరగుణమైన ఔజ్జ్వల్యముతోను, తరువాత ఆత్మగుణమగు జ్ఞానముతోను ప్రకాశింపచేయుదురు. ఈ విధముగా ఈ గుణములు కేవలము తమకేగాక తమను ఆశ్రయించిన వారలకు కూడ ఉపయోగపడును.

ప్రశకన బలాదులు తమకును క్షేమంకరత్వాదులు ఆశ్రితులకును ఉపయోగ పడును. మరియు ఇచట 'భగవతః' అను పదము కూడ శ్రీమన్నారాయణుని, పైన చెప్పిన మాహాత్మ్యముకలవానినిగా చెప్పుచు, సార్థకమగుచున్నది. 'గుణరాశయః' అనునపుడు 'రాశి' పదము, అందలి 'బహువచనము' కూడ గుణములయొక్క ఆనంత్యమును తెలుపుచున్నవి.

సంస్కృత వ్యాఖ్య :- ప్రశకనేతి । హే ఇందిరే । పరమైశ్వర్యప్రదే! శ్రీః । ప్రశకనం ప్రకృష్టా శక్తిః, బలం సర్వజగద్భరణ సామర్థ్యం, జ్యోతిస్తేజః, జ్ఞానం సర్వదా సర్వవసు సాక్షాత్కారః, ఐశ్వరీ ఈశ్వరత్వం, విజయప్రథా జయశీలత్వ ప్రశస్తిః ప్రణతవరణం ఆశ్రిత వశీకారః, ప్రేమ ఆశ్రితవిషయప్రీతిః, క్షేమంకరత్వం ఆశ్రితేష్ట ప్రాపకత్వం తదనిష్టనివర్తకత్వంచ పురస్సరాః ప్రధానాని యేషాం తే తథోక్తా ఏతే దివ్యాత్మ స్వరూప గుణాః॥అథ దివ్యమంగళ విగ్రహగుణా నాహ-అపీతి। అపిచేత్యర్థః ।

నకేవల మాత్మగుణా ఏవ సాధారణాం విగ్రహగుణా అపిచేత్యపి శబ్దార్థః। పరిమళః సౌగంధ్యమ్। కాన్తిః సౌందర్యం, సావాయవశోభా, లావణ్యం సముదాయశోభా, అర్చిః ఔజ్జ్వల్యం, పరప్రకాశకత్వమితి యావత్ । ఇత్యేతే ద్వివిధాఅపి స్వరూపవిగ్రహాశ్రిత గుణరాశయో గుణసమూహాః తవ భగవతశ్చ సాధారణాః సమానా ఇత్యర్థః ।

అత్ర భగవతో విజయప్రథా శ్రీరామాయణే 'శత్రోః ప్రఖ్యాతవీర్యస్య రంజనీయస్య విక్రమైః' ఇతి రావణవదనా దభివ్యక్తా । సీతాయాస్తు వాసిష్ఠరామాయణే శత కంధర సంహారే విజయప్రథా సువ్యక్తా । భగవతః క్షేమంకరత్వ ముభయవిధమపి సాక్షాదేవ। లక్ష్మాస్తు ఇష్టప్రాపణం సాక్షాత్ పరంపరయావాపి సంభవతి । అనిష్ట నివర్తకత్వంతు భగవద్వారేతి బోధ్యమ్ ॥

అ :- పున స్సాధారణ గుణా ననుసంధత్తే ।

శ్లో ॥ అన్యేఽపి యౌవనముఖా యువయో స్సమానాః
శ్రీరఙ్గ మఙ్గళ విజృమ్భణ వైజయన్తి! ।
తస్మిం స్తవ త్వయిచ తస్య పరస్పరేణ
సంస్తీర్య దర్పణ ఇవ ప్రచురం స్వదన్తే ॥ 33

అ:- శ్రీరంగ....వైజయన్తి, శ్రీరంగ=శ్రీరంగమునందలి, మంగళ= ఉత్సవాదులను, విజృంభణ=వృద్ధిచేయుటయందు, వైజయన్తి=జెండావలె ఉన్న ఓ లక్ష్మీదేవీ, అన్యే =ఇంతకుముందు చెప్పిన రెండురకముల గుణములకంటె భిన్నములైన, యౌవన ముఖాఃఅపి= యౌవనము సౌకుమార్యము మొదలైన గుణములు కూడ, యువయోః =నీకును శ్రీరంగనాథునకును కూడ, సమానాః=సమానములై ఉండి, తస్మిన్=ఆ శ్రీపతియందు, తవ=నీయొక్క గుణములున్ను, త్వయి=నీ యందు, తస్య=ఆ శ్రీపతి యొక్క గుణములున్ను, దర్పణేఇవ=అద్దమునందు వలె, సంస్తీర్య =వ్యాపించి (ప్రతి బింబించి), పరస్పరేణ=అన్యోన్యము, ప్రచురమ్ =ఎక్కువగా, స్వదన్తే= ఆస్వాదింప బడుచున్నవి. (ఆనందదాయకము లగుచున్నవి.)

తా :- ఓ లక్ష్మీదేవీ, యౌవనము, సౌకుమార్యము మొదలగు మరికొన్ని గుణములుకూడ మీ ఇద్దరకును సమానమైనవి కలవు. అవి మీ ఇద్దరి యందును పరస్పరము అద్దమునందువలె ప్రతిబింబించి మిక్కిలిప్రకాశమును పొందినవై మీ ఇద్దరకును సంతోషమును కలుగచేయుచున్నవి.

వి :- పూర్వశ్లోకమున ప్రశకనబలాదులు ఇద్దరకును సమానములని వర్ణించినట్లే ఈ శ్లోకమున యౌవనసౌకుమార్యాదులు ఇద్దరకును సమానములని వర్ణించబడినది. ఈ రెండు శ్లోకములలోను చెప్పబడిన గుణములన్నియును ఇద్దరి యందును అద్దములోవలె ప్రతిబింబించుచు పరస్పరానందమును కలుగచేయు చున్నవి. అనగా భగవానునియందున్న బలకాంతి యౌవనాదిగుణములు లక్ష్మియందు అద్దమునందువలె ప్రతిబింబించుచున్నవి. అప్పుడు భగవంతుడు 'ఓహో! ఇవి నాయొక్క గుణములు కదా' అని సంతోషించుచున్నాడు. అట్లే లక్ష్మియందున్న పైగుణములు భగవానునియందు అద్దమునందువలె ప్రతిబింబించుచున్నవి. అప్పుడు లక్ష్మికూడ 'ఆహా ఇవి నాయొక్క గుణములు కదా' అని సంతోషించుచున్నది. ఎవరి సౌందర్యము వారికి అద్దములో చూచుకొన్నప్పుడే ఆనందమును కలుగచేయును కదా । అట్లే ఇచటకూడ తమ గుణములను తమలో చూచుకొనుటకంటె ఎదుటి వారిలో అద్దములోవలె చూచుకొని సంతోషించుట ఇరువురికిని సమానముగా వర్ణింప బడినది. ఇందలి సంబోధనకూడ వారిద్దరియొక్క ఆనందాతిరేకమును తెలియ చేయుటయే గాక వారిద్దరును పరస్పర ప్రతిబింబరూపములనికూడ తెలియచేయు చున్నది.

కాళిదాసు రఘువంశమున -

పరస్పరాక్షి సాదృశ్య మదూరోజ్ఝిత వర్త్మసు ।
మృగద్వంద్వేషు పశ్యన్తౌ స్యందనాబద్ధ దృష్టిషు ॥

అను శ్లోకమున సుదక్షిణాదిలీపులు వసిష్ఠాశ్రమమునకు వెళ్ళు సందర్భమున, 'తమ రథముయొక్క మార్గమునకు దగ్గరలో నిలబడి రథమువైపునకే చూచుచున్న లేళ్ళ జంటలయందు పరస్పరము తమ నేత్రసామ్యమును చూచుకొనుచు ఆశ్రమము నకు వెళ్ళిరి' అని వర్ణించినాడు. ఇచట పరస్పరాక్షి సాదృశ్యము అనగా మగలేళ్ళ నేత్రములయందు సుదక్షిణ దిలీపునినేత్ర సామ్యమును, ఆడులేళ్ళ నేత్రములయందు దిలీపుడు సుదక్షిణయొక్క నేత్రసామ్యమును చూచి సంతోషించిరి - అని సూరి వివరణ.

ప్రకృతమున లక్ష్మీనారాయణుల మధ్య పైవిధముగ మూడవ వస్తువు లేకయే వారిరివురే తమతమ గుణములను రెండవవారియందు అద్దమునందువలె చూచి ఆనందించిరని వర్ణించుట శ్రీభట్టరుల విశిష్టత.

సంస్కృత వ్యాఖ్య :- అన్యేఽపీతి । హే శ్రీరంగ మంగళ విజృంభణ వైజయన్తి। శ్రీరంగోత్సవ ప్రకాశనోద్యత కేతో। శ్రీరంగోత్సవ వృద్ధికరీత్యర్థః । అన్యే ఉక్తగుణ వ్యతిరిక్తా యౌవనముఖా యౌవనాదయః ముఖశబ్దేన సౌకుమార్యాదయో గృహ్యన్తే । యువయోః భగవతః తవచ సమానాః సాధారణా స్సన్తః, తవగుణా స్తస్మిన్, తస్య గుణా స్త్వయిచ దర్పణ ఇవ సంస్తీర్య అభివ్యాప్య । పరస్పరేణ అన్యోన్యం ప్రచురం ప్రకామం స్వదన్తే రస్యాభవన్తి । 'స్వాద ఆస్వాదనే' ఇత్యస్మాద్ధాతోః లఙాత్మనేపద ప్రథమపురుష బహువచనమ్ । భగవాన్ లక్ష్మ్యాం ప్రకాశన బలాదీనవలోక్య స్వకీయా ఏవైతేగుణా ఇత్యానంద మనుభవతి । ఏవం లక్ష్మీరపి భగవతి తానుపలక్ష్య స్వకీయా ఏవైత ఇతి సంమోదం భజత ఇతి వక్త్రభిప్రాయః ॥

అ :- ననూభయో స్స్వరూప రూపగుణ సాధారణ్యే సేవకానాం శ్రీ శ్రీశ పృథగనుభవః కథం ఘటత ఇత్యత్రాహ ।

శ్లో ॥ యువత్వాదౌ తుల్యేఽప్యపరవశతా శత్రుశమన-
స్థిరత్వాదీన్ కృత్వా భగవతి గుణాన్ పుంస్త్వ సులభాన్ ।
త్వయి శ్రీస్త్రైకాన్తాన్ మ్రదిమ పతిపారార్థ్య కరుణా
క్షమాదీన్వా భోక్తుం భవతి యువయో రాత్మని భిదా ॥ 3౮

అ :- హే శ్రీః= ఓ లక్ష్మిదేవీ, యువత్వాదౌ=పైరెండు శ్లోకములలో చెప్పబడిన యువత్వాది గుణములు, తుల్యేఅపి= మీ ఇద్దరకును సమానములైనను, భగవతి= శ్రీమన్నారాయణునియందు, పుంస్త్వసులభాన్=పురుషైకనిష్ఠములైన, అపర... స్థిరత్వాదీన్, అపరవశతా=స్వాతంత్ర్యము, శత్రుశమన= శత్రునాశనము, స్థిరత్వాదీన్

=స్థిరత్వము మొదలైనవానిని, కృత్వా=నీకంటె భేదకములనుగా చేసి త్వయి=నీయందు, స్త్రీత్వైకాంతాన్=కేవలము స్త్రీలయందుమాత్రమే ఉండదగిన, మ్రదిమ... క్షమాదీన్వా, మ్రదిమ=మృదుహృదయత్వము, పతిపారార్థ్య=భర్తృపారతంత్ర్యము, కరుణా=దయ (ఇతరుల దుఃఖమును సహింపలేకపోవుట), క్షమా= సహనము (అపరాధములను క్షమించుట), ఆదీన్వా=మొదలైనవానినికూడ, కృత్వా=విష్ణువు కంటె భేదకములుగా చేసి, భోక్తుమ్=ఆయా విరుద్ధలింగ గతములైన గుణములను అనుభవించుటకే, ఆత్మని=మీయొక్క స్వరూపములయందు, భిదా-భేదము, భవతి =కలుగుచున్నది.

తా :- ఓ లక్ష్మీదేవీ! పూర్వోక్తములైన యౌవనాది గుణములు మీ ఇద్దరకును సమానములే అయినను మీ ఇద్దరకును భేదమును కలగచేయు గుణములుకూడ కొన్ని కలవు. అవి విష్ణువునందు పుంస్త్వసులభములైన స్వాతంత్ర్య శత్రుశమన స్థిరత్వాదులు. నీయందు స్త్రీత్వనిష్ఠములైన మృదుత్వ పతివ్రతాత్వ కరుణాక్షమాదులు. ఈ గుణముల ద్వారానే భక్తజనులు మీ ఇద్దరియందును భేదమును తెలిసికొనుచున్నారు.

వి:- ఇద్దరియందును సమానములైన గుణములు వర్ణింపబడి యున్నందున వారిద్దరిలో తేడాతెలియుటకు అవకాశములేదు. కావున వారిద్దరి స్వరూప రూప భేదములను తెలియచేయు గుణములను రెండు శ్లోకములలో వర్ణించుచున్నారు. ముఖ్యముగా పుంస్త్వము, స్త్రీత్వము అనునవి వీరిద్దరి స్వరూపమునకు భేదకములు. అందువలననే పుంస్త్వనిష్ఠ స్వాతంత్ర్యాది గుణములు శ్రీమన్నారాయణునకున్ను స్త్రీత్వనిష్ఠ మార్దవ క్షమాదిగుణములు లక్ష్మికిన్ని వర్ణించబడినవి. అయినచో శ్రీమన్నారాయణుని యందు మృదుత్వక్షమాదులను, లక్ష్మీదేవియందు స్వాతంత్ర్యాదులను లేవా? అనునది ప్రశ్న - దీనికి సమాధానము భగవానుని యందు ఈ గుణములున్నను అవి స్వాతంత్ర్యముతో కూడినవై నిరంకుశములైనవనియు, లక్ష్మి యందు ఆ గుణములున్నను పారతంత్ర్యముతో కూడినవనియు, చెప్పుకొన వలయును. ఈ విధముగా ఈ శ్లోకమున లక్ష్మీనారాయణులయొక్క స్వరూప (ఆత్మ) నిష్ఠములైన భేదక గుణములు వర్ణించబడినవి.

సంస్కృత వ్యాఖ్య :- యువత్వాదావితి । హే శ్రీః । యువత్వాదౌ యౌవనాదౌతుల్యేఽపి యువయోరితి శేషః। భగవతి హరౌ పుంస్త్వసులభాన్ పురుషైక నిష్ఠాన్ అపరవశతా శత్రుశమన స్థిరత్వాదీన్ అపరవశతా స్వాతంత్ర్యం శత్రుశమనం విరోధి నివర్తకత్వం స్థిరత్వం అప్రకంప్యత్వం ఆదిర్యేషాం తాన్ గుణాన్ కృత్వా భేదకా నను సంధాయ, త్వయి భవత్యాం స్త్రీత్వైకాంతాన్ స్త్రీస్వభావాంతరంగాన్ మ్రదిమ పతిపారార్థ్య కరుణా క్షమాదీన్వా మ్రదిమ మృదుహృదయత్వమ్ । పతిపారార్థ్యం భర్తృ

పారతంత్ర్యమ్ కరుణా పరదుఃఖాసహత్వమ్, క్షమా అపరాధ సహత్వమ్, ఆది ర్యేషాం తాన్, వాశబ్దశ్చార్థః। క్షమాదీంశ్చేత్యర్థః। కృత్వా భేదకా ననుసంధాయ భోక్తుం అనుభవితుం యువయో రాత్మని స్వరూపే విగ్రహేచ భిదాభవతి। భేదస్సిద్ధ్యతి। అనుభవితౄణామితి శేషః। యద్యపి ప్రమదిమ కరుణాక్షమాః భగవతోఽపి సమానాః తథాపి స్వాతంత్ర్యాసమవ హితాస్తా ఇహ వివక్షితాః। భగవతో ప్రమదిమాద్యాస్తు న తథావిధా ఇతి భావః।

అ:- శ్రీ శ్రీపత్యోః స్వరూపభేదక గుణా ననుసంధాయ రూపభేదక గుణా ననుసంధత్తే।

శ్లో॥ ఘనకనకద్యుతీ యువదశామపి ముగ్ధదశాం
యువతరుణత్వయో రుచిత మాభరణాది పరమ్।
ధ్రువ మసమానదేశ వినివేశి విభజ్య హరౌ
త్వయిచ కుశేశయోదర విహారిణి! నిర్విశసి॥ 38

అ:- హే కుశేశయోదరవిహారిణి= పద్మమధ్యమున నివసించు ఓ లక్ష్మీదేవీ, ఘనకనక ద్యుతీ=మేఘముయొక్క, బంగారముయొక్క కాంతులను, యువదశామ్ =యువత్వ దశను, ముగ్ధదశాం అపి= ముగ్ధాత్వదశను (తారుణ్యమును), యువ తరుణత్వయోః =యువత్వ తరుణత్వ రూపములైనపై మీ ఇద్దరి దశలకును, ఉచితమ్ =తగినదియు, పరమ్= ఉత్కృష్టమై పరస్పర విలక్షణమైనదియు, అసమానదేశ వినివేశి=(ఇద్దరకును) సమానములైన అవయవములయందు ఉండనిదియు అగు, ఆభరణాది=వస్త్రాది అలంకార సమూహమునున్ను, హరౌ= విష్ణువునందును, త్వయి చ= నీయందును, విభజ్య=వేరుచేసి, నిర్విశసి= అనుభవించుచున్నావు, ధ్రువమ్= నిశ్చయము.

తా:- కమలాలయ యగు ఓ లక్ష్మీదేవీ! నీల కనక వర్ణములను, యౌవన తారుణ్యములను, ఈ రెండింటికిని సంబంధించినవై పరమోత్కృష్టములై పరస్పర భిన్నములై అసమానావయవ సన్నివిష్టములైయున్న వస్త్రాద్యలంకారములను హరికిని నీకును భేదకములనుగాచేసి అనుభవించుచున్నావు.

వి:- ఈ శ్లోకమున ఇద్దరకును రూప (శరీర) నిష్ఠమైన భేదముతోపాటు లక్ష్మీదేవి యొక్క స్వాధీనపతికాత్వముకూడ చెప్పబడినది. విష్ణువుయొక్క వర్ణము నీలమేఘ చ్ఛాయ, లక్ష్మియొక్క వర్ణము బంగరు చాయతోకూడినది. ఒకరిది యువదశ. మరొకరిది ముగ్ధాత్వము. అట్లే ఇద్దరకును ఇద్దరిదశలకును ఉచితములైన ఆభరణాదులు, అనగా పీతాంబరము, ఊర్ధ్వపుండ్రము, యజ్ఞోపవీతము, మొదలగునవి శ్రీమన్నారాయణునకు, పట్టువస్త్రము (శ్వేతాంబరము) కాటుక పసుపు కుంకుమ మకరికాపత్రాదులతో ఇనుమడింపబడిన స్తనాద్యవయవసౌందర్యము లక్ష్మీదేవికిని

మరియు వారు ధరించు ఆభరణములు కూడ అసమదేశ వినివేశితములు. అనగా ఇద్దరును ఒకేఅవయవమునకు ఒకేచోట ఒకేరకమైన ఆభరణములను ధరించరు. పుంస్త్వస్త్రీత్వవివక్షను బట్టి ఏయే అవయవముల యందు ఏయే ఆభరణములను ఎవరు ఎట్లు ధరించవలయునో అట్లు ధరింతురు. అందువలననే అవి సమదేశ వినివేశితములు కావు. ఈ విధములైన స్వరూప రూపభేదములను లక్ష్మియే కల్పించి అనుభవించి ఆనందించుచున్నది. ఈ భేదము లేకపోయినచో వారిద్దరిలోనే ఒకరికొకరికి భేదమును తెలిసికొను అవకాశము ఉండదు.

అంతేగాక ఈ 34, 35 శ్లోకములలో చెప్పబడిన స్వరూప రూప భేదములు భక్తజనుల కొరకే అయినను ఇద్దరును ఒకేరకములైన గుణములను అనుభవించుట కంటె లింగభేదముగా కూడ ఆయా గుణములను అనుభవించుట ఇరువురకును ఆనందదాయకము.

సంస్కృత వ్యాఖ్య :- ఘనేతి. కుశేఉదకే శేతే ఇతి కుశేశయం పద్మం 'జీవనీయం కుశం విషమ్' ఇత్యమరః । తస్య ఉదరే గర్భే విహరతీతి కుశేశయోదర విహారిణి। కమల నిలయే! ఘనకనకద్యుతీ ఘనస్య నీలమేఘస్య కనకస్య సువర్ణస్య ద్యుతీఇవ ద్యుతీ, యువదశాం యువత్వమ్ । ముగ్ధదశాం తారుణ్యమపి యువతరుణత్వయోః యువత్వ తారుణ్యయోః ఉచితం యోగ్యం పరం ఉత్కృష్టం పరస్పర విలక్షణంవా అత ఏవాసమాన దేశ వినివేశి అసమానదేశే పరస్పర భిన్నదేశే ధర్మిణి వినివేశః సంవేశనం యస్య తత్తథోక్తం ఆభరణాది భూషణాది ఆదిశబ్దేనశ్మశ్రు పీతాంబరోర్ధ్వపుండ్ర యజ్ఞోపవీతాది స్తనవసనాంజన హరిద్రా కాశ్మీర మకరికా పత్రాదిచ గృహ్యతే । హరౌ త్వయిచ విభజ్య విభాజకం కృత్వా । నిర్విశసి అనుభవసి హరిం త్వాం చేతిశేషః । ధ్రువం ఏతత్సత్యమ్ । ఏవం విభాజక ధర్మాననుసంధానే యువయోర్భేదగ్రహో యువయో రేవ నభవేదితి భావః। నిరిత్యుపసర్గాత్ 'విశప్రవేశనే' ఇత్యస్మాద్ధాతోః లణ్మధ్యమ పురుషైక వచనే నిర్విశసీతి రూపమ్ ॥

అ :- క్షీరాబ్ధిసార సమష్టితయా లక్ష్మీ విగ్రహం వర్ణయిత్వా కల్పలతాదే స్తద్భగినీతా ముత్ప్రేక్ష్య తథావర్ణనం పయోధేరావిర్భూతస్య అప్రాకృతస్య లక్ష్మీ దివ్యమంగళ విగ్రహస్య నయుక్త మిత్యాహ ।

శ్లో ॥ అఙ్గం తే మృదుశీత ముగ్ధమధురోదారై ర్గుణైః గుమ్ఫితః
క్షీరాబ్ధేః కిమ్భగినీతా ముపగతా మన్యే మహార్ఘా స్తతః ।
ఇన్దుః కల్పలతా సుధా మధుముఖా ఇత్యావిలాం వర్ణనాం
శ్రీరఙ్గేశ్వరి! శాన్తకృత్రిమకథం దివ్యం వపు ర్నార్హతి ॥ 36

అ:- హే శ్రీరంగేశ్వరి= ఓ రంగరాజ్యలక్ష్మీ, తే= నీయొక్క, అంగమ్= శరీరమును, మృదు... రోదారైః, మృదు= సౌకుమార్యము, శీత= చల్లదనము, ముగ్ధ= సౌందర్యము, మధుర= మాధుర్యము, ఉదారైః= ఔదార్యము మొదలుగాగల, గుణైః= గుణముల తో, గుంఫతః= కూర్చుచున్న, (ఘటించుచున్న), క్షీరాబ్ధేః= నీ తండ్రి యైన పాల సముద్రమునకు, ఇందుః= చంద్రుడు, కల్పలతా సుధా మధుముఖాః= కల్పవృక్షము అమృతము మద్యము మొదలైన, మహార్ఘాః= అమూల్యరత్నములు, తతః= నీకంటె, బుభుక్షితామ్= అసారత్వమును (పిప్పిఅగుటను), ఉపగతాః కిం? ఇతిమన్యే= పొంది నట్లున్నవా ఏమి? అని తలచుచున్నాను, ఇతి= అనెడి, ఆవిలామ్ = కలుషితమైన, వర్ణనామ్= వర్ణనను, శాంతకృత్రిమకథమ్= కృత్రిమప్రశంసకు విషయము కానట్టి, (సహజసుందరమైన), దివ్యం వపుః= నీయొక్క అప్రాకృత దివ్యమంగళ విగ్రహము, న అర్హతి= తగదు.

తా :- క్షీరసముద్రరాజ తనయవగు ఓ లక్ష్మీదేవీ, నీతోపాటు చంద్రుడు కల్పవృక్షము అమృతము మధువు మొదలైన పదార్థములు కూడ పాలసముద్రము నుండియే ఉద్భవించినవి. అందువలన కవులు వానిని గొప్పవస్తువులనుగా వర్ణించుచు వాటి సారరూపముగా నిన్ను ఉత్ప్రేక్షించుచున్నారు. కాని మృదు శీత ముగ్ధ మధు రోదారాదులైన సహజగుణములతో తయారుచేయబడిన అప్రాకృత దివ్యమంగళ స్వరూపమైన నీశరీరమును, కేవలము కృత్రిమప్రశంసయే ప్రధానముగా గలిగి చివరకు అసారములుగా కనుపించెడి ఆ చంద్రాదుల సారరూపముగా ఉత్ప్రేక్షించుట నీకు తగనిదే కాక కేవలము దోషభూయిష్ఠము కూడ అగును.

వి:- ఇచట లక్ష్మియందున్న మృదుశీత ముగ్ధ మధురోదారాది గుణములను సహజములైన వానినిగాను, చంద్రాదులగుణములను కేవలము కృత్రిమములైన వానినిగాను వర్ణించుట గమనింపదగినది. అందరును పాలసముద్రమునుండియే పుట్టినవారగుటచే కవులు చంద్రుడు మొదలైనవాటిని గొప్పవస్తువులనుగా వర్ణించుచు లక్ష్మీదేవిని వాటియొక్క సారరూపముగా ఉత్ప్రేక్షించుచున్నారు. ఆ విధమైన ఉత్ప్రేక్ష దోషభూయిష్ఠమైనదని శ్రీభట్టరుల అభిప్రాయము. ఎందువల్లననగా లక్ష్మీదేవి అప్రాకృత దివ్యమంగళవిగ్రహము కలది. అట్టి యామె శరీరము ముందు చంద్రాది పదార్థములు అసారములుగా కన్పట్టును. అందువలన అసారములైన చంద్రాది పదార్థములయొక్క సారభూతమైన దానినిగా లక్ష్మిని వర్ణించుట దోషభూయిష్ఠమైన దని అభిప్రాయము. ఆమెకు తమగుణములనిచ్చి పేయుటవలన అసారములైన, ఆ వస్తువులయొక్క సారముగా ఆమెను వర్ణించుటవలన అసారత్వములోనే ఆధిక్యము వర్ణితమగును. అది క్షీరసముద్రమునకే కళంకాపాదకము. అయితే ఈ వర్ణనలో గొప్ప

పైన చంద్ర కల్పవృక్షాది పదార్థములు అసారములుగా వర్ణింపబడుట లక్ష్మియొక్క గొప్పతనమును వివరించుటకేతప్ప మరొకరకముగా కాదు. ఇందు వృదుశీత ముగ్ధత్వములు చంద్రుని గుణములు. మాధుర్యము అమృత గుణము. ఔదార్యము కల్పవృక్షగుణము. ఇవి యన్నియు లక్ష్మియందున్నవి. ఆయా వస్తువులయందు కేవలము కొన్ని గుణములు మాత్రమే ఉన్నవి. అందువలన అవి అసారములు. ఆ విధముగా తనతో (సహజములై) పుట్టిన చంద్రాది వస్తువులే ఆమె రూపము ముందు అసారములైనచో ఇక మిగిలినవాని విషయమున వేరుగా చెప్పనక్కరలేదు. కావున సారాంశముగా ఆమె 'నిరుపమాన సౌందర్య సౌకుమార్య మాధుర్యౌదార్యాది గుణములు కలది.' అని ఇందలి ధ్వని.

సంస్కృత వ్యాఖ్య :- అంగమితి। హే శ్రీరంగేశ్వరి। తేతవ అంగం వపుః అంగశబ్దేన అవయవవాచినా తత్సముదాయరూపం వపుర్లక్ష్యతే। మృదు శీత ముగ్ధ మధురోదారైః మృదుత్వ శీతత్వ ముగ్ధత్వ మధురత్వ ఉదారత్వైః, భావప్రధానోఽయం నిర్దేశః। గుణైః విగ్రహ గుణైః, సారభూతైరితి శేషః। గుంఫతః గ్రథయతః క్షీరాబ్ధేః త్వత్పితుః ఇందు చంద్రః కల్పలతా సుధే ప్రసిద్ధే మధుసురా। కల్పలతా సుధా మధూని ముఖమాది ర్యేషాం తే తథోక్తాః తే బుభుక్షితాం అసారతాం ఉపగతాః కిము ఇత్యుత్ప్రేక్షా కిం శబ్దః సంభావనాయామ్। తత స్త్వదవయవ బుభుక్షత్వా న్మహార్ఘా అమూల్యా భవంతీతి భావః। మన్య ఇత్యుత్ప్రేక్షావ్యంజనమ్ః ఇతి పూర్వోక్త ప్రకారేణ ఆవిలాం కలుషాం వర్ణనాం ఉత్ప్రేక్షాం ప్రతి శాంత కృత్రిమకథం అపగత కృత్రిమ ప్రశంసం దివ్యం అప్రాకృతం వపుః విగ్రహః నార్హతి నోచితం భవతి అకృత్రిమస్య లక్ష్మీ విగ్రహస్య కృత్రిమవస్తు సారత్వోత్ప్రేక్షణం అయుక్తం ఇతి భావః।

అ :- పునర్విగ్రహమేవ వాగగోచరం వర్ణయతి।

శ్లో॥ ప్రణమ దనువిధిత్సా వాసనా నమ్రమగ్రే<br>
ప్రణయి పరిచిచీషాకుఞ్చితం పార్శ్వకేన।<br>
కనకనికష చఞ్చు చ్ఛుమ్బిత స్రక్సమాన<br>
ప్రవర మిద ముదారం వర్ష్మ వాచామభూమిః॥ 32

అ :- (హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ) అగ్రే=ఉత్తమాంగమున (శిరోభాగమున) ప్రణమ..నమ్రమ్, ప్రణమత్=నమస్కరించువారలకు, అనువిధిత్సా=ప్రతి నమస్కారము చేయకోరుట యనెడి. వాసనా=పరిచయము (అలవాటు) చేత, నమ్రమ్=కొద్దిగా వంగి యున్నదియు, పార్శ్వకేన=ప్రక్కభాగములచేత, ప్రణయి... కుంచితం, ప్రణయి =ప్రియుడైన శ్రీరంగనాథునియొక్క, పరిచిచీషా=సేవచేయు కోరికచేత, ఆకుంచితమ్=సంకోచమును పొందినదియు, కనక...ప్రవరం, కనకనికష=బంగారు

రేఖవలె, చంచత్=ప్రకాశించుచున్నదియు, చంపకస్రక్=సంపంగి పూదండ తో, సమానప్రవరమ్=సమానమైన కాంతికలదియు, ఉదారమ్=ఔదార్యగుణ యుక్త మైనదియు, ఇదమ్=అప్రాకృతమైన, (తవ) వర్ష్మ=(నీయొక్క) దివ్యమంగళ విగ్రహము, వాచాం అభూమిః=వాక్కులకు అగోచరము.

తా :- ఓ లక్ష్మీదేవీ, నమస్కారము చేయుచున్న భక్తులకు ప్రతినమస్కారము చేయవలయుననెడి, వారి యభీష్టములను నెరవేర్చవలయుననెడి కోరికలతో కొద్దిగా వంచిన శిరస్సు కలదియు, ప్రియుడైన శ్రీరంగనాథుని పరిచర్యకొరకై సంకోచ భావమును పొందిన పార్శ్వములు కలదియు, బంగారురేఖతోను సంపంగి పూదండ తోను సమానముగా నున్నదియు, అయిన నీయొక్క అప్రాకృత దివ్యమంగళ విగ్రహము వర్ణింపనలవి కానిది.

వి :- భగవంతునకు భక్తులకు నడుమ లక్ష్మీదేవియొక్క మధ్యవర్తిత్వమున్ను, ఆమెయొక్క సౌందర్య పరాకాష్ఠయు ఇచట మరొకమారు వర్ణింపబడినవి. ఆ దివ్యమంగళ విగ్రహము వాక్కులకు గోచరముకాదు. ఒకవైపున భక్తులను రక్షించుట కుద్యుక్తమైనది. మరియొక వైపున శ్రీరంగనాథుని పరిచర్యకై ఆయత్తపడునది ఈ విధముగా ఆమెయొక్క 'భక్తుల యభీష్టమును నెరవేర్చగలనో లేనో' అను భయమున్ను, ప్రియుడైన శ్రీరంగనాథునియందు భక్తియు ఇందు సూచింపబడినవి. ఇక ఆమె సౌందర్యవిషయమున, గీటురాయిపై గీయబడిన బంగారు రేఖవలె ఉన్న శరీరకాంతి కలది అని చెప్పుటవలన ఔజ్జ్వల్యమున్ను, సంపంగిపూదండతో సమాన మైనది అని చెప్పుటవలన సౌగంధ్యమున్ను సూచితములు.

ఉదారం అను పదము ఆమెయొక్క ఔదార్యమును కూడ సూచించుచున్నది. ఇన్ని విశేషములు కలది కనుకనే ఆమెయొక్క అప్రాకృత దివ్యమంగళ విగ్రహము వాక్కులకగోచరముగా చెప్పబడినది.

సంస్కృత వ్యాఖ్య :- ప్రణమదితి। అత్ర శ్రీస్తవేతి పదద్వయమధ్యాహార్యమ్। హే శ్రీః అగ్రే ఉత్తమాంగే ప్రణమదనువిధిత్సా వాసనానమ్రం ప్రణమతాం సేవకానాం అను విధిత్సాయాః అనువిధానేచ్ఛాయాః వాసనయా పరిచయేన, నమ్రం ఈషద్వినతం పార్శ్వకేన పార్శ్వభాగేన, ప్రణయిపరిచిచీషాకుంచితం ప్రణయినః ప్రియసవ పరిచిచీషయా పరిచర్యేచ్ఛయా కుంచితం భయభక్తిభ్యాం హేతుభ్యాం సంకుచితం కనకనికషస్య ఛాయాయాః సువర్ణరేఖాయాః చంచత్యాః స్ఫురన్త్యాః చంపకస్రజః చంపక మాలికాయాశ్చ సమానస్తుల్యః ప్రవరో గోత్రం యస్య త త్తథోక్తం తయో స్సదృశ మిత్యర్థః।

అనేన ఔజ్జ్వల్య సౌగంధ్యే సూచితే । ఉదారం ఊర్జితం సర్వాభీష్ట ప్రదంవా, ఇదం ఏతత్ అప్రాకృతం తవ వర్ష్మ వపుః వాచామభూమిః అపదం వాగగోచర మిత్యర్థః॥

అ :- ఆశ్రితరక్షానుకూలాధిరాజ్య సూచకాసికావిశేషవిశిష్టాం శ్రియ మనుసంధత్తే।

శ్లో ॥ఏకం న్యఞ్చ్య నతిక్షమం మమ పరం చాకుఞ్చ్య పాదామ్బుజం
మధ్యే విష్టరపుణ్డరీక మభయం విన్యస్య హస్తామ్బుజమ్ ।
త్వాం పశ్యేమ నిషేదుషీం ప్రతికలం కారుణ్య కూలఙ్కష
స్ఫారాపాఙ్గ తరఙ్గ మమ్బ! మధురం ముగ్ధం ముఖం బిభ్రతీమ్॥ 38

అ :- హే అంబ=జగజ్జననివైన ఓ లక్ష్మీదేవీ, మమ=(దాసుడనైన) నాకు, నతిక్షమమ్=నమస్కారమునకు యోగ్యమగునట్లుగా, ఏకం పాదాంబుజమ్=ఒక పాదపద్మమును (కుడికాలును), న్యంచ్య=సింహాసనమునుండి క్రిందకు చాపి, పరం చ=రెండవ పాదపద్మమును (ఎడమ కాలును) కూడ, ఆకుంచ్య=సింహాసనము నందే అడ్డముగా మడచి, అభయమ్=అభయసూచక ముద్రతో కూడిన, హస్తాంబుజమ్ =పాణిపద్మమును, మధ్యేవిష్టరపుండరీకమ్=సింహాసనమైన పద్మమునకు మధ్యగా, విన్యస్య=ఉంచి, నిషేదుషీమ్=కూర్చొని ఉన్నట్టియు, కారుణ్య....తరంగం' కారుణ్య =దయతో, కూలంకష=పొంగిప్రవహించుచున్న, స్ఫార=విశాలమైన, అపాంగ తరంగమ్=తరంగరూపములైన అపాంగములు కలిగినట్టియు, మధురమ్=మాధుర్య యుక్తమైన, (ఆశ్రయించుటకు వీలైన) ముగ్ధమ్= సౌందర్యయుక్తమైన, ముఖమ్= ముఖమును, బిభ్రతీమ్=కలిగియున్నట్టియు, త్వామ్=నిన్ను, ప్రతికలమ్= అను క్షణము, (అన్ని సమయములయందు) పశ్యేమ=చూచెదము (సేవించెదము).

తా :- జగజ్జననివైన ఓ లక్ష్మీదేవీ! మావంటి భక్తులు సేవించుకొనుట కొరకై దక్షిణపాదమును సింహాసనమునుండి క్రిందకు జాపి, వామపాదమును అడ్డముగా మడిచి. అభయ ప్రధాన సూచకమైన హస్తముద్రతో అపార కరుణాపాంగములతో కూడిన ముఖముతో, పద్మ(సింహాసన)మునకు మధ్యగా కూర్చొనియున్న నిన్ను ఎల్లకాలము సేవింతుము.

వి :- లక్ష్మికి పద్మమే సింహాసనము. ఆ సింహాసనమున అభయ ముద్రతో కూర్చొనియున్న ఆమెయొక్క ఆకారము ఇచట యథాతథముగా చిత్రీకరించబడినది. కుడికాలు క్రిందకు చాపబడినట్లును ఎడమకాలు అడ్డముగా మడచి ఉంచబడినట్లును వర్ణింపబడినది. ఈ కుడికాలును క్రిందకు చాపుట కేవలము భక్తానుగ్రహ తత్పరతను వ్యక్తముచేయుచున్నది. ఆ కాలు కూడ ఎడమకాలు వలెనే అడ్డముగా మడిచినచో పద్మాసనము పూర్తియగును. కాని భక్తులకు తత్పాదసేవ లభించదు. అందుకనియే ఆ పాదమును క్రిందకు జాపుట. దీనితోపాటు అభయహస్తముద్రయు, కూలంకషము

గా ప్రవహించు తరంగములవంటి అపాంగములయందు అపార కృపావత్త్వము, అట్టి ముఖముతో ప్రకాశించుట ప్రశాంతతకు, అనుగ్రహ పరాకాష్ఠకును సూచకములు. ఈ విధమైన లక్ష్మియొక్క ఆకారమును ఎల్లప్పుడు విడువ కుండగ సేవించుట కోరతగినది. 'ప్రతికలం' అను పదము 'ఒక్క క్షణము కూడ విడువకుండగ' అను నర్థము నిచ్చుచున్నది. కుమారుడు తల్లిని వదలి ఎట్లుండ లేడో, అట్లే భక్తుడు కూడ జగజ్జననిని వదలి యుండలేడు. ఆమెకూడ భక్తులయందు మాతృవాత్సల్యమును చూపును. అందువలననే 'అంబ' అను సంబోధనముకూడ సార్థకమగుచున్నది. 'మాతృవత్ సానుకంపాస్యాం' (తల్లివలె దయ గలిగి యుందును) అని లక్ష్మీ సహస్రనామ స్తోత్రమున స్వయముగా లక్ష్మిచేతనే చెప్పబడినవాక్యము ఇచట స్మరణీయము. 'మమ' అను సంబంధషష్ఠి దాసభావమును చెప్పును. పైన చెప్పిన విధముగా విశ్వరక్షణ కొరకై ఉపయోగించెడి ఆమెయొక్క సింహాసనస్థితి ఎల్లవేళల ఎల్లరకును కోరతగినది సేవించ తగినది కూడ.

ఇది ధ్యాన శ్లోకము

సంస్కృత వ్యాఖ్య :- ఏకమితి। అంబ! హే శ్రీః! మమ దాసభూతస్య నతిక్షమం ప్రణామయోగ్యం ఏకం పాదాంబుజం దక్షిణం న్యంచ్య సింహాసనాదధః ప్రసార్య పరం ఇతరత్ వామ పాదాంబుజం ఆకుంచ్యతిర్యగితిశేషః, అభయం అభయ సూచకం అభయదాయివా హస్తాంబుజం మధ్యే విష్టరపుండరీకం ఆసనపద్మ మధ్యే విన్యస్య నిషేదుషీం ఆసీనాం కారుణ్య కూలంకషస్ఫారాపాంగ తరంగం కారుణ్యేన దయయా కూలంకషౌ ఉత్కూలౌ స్ఫారౌ విశాలౌ అపాంగౌ తరంగావివ యస్య తత్తథోక్తమ్, మధురం ప్రియం భోగ్యంవా। 'స్వాదుప్రియౌతు మధురౌ' ఇత్యమరః। ముగ్ధం సుందరం। 'ముగ్ధః సుందర మూఢయోః' ఇత్యమరః। ముఖం ఆసనం బిభ్రతీం త్వాం ప్రతికలం సర్వకాలం పశ్యేమ సేవేమహి విశ్వరక్షణోపయుక్త సింహాసనావస్థితి విశేష ఏవ తే సంతత సేవనీయః సంశ్రితానా మితి భావః।

అ :- ఇత్థం శ్రియం సంసేవ్య సేవాజనితప్రీత్యా తత్పాదౌ శరణముపగచ్ఛతి।

శ్లో॥ సురభిత నిగమాన్తం వన్దిషీయేన్దిరాయాః
తవ కమలపలాశ ప్రక్రియం పాదయుగ్మమ్ ।
వహతి యదుపమర్దై ర్వైజయన్తీ హిమామ్బుః
ప్లుతిభిరివ నవత్వం కాన్త బాహాన్తరాళే ॥ ౩౮

అ :- (హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ!), ఇందిరాయాః= ఐశ్వర్యప్రదురాలవైన, తవ= నీయొక్క, కమల పలాశప్రక్రియమ్= పద్మదళములవంటి ప్రేళ్ళు కలిగినట్టియు, సురభిత నిగమాంతమ్= పరిమళింపచేయబడిన ఉపనిషత్తులు కలిగినట్టియు, (వేదాంత వేద్యమైనట్టియు) పాదయుగ్మమ్= పాదద్వయమును, వందిషీయ= నమస్కరించెదను,

(స్తుతించెదను) వైజయంతీ=వనమాల, కాంతబాహాంతరాళే=విష్ణువు యొక్క బాహు మధ్యమున, (వక్షఃస్థలమున) యదుపమర్దైః=ఏ పాదయుగ్మము యొక్క ఘట్టనము చేత, హిమాంభః ప్లుతిభిః ఇవ=చన్నీటియొక్క సేకముచేత వలె, నవత్వమ్=నిత్య నూతనత్వమును, వహతి=వహించుచున్నదో.

తా :- ఓ లక్ష్మీదేవీ, సుకుమారములైన పద్మదళములతో సమానములైన వ్రేళ్ళు కలిగినట్టిదియు, వేదాంతవేద్యమైనట్టిదియు, అయిన నీపాదయుగమునే ఎల్లప్పుడును సేవించి స్తుతించెదను. ఆ పాదయుగ్మస్పర్శతోనే విష్ణు వక్షఃస్థలముననున్న వనమాల నిత్యము చన్నీళ్ళతో తడుపబడినదానివలె నవత్వమును పొందుచున్నది.

వి :- 'మృదుమధురమైన కుసుమ కోమలమైన లక్ష్మియొక్క పాదద్వయమే శరణు పొందతగినది.' అని తన్మాహాత్మ్యమును ఇందు వర్ణించుచున్నారు. సురభిత నిగమాంతం అను పదము కేవలవేదాంతవేద్యత్వమునే గాక ఉపనిషత్తులలో పూర్తిగా లక్ష్మీదేవియొక్క స్వరూపమే నిండియున్నది అని సూచించుచున్నది. ఆ విధముగా ఉపనిషత్తులకు ఉత్కృష్టత నిరూపించబడినది. ఇందిరాపదము 'ఐశ్వర్యము నిచ్చునది' అను అర్థమును చెప్పుచు భగవంతునకే ఐశ్వర్యము నిచ్చునదిగా సార్థకమైనది. 'ఇష్టసంపన్నురాలిందిర భార్యయై కామితార్థు డన్న ఘనతదెచ్చె'. కాలివ్రేళ్ళు పద్మ దళములతో సమానములని చెప్పుటవలన పాదములకు పద్మసామ్యము సూచింప బడినది. తద్వారా ఆ పాదములయొక్క సౌకుమార్యము సౌగంధ్యము కూడ సూచింపబడినవి. ఇచట సువర్ణకుంచిక ఇట్లు చెప్పుచున్నది. 'కమల పలాశ ప్రక్రియం' తామర పూవురేకు విధము. అనగా సౌరభము మార్దవము మొదలగునవి. వీనిని శ్రీదేవి చరణ కమలములు కలిగియున్నవి. కమలదళమును పోలిన పాదపద్మమని యనుట. దళములంబోలిన వ్రేళ్ళనియు కొందరు వచింతురు' అని. మరియు లక్ష్మి ఎల్లప్పుడును విష్ణువక్షస్థలముననే యుండును. కావున అచటనే వనమాలకు తత్పాద ఘట్టనము అనివార్యము. వనమాలకూడ పూలమాలయే కాబట్టి ఆమెయొక్క పాద ఘట్టనముచే వాడిపోవుటకు అవకాశమున్నది. అయినను ఆ వనమాల వాడక పోవుటయేగాక నిత్యనూతనత్వమును వహించుచున్నది. ఎట్లనగా శ్రీపాద సంస్పర్శ ఆ వనమాలకు చన్నీళ్ళు చల్లినట్లుగా అగుచున్నది. పుష్పములపై చన్నీళ్ళు చల్లినచో వాటియొక్క సౌంగధ్య సౌందర్యములు ఇనుమడించుట లోక ప్రసిద్ధము. అట్లే ఈమెయొక్క పాదస్పర్శ ఆ వనమాలకు అట్టి అనుభూతిని కలిగించుచున్నది అనగా అమృతోపమానమైన, మకరందమును స్రవింపచేయునట్టి, లక్ష్మీపాదయుగ్మ స్పర్శవలన అచ్చటనే వున్న వనమాల ప్లావితమై నిత్యనూతనత్వమును వహించు చున్నది. ఇచట లక్ష్మీ పాదయుగ్మమునకు పద్మోపమ్యమేగాక మకరంద స్యందనము

కూడ వర్ణింపబడినది. అది విష్ణు వక్షఃస్థలముననున్న వనమాలకే సౌందర్యాపాదకము శోభాతిశయ హేతువు, అయినచో ఆశ్రయించిన భక్తుల విషయములో వేరుగా చెప్ప నక్కరలేదు. అట్టి లక్ష్మీదేవిని నమస్కరించుచున్నాను లేదా స్తుతించుచున్నాను అని దీని తాత్పర్యము. గ్రంథకర్తకు స్వఅర్థసిద్ధి ఇచట ప్రయోజనము. వ ం రి య ం ం విష్ణువుయొక్క వక్షఃస్థలము లక్ష్మి నాట్యమాడుటకు తగినంత వైశాల్యము కలిగి యున్నదని సూచితము. ఈ స్తోత్రమునసే 3వ శ్లోకమువద్ద చెప్పుకొనినట్లుగా

కాత్యన్యా త్వామృతేదేవి సర్వయజ్ఞమయం వపుః
అధ్యాస్తే దేవదేవస్య యోగిచింత్యం గదాభృతః।

అను శ్రీస్తుతిలోని శ్లోకముకూడ ఇటు అనుసంధేయము. (ఈ శ్లోకము అచట వివరింపబడినది.)

సంస్కృత వ్యాఖ్య :- సురభితేతి। ఇందిరాయాః పరమైశ్వర్యప్రదాయాః తవ కమలపలాశ ప్రక్రియం కమల పలాశానాం ప్రక్రియా రీతిర్యస్య తత్ కమల దల సదృశాంగుళీత్యర్థః 'పలాశః కింశుకే పత్రే' ఇతివిశ్వః సురభితనిగమాన్తం వాసిత వేదాన్తం వేదాన్తవేద్యమితి యావత్। పాదయుగ్మం వందిషీయ అభివాదయేయ। స్తువేయవా। 'వదిఅభివాదనస్తుత్యోః' ఇత్యస్మాద్ధాతోః లిఙాత్మనేపదోత్తమ పురుషే 'ఇదితోనుమితి' నుమాగమే 'లిఙః సీయుట్' ఇతిసీయుడాగమే తస్య ఇడాగమే షత్వే 'ఇతోఽత్' ఇతి ఇటః అదాదేశే 'వన్దిషీయే'తి రూపమ్॥ ఉత్తరార్థేన పాదయుగ్మమేవ విశినష్టి :- వహతీతి। వైజయన్తీ వనమాలా కాంత బాహాంతరాలే ప్రియవక్షసి యదుపమర్దైః సంఘర్షైః హిమాంభః ప్లుతిభిరివ హిమసలిల సేచనైరివ నవత్వం నూతనత్వం వహతి। అమృతస్యన్ది సుకుమార శ్రీపాదసంస్పర్శేన శోభాతిశయంధత్త ఇతి భావః॥

అ :- లక్ష్మీకటాక్ష విగ్రహ వైలక్షణ్య మనుసంధత్తే।

శ్లో॥ త్వత్ స్వీకార కలావలేపకలుషా రాజ్ఞాం దృశో దుర్వచాః
నిత్యం త్వన్మధుపాన మత్తమధుపశ్రీ నిర్భరాభ్యాం పతిమ్।
దృగ్భ్యామేవ హి పుణ్డరీకనయనం వేదో విదామాస తే
సాక్షాల్లక్ష్మి! తవావలోకవిభవః కాక్వా కయా వర్ణ్యతే॥ ४० 

అ :- హే లక్ష్మి= ఓ లక్ష్మీదేవి, త్వత్... కలుషాః, త్వత్ స్వీకార = నీ యొక్క దృష్టిలేశ ప్రసారము (దయాదృష్టి) అనెడి, కలాఅవలేప= కళయొక్క గర్వముతో, కలుషాః = కలుషితములైన (విత్తమదమత్తచిత్తులైన) రాజ్ఞామ్ = రాజుల యొక్క, దృశః= దృష్టులు, దుర్వచాః= వర్ణింపశక్యముకానివి అగుచున్నవి, నిత్యమ్ = ఎల్లప్పుడు,

త్వన్మధు .. నిర్భరాభ్యామ్, త్వన్మధుపాన=నీయొక్క రూపమనెడి మకరంద పానము చేత, మత్తమధుపశ్రీ=మదించిన తుమ్మెదయొక్క కాంతితో, నిర్భరాభ్యామ్= నిండిన, (నిశ్చలత్వరక్తత్వములతో కూడిన) దృగ్భ్యామ్ =నేత్రము లతో, తే పతిమ్= నీ యొక్క భర్తయైన విష్ణుమూర్తిని, పుండరీక నయనమ్=పుండరీకాక్షునిగా, వేదః= వేదము, విదామాస హి=తెలిసికొనెను గదా, (చెప్పినదిగదా) సాక్షాత్=సాక్షాత్తుగా, తవ=నీ యొక్క, అవలోకవిభవః= దృగ్వైభవము, కయా కాక్వా= ఏవిధముగ, వర్ణ్యతే=వర్ణింప బడుచున్నది? ( ఏ విధముగను వర్ణించుటకు శక్యముకాదు).

తా :- ఓ లక్ష్మీదేవీ, నీయొక్క దృష్టిపాతమాత్రమున కేవలము రాజులే మత్తెక్కిన నేత్రములు కలవారగుచు కవులచేత వర్ణించుటకు అశక్యమైన స్థితిని అనుభవించు చున్నారు. ఇక లోకపాలుర విషయమున చెప్పనదేమి? అట్లే నీ యందలి రూప మకరందాస్వాదనము చేయుచు, భ్రమరస్థానములోనున్న శ్రీమహావిష్ణువు యొక్క నేత్రములు ఎల్లప్పుడు నిన్నే నిశ్చలముగా చూచుచు ఎరుపెక్కినవై యున్నవి. అట్టి నేత్రములు కల విష్ణువు పుండరీకాక్షుడుగా వేదములయందు పొగడబడు చున్నాడు. నీ కటాక్షముల యొక్క పరంపరా సంబంధమే ఇట్టి శక్తినికలిగి యుండ సాక్షాత్తుగా నీ కటాక్షముల యొక్క శక్తిని ఎంతని వర్ణించగలము? (వాటిశక్తి వర్ణింప శక్యము కానిది అని భావము)

వి :- ఇందు మరల లక్ష్మీకటాక్షములయొక్క, విగ్రహముయొక్క వైభవమును వర్ణించుచున్నారు. ఆమె కటాక్షములయొక్క లేశమే రాజులను లోక పాలులనుకూడ మత్తెక్కింపచేయును. వారి స్థితి కవులయొక్క వర్ణనకుకూడ అతీతము. అనగా కేవలము లక్ష్మియొక్క కృపాదృష్టి మాత్రాగతమైనదైనను విత్తమదమత్తచిత్తులైన ప్రభువులయొక్క అవస్థ వర్ణనాతీతమని అభిప్రాయము. ఇట లక్ష్మి పద్మస్థానమున నున్నది. శ్రీమహావిష్ణువు యొక్క నేత్రములు భ్రమరముల స్థానములోనున్నవి. అవి ఎల్లప్పుడును ఆమెయందలి మధువునే ఆస్వాదించుటవలన ఆ కనులకు నిశ్చలత్వము రక్తత్వము ఏర్పడినవి. ఒకవస్తువును తదేక దృష్టితో చూచినచో ఆ వస్తువుతో ఐక్యమును పొందిన అనుభవము లోకప్రసిద్ధము. ఆ విధమైన నిశ్చలత్వము వలన కలిగిన రక్తత్వము ఆ కనులయందు సంక్రమించుటచే ఆ కనులుగల శ్రీమహా విష్ణువు 'పుండరీకాక్షుడు' అయినాడు. పద్మమువంటి నేత్రములు కలవాడు- ఎఱ్ఱని నేత్రములు కలవాడుకూడ అయినాడు. ఇది లక్ష్మి కారణముగా వచ్చినదని వేదము చెప్పినది. 'తస్య యథా కప్యాసం పుండరీక మేవమక్షిణీ' (సూర్యునిచే వికసింప బడిన పద్మమువలె నున్న కనులు) అను ఛాందోగ్యవాక్యము ఇచట ప్రమాణము. ఈ విధముగా రాజులనుండి లోకపాలుర వరకు మదమునకు గాని శ్రీమన్నారాయణుని

యొక్క నేత్రసౌందర్యమునకు గాని పరంపరాగతములైన లక్ష్మియొక్క కటాక్షములే కారణములుకాగా సాక్షాత్తు లక్ష్మీదేవియొక్క కటాక్ష సౌందర్యము వర్ణించుటకే శక్యము కాదు అని భావము. అది 'ఇదం-ఇత్థం' అని చెప్పుటకు వీలులేనిది- వీలు కానిది కూడ- అని సారాంశము.

సంస్కృత వ్యాఖ్య :- త్వదితి। హే లక్ష్మి! రాజ్ఞాం లోకపాల ప్రభృత్యాధునిక పర్యన్తానాం ప్రభూణాం దృశోదృష్టయః త్వత్ స్వీకార కలావలేప కలుషాః త్వత్ స్వీకార కలా త్వత్కటాక్షలేశః స్వీకార శబ్దేన సదయదృష్టిః లక్ష్యతే। కలాశబ్దే నావయవ వాచినా లేశోలక్ష్యతే। తేన జాతేనావలేపేన గర్వేణ కలుషాః ఆవిలాస్సత్యః దుర్వచాః వర్ణయితుమశక్యాః భవన్తి। కవీనామితిశేషః। త్వత్కటాక్షలేశ ప్రసరణ గర్వేణ శోభా విశేష జుష్టాః ప్రభుదృష్టయః కవివాగగోచరా భవన్తీత్యభిప్రాయః కిముతలోక పాలానామ్? పత్యుస్తవ పుండరీకనయనత్వంచ త్వద్విగ్రహానుభవ సమయసక్త విగ్రహరక్తి మాయత్త మిత్యాహ। నిత్యమితి। నిత్యం సర్వకాలం త్వన్మధుపానమత్త మధుపశ్రీ నిర్భరాభ్యాం త్వన్మధుపానే త్వద్రూపమకరన్దపానే మత్తమధుపయోః దృష్టపట్వ దయోః శ్రియా సంపదా నిర్భరాభ్యాం పూర్ణాభ్యామేవ యథా మధుపానే మత్తమధుపో నైశ్చల్యం రక్తతాం చానుభవతి తథా మధురూప త్వదనుభవే మధుపతుల్యా నైశ్చల్య రాగసంపూర్ణాభ్యా మేవేత్యర్థః।

దృగ్భ్యాం లోచనాభ్యాం హేతుభూతాభ్యాం తే తవ పతిం ప్రియం వేదః 'తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ' ఇతి ఛాందోగ్యో పనిషద్రూపః। పుండరీకనయనం పుండరీకాక్షం విదామాస విజ్ఞాతవాన్ ఖలు । 'విదజ్ఞానే' ఇత్యస్మాద్ధాతోః 'ఉషవిద' ఇత్యాదినా 'ఆమ్' ప్రత్యయే' కృఞ్చాను ప్రయుజ్యతేలిటి' ఇతి అస్తేరనుప్రయోగే విదామాసేతి రూపమ్ । ఏవం సకల లోచనాతిశయస్య త్వదవలోకనాధీనత్వే త్వదవలోకసౌందర్యం వర్ణనాతీత మిత్యాహ। సాక్షాదితి। తవ సాక్షాదవలోక విభవః కటాక్షసౌందర్యం కయాకాక్వా కీదృశ్యాభంగ్యా వర్ణ్యతే నకయాపీత్యర్థః ॥

అ :- పునర్లక్ష్మీకటాక్షానేవ వర్ణయన్ తైః స్వరక్షణం ప్రార్థయతి।

శ్లో ॥ ఆనన్దాత్మభి రీశ మజ్జన మద క్షీబాలసై రాగల
ప్రేమార్ద్రైరపి కూలముద్వహ కృపా సమ్నా వితాస్మాద్భశైః।
పద్మే తే ప్రతిబిన్దు బద్ధకలిక బ్రహ్మాదివిష్కమ్భకైః
ఐశ్వర్యోద్గమగద్గదై రశరణం మాం పాలయాలోకితైః ॥ ౪౧

అ :- పద్మే= ఓ లక్ష్మీదేవీ, ఆనందాత్మభిః= ఆనంద స్వరూపము లైనట్టియు, ఈశ=హరియొక్క, మజ్జన=మజ్జనవిధివలన వచ్చిన, మద=మదముతో, క్షీబ=

బలిసినవి, (మదించినవి), అలసైః= మందగమనముతో కూడినవియు, అగల ప్రేమార్ద్రైః అపి= కంఠమువరకు ప్రేమతోకూడినవియు, (నిండుగానున్నట్టియు) కూలముద్వహ =గట్లుతెగిప్రవహించుచున్న, కృపా= దయచేత, సంప్లావిత =స్నానముచేయించబడిన, అస్మాద్యైః= మాబోటి దాసవర్గము కలిగినట్టియు, ప్రతి .. విష్కంభకైః, ప్రతిబిందు= ప్రతిదయాపూర్ణ కటాక్షలేశ ప్రసరణమునందును, బద్ధకలిక= అహ మహమికను వహించుచున్న, బ్రహ్మాది విష్కంభకైః= బ్రహ్మాది పాలకవర్గము కలిగి నట్టియు, ఐశ్వర్యోద్గమగద్గదైః= విలాసాధిక్యమువలన తొట్రుపడిన గమనములు కలిగినట్టివియు అయిన, తే= నీయొక్క, ఆలోకితైః= దయార్ద్ర దృష్టులతో, అశరణమ్=వేరే దిక్కులేని, మామ్= నన్ను, పాలయ= రక్షించుము.

తా :- ఓ లక్ష్మీదేవీ! నీయొక్క చల్లనిచూపులతో, వేరే దిక్కులేని నన్ను (నాబోటి వారలను) రక్షించుము. ఆ చూపు లెట్టివందువా? ఆనంద స్వరూపములు. విష్ణువు నందు తగుల్కొనుటచే మదించినవై అలసత్వమును పొందినవి. ప్రేమార్ద్రములు. నిండుగా ప్రసాదించు ప్రేమతో మాబోంట్లను తడుపునట్టివి. బ్రహ్మాదిలోక నిర్వాహకులే ఆ చూపులకొఱకై అహమహమికను వహింతురు. మరియు అనంతైశ్వర్యము నిచ్చునట్టివి. అట్టి నీచూపులతో నన్ను నాబోటి వారలనుకూడ రక్షించుము.

వి :- ఈ శ్లోకమున -

'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ',

'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ'

అను వాక్యములద్వారా చెప్పబడిన శరణాగతి వర్ణించబడినది. శరణు పొంద వలసినవాడు భగవానుడే అయినప్పటికిని లక్ష్మీదేవి ద్వార భూతమైనది. మధ్యవర్తి యైనది. ఆమెయొక్క అనుమతి అంగీకారములే భగవానునిచేత ఆయాపనులు చేయించుచున్నవని ఈ స్తోత్రముననే 1వ శ్లోకమున తెలిసికొని యున్నాము. ఇక ఆమెయొక్క ఆ లోకముల గొప్పతనము ఇందు విశేషముగా వర్ణించబడినది. 'పద్మే' అను సంబోధనము, విష్ణువునందు సంచరించుటవలన కలిగిన మాంద్యాలసత్వములు, ఆ చూపులయందు శైత్యసౌరభ్య మాంద్య గుణములను వ్యక్తముచేయుచున్నవి. ఆమెయొక్క కటాక్షములు ఎక్కువగాపడునవి భగవంతునియందేయని 'అపాంగా భూయాంసః' అను (30వ శ్లోకమున చెప్పబడియే యున్నది.) ఇంకను ఆ చూపులు ఆనందస్వరూపములు ప్రేమాతిశయద్యోతకములు. ఐశ్వర్యాధిక్య ప్రతిపాదకములు. అందువలననే బ్రహ్మాదిపాలకవర్గమంతయు కూడ ఆ చూపులు తమయందు పడవలెననెడి అహమహమికను పొందుచుందురు. ఇచట బ్రహ్మాదులను విష్కంభము గా (గడియగా) చెప్పుట 'అర్గళమువలె రక్షణవ్యాపారము చేయువారు' అని

సూచించుటకు మాత్రమే. అట్టి చూపులతో వేరేదిక్కులేని తమను రక్షించుమని శ్రీపరాశర భట్టరుల అభ్యర్థనము. ఇంతకు ముందు శ్లోకమున (40వ) శ్లోకమున ఆమెయొక్క వైభవము వాచామగోచరము అని చెప్పియు ఈ శ్లోకమున ఆ వైభవమును బాగుగా వర్ణించుట గమనించతగినది.

ఇచట శ్రీస్తుతిలోని :-

'దారాపుత్రా స్తథాగార సుహృద్ధాన్య ధనాదికమ్ ।
భవత్యేతన్మహాభాగే నిత్యం త్వద్వీక్షణా న్నృణామ్ ॥

(జననీ!) నీకృపాదృష్టివలన దారాపుత్ర గృహాదికము, సుహృద్వర్గము, ధనధాన్యాధికము సమృద్ధిగా ఉండును) అనియు,

శరీరారోగ్యమైశ్వర్య మరిపక్ష క్షయః సుఖమ్।
దేవి! త్వద్దృష్టిదృష్టానాం పురుషాణాం న దుర్లభమ్ ॥

దేవి, నీచే చూడబడిన పురుషులకు శరీరారోగ్యము, ఐశ్వర్యము, శత్రు సంహారము సుఖము, మొదలైనవి దుర్లభములుకావు) అనియు ఈ రెండు శ్లోకములును అనుసంధేయములు.

సంస్కృత వ్యాఖ్య :- ఆనందేతి। హే పద్మే! తే తవ అత్ర యద్యపి 'యుష్మ దస్మదో రామంత్రితం పూర్వమవిద్యమానవత్' ఇత్యామంత్రితస్య అవిద్యమానవ ద్భావేన 'త' ఇత్యాదేశో నభవతి తథాప్యవిద్యమానవ ద్భావస్యా నిత్యత్వం కాశికాయా ముక్తం। 'విద్యమానవ చ్చేతి వక్తవ్యమ్' ఇతివార్తికాత్ । యుక్తఞ్చై తత్ । అత ఏవ 'భిక్షోతే దయితాస్తి కిమ్? నహినహి ప్రాణప్రియా కుండికా' ఇతి మహాకవిప్రయోగః। అత ఏవ శుభకార్యారంభే 'లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి' ఇతి సర్వవైదిక ప్రయోగః । యద్వా పద్మేతే పద్మం కమలం ఇతే ప్రాప్తే కమలవాసినీత్యర్థః । పద్మేలీలార విందే ఇతా హస్తాభ్యాంప్రాప్తా పద్మేతా । తస్యా స్సంబుద్ధిర్వా । ఆనందాత్మభిః ఆనంద ఏవాత్మా స్వరూపం యేషాం తైః ఆనందరూపై రిత్యర్థః । ఈశమజ్జన మదక్షీబాలసైః ఈశస్య హరేః మజ్జనేన స్వేష్వవగాహనేన యోమదస్తేన క్షీబైః మత్తైః, అలసైః మందరైః, ఆగలప్రేమార్ద్రైః ఆగలం ఆకంఠం ప్రేమ్ణాప్రీత్యా ఆర్ద్రైః శిశిరైరపి అపిశ్చార్థః।

కూల ముద్వహ కృపాసంప్లావితా స్మాదృశైః కూలముద్వహయా తీరరోధిన్యా ఉద్వేలయేత్యర్థః । కృపయా సంప్లావితాః స్నాపితాః అస్మాదృశా అకించనా యైస్తైః। ప్రతిబిందుబద్ధకలిక బ్రహ్మాదివిష్కంభకైః ప్రతిబిందు ప్రతికటాక్షలేశం బద్ధ కలికాః మమాయం కటాక్షలేశోఽస్తు మమాయమితి బద్ధకలహాః బ్రహ్మాదయ ఏవ విష్కంభకాః నిర్వాహకా యేషాంతైః । విష్కంభ శబ్దో నగరరక్షార్థార్గళ దండవాచీ తత్సాదృశ్యాన్నిర్వాహక సామాన్యేగౌణః 'తద్విష్కంభోఽర్గళంనవా' ఇత్యమరః।

ఐశ్వర్యోద్గమ గద్గదైః ఐశ్వర్యస్య సంపదః ఉద్గమేన ఉత్పాదనేన గద్గదైః విలాసాతిశయేన స్ఖలితగతిభిః। ఆలోకితైః కటాక్షైః భావేక్తైః। అశరణం రక్షకాన్తరశూన్యం మాం పాలయ। 'పారక్షణే' ఇత్యస్మాద్ధాతోః 'హేతుమతిచ' ఇతిణిచి 'పాతేర్ణౌ లుగాగమో వక్తవ్యః ఇతి లుగాగమే 'పాలయేతి' లోణ్మధ్యమపురుషైకవచనమ్ ॥

అ :- లక్ష్మ్యాః సౌకుమార్య మనుసంధత్తే ।

శ్లో ॥ పాదారున్తుదమేవ పఙ్కజరజః చేటీభృశాలోకితైః
అఙ్గమ్లాని రథామ్బ! సాహసవిధౌ లీలారవిన్దగ్రహః ।
డోలా తే వనమాలయా హరిభుజే హాకష్ట శబ్దాస్పదం
కేన శ్రీః! అతికోమలా తనురియం వాచాం విమర్దక్షమా ॥ ౪౭

అః- అంబ=జగజ్జననియైన, హే శ్రీః=లక్ష్మీదేవీ, పంకజరజః=పద్మ పరాగము, పాదారుంతుదం ఏవ=పాదమునకు (అరికాలుకు) కంటకమువలె అగు చున్నది, చేటీ భృశాలోకితైః=చెలికత్తెలు ఎల్లప్పుడును ఎక్కువగా చూచు చూపులతోనే, అంగమ్లానిః=శరీరము వాడిపోవుచున్నది, అథ=మరియు, తే=నీకు, లీలారవింద గ్రహః=విలాసము కొరకైనను పద్మమును గ్రహించుట, సాహసవిధౌ=సాహసము (కొఱకు) అగుచున్నది, హరిభుజే=విష్ణువుయొక్క భుజమధ్యమున, (వక్షః స్థలమున), వనమాలయా=వనమాలతో, డోలా=ఊయల లూగుట, హా కష్ట శబ్దాస్పదమ్ ='అయ్యో'అనెడి,'కష్టము' అనెడి, శబ్దములకు ఆస్పదమైనది, అతి కోమలా =మిక్కిలి కోమలమైన, (సుకుమారమైన) ఇయం తనుః =ఈ అప్రాకృత దివ్యమంగళ విగ్రహము, కేన=ఏకారణముచేత, (ఎవనిచేత) వాచామ్ =వాక్కుల యొక్క, విమర్దక్షమా=సంఘర్షణకు (ప్రతిపాదనకు) యోగ్యమైనది, (భవతి=అగుచున్నది) 'కాదు' అని అర్థము.

తా :- ఓ లక్ష్మీదేవీ, పద్మరాగము నీ చరణములకు సోకిన అది నిన్ను కంటకము (ముల్లు) వలె బాధపెట్టుచున్నది. కేవలము చెలికత్తెలు నిన్ను అదేపనిగా చూచినంత మాత్రముననే నీ శరీరము వాడిపోవుచున్నది. విలాసార్థము నీ చేతి యందుంచుకొనిన పద్మముకూడ నీయొక్క సాహసమునకొక నిదర్శనము. నీతో సమానముగా విష్ణువు యొక్క వక్షః స్థలమున నుండెడి వనమాలతో నీవు ఊయలలూగుట - 'అయ్యో ఎంత కష్టమైనపని' అని జాలిపడు పరిస్థితి. ఇట్టి శరీరముతో కూడిన నిన్ను పరుషమైన పురుషవాక్కు వర్ణించిన నీశరీరము సహించునా? సహించదు.

వి :- ఈ శ్లోకమున లక్ష్మియొక్క సౌకుమార్యపరాకాష్ఠ వర్ణించబడినది. పద్మము అన్నిటికన్న సుకుమారమైనది. తత్పరాగము అంతకన్న సుకుమారమైనది.

లక్ష్మికి నిత్యనివాసమై అత్యంత పరిచితమైన ఆ పద్మమునందలి పరాగమే కంటక ప్రాయమైనచో పాదతల (అరికాళ్ళు) సౌకుమార్యము వర్ణింపనలవికాదు. అట్టి పాదతల సౌకుమార్యమును మించినది శరీరసౌకుమార్యము. ఇది కేవలము చెలికత్తెల దృష్టిపడినంతమాత్రముననే వాడిపోవునంతటిది. పద్మపరాగము పాదతలమునుతాకి కంటకప్రాయమైనది. చెలికత్తెల దృష్టులు శరీరమును స్పృశింపనప్పటికిని ఆమెశరీరము వాడిపోవుచున్నది. అందువలననే ఆమెచేతిలో విలాసముకొఱకై ధరించిన లీలారవిందమే ఏదోపెద్దబరువును మోసినట్లు అనిపించుచున్నది. అదియే సాహసము. అనగా పద్మమేచేతిలో బరువు అనిపించునంతటి శరీరసౌకుమార్యము కలది లక్ష్మీదేవి అని అభిప్రాయము. మరియు ఆమె విష్ణువుయొక్క వక్షఃస్థలమున నివసించును. అచటననే వనమాలయు కలదు. అది ఇటునటు కదలుచు ఈమెను కూడ ఊయల లూగించును. ఆ కదలిక చూచినవారలకు (ఏదో అతికష్టమైన పని వలె) 'అయ్యో' అనియు, 'కష్ట' మనియు అనిపించు నంతటిది. సుకుమార పుష్ప మయమైన వనమాలయొక్క స్పర్శనుకూడ సహింపని సౌకుమార్యము గలది ఆమె యొక్క శరీరము. ఆ విధముగా కేవలము స్త్రీలు చూచినంత మాత్రముననే వాడిపోవు నట్టిదియు, అత్యంత సుకుమారమైనట్టిదియు అయిన లక్ష్మియొక్క శరీరమును పరుషమైన ఏకవి వాక్కు వర్ణించినను అదియు ఆమెకు కఠినముగానే తోచును. ఈ విధముగా లక్ష్మియొక్క సౌకుమార్యము ఏకవివాక్కునకు అందనిది, వర్ణింపనలవి కానిది అని సారాంశము.

సంస్కృత వ్యాఖ్య :- పాదేతి। హే అంబ! శ్రీః పంకజరజః పద్మరేణుః తే పాదారుంతుదమేవ పాదయోః పాదతలయోః పదశబ్దేన పాదతలే లక్ష్యేతే। అరుంతుదం కంటక ఇవ మర్మస్పృక్ 'అరున్తుదస్తు మర్మస్పృక్' ఇత్యమరః । చేటీభృశాలోకితైః చేటీనాం సంతత సహవాస పరిచారికాణాం భృశాలోకితైః అధికవీక్షణైః అంగమ్లానిః గాత్రతాన్తిః భవతీతిశేషః ।

అథేతి వాక్యాన్తరారంభే । 'మంగళానంతరారంభ ప్రశ్న కార్త్స్న్యే ష్వథో అథ' ఇత్యమరః । తే తవ లీలారవిందగ్రహః లీలాకమలధారణం సాహస విధౌ సాహస కర్మవిధానే భవతీతి సర్వత్రానుషజ్యతే। తే తవ హరిభుజే ప్రియవక్షసి భుజశబ్దేన తన్మధ్యం లక్ష్యతే వనమాలయా వైజయన్త్యా డోలా డోలా విహరణం హాకష్టశబ్దాస్పదం హేతి కష్టమితిచ శబ్దే ఆస్పదం యస్య తత్కర్మ భవతి। అతికోమలా అతిసుకుమారా ఇయం అప్రాకృతా తనుర్విగ్రహః కేన కేన హేతునా వాచాం స్తుతి వచసాం విమర్దక్షమా విమర్దస్య ప్రతిపాద్యతయా సంఘర్షస్య క్షమా యోగ్యా భవతి నకేనాపీత్యర్థః। అతి సుకుమారస్య శ్రీవపుషః వచస్తవన మయుక్త మితి భావః ॥

అః - అథ శ్రియ స్తారుణ్యం వర్ణయతి।

శ్లో ॥ ఆమర్యాద మకణ్టకం స్తనయుగం నాద్యాపి నాలోకిత
భ్రూభేద స్మిత విభ్రమా జహతి వా నైసర్గికత్వాయశః ।
సూతే శైశవ యౌవనవ్యతికరో గాత్రేషు తే సౌరభమ్
భోగస్రోతసి కాన్తదేశిక కరగ్రాహేణ గాహక్షమః ॥ 43

అ :- హే శ్రీః= ఓ లక్ష్మీదేవీ, (తే= నీయొక్క,) స్తనయుగమ్=స్తనద్వయము, ఆమర్యాదమ్=తగిన పరిమాణము కలది, అద్యాపి=ఇప్పటికిని, అకంటకం న= ప్రతిబంధకము లేనిదికాదు. (ప్రతిబంధకముకలదియే అగుచున్నది.) ఆలోకిత భ్రూభేద స్మితవిభ్రమాః, ఆలోకిత=చూపుయొక్కయు, భ్రూభేద=భ్రూభంగము యొక్కయు, స్మిత=మందహాసము యొక్కయు, విభ్రమాఃవా=విలాసములు కూడ, నైసర్గికత్వ అయశః=స్వాభావికమైన అపకీర్తిని, నజహతి= వదలుటలేదు. (అవస్థా స్వభావమును చాటుచున్నవి), భోగస్రోతసి=క్రీడా ప్రవాహమునందు, కాంతదేశిక కరగ్రాహేణ =ప్రియుడనెడి గ్రహీతయొక్క హస్తావలంబనముచేత, గాహక్షమః= అవగాహనకు సమర్థమైన, శైశవ యౌవన వ్యతికరః=శైశవమునకును యౌవనమునకును గల సంబంధము,(తారుణ్యము), తే గాత్రేషు= నీ శరీరమునందు, సౌరభమ్ =సౌగంధ్యమును, సూతే= కలుగచేయుచున్నది.

తా :- ఓ లక్ష్మీదేవీ, నీముగ్ధాత్వమును ఏమని వర్ణింపగలము? తారుణ్యమునకు తగిన ప్రమాణములు కలవైనను స్తనములు ఇంకను పెరుగుట కవకాశము కలదు. చూపులు, భ్రూభంగములు, చిరునవ్వు, విలాసములు, మొదలైన వన్నియు, తారుణ్యము వలన వచ్చినవే అయినను 'సహజములేమో' అను శంకను కలిగించుచున్నవి. భోగప్రవాహములో మునిగిన కాంతుడను దేశికుని కరగ్రహణము చేత ఉపభోగక్షమమైన శైశవ యౌవన వ్యతికరము (ఈ రెండింటియొక్క కలయిక) నీ శరీరమునందలి సౌరభమును అధికము చేయుచున్నది.

వి :- సాధారణముగా కవులు తమ నాయికలను ముగ్ధలుగా వర్ణించుట జరుగుచుండును. కాళిదాసుని శకుంతల, పార్వతి ఇందుకు నిదర్శనములు. శాకుంతలమున నవమాలికయొక్క నవయౌవన పేశలత్వములు, సహకారముయొక్క ఉపభోగక్షమత్వమును వర్ణించుట గమనించతగినది. బాణునివర్ణనలో కాదంబరికూడ ఇట్టిదే - ఆమెయొక్క విలాసములను చూచిన చంద్రాపీడుడు 'ఈమెకు ఈ విలాసములు యౌవన సహజములా? లేక నాయందలి ప్రేమను వ్యక్తము చేయునవియా' అని ఆలోచించుటయు గమనింపతగినది. అట్లే శ్రీపరాశరభట్టరులు కూడ ఈ

శ్లోకమున లక్ష్మియొక్క ముగ్ధాత్వము, అమెయొక్క విలాసములతోపాటు శ్రీమన్నారాయణునియొక్క ఉపభోగక్షమత్వమును కూడ వర్ణించిరి. ఎట్లనగా స్తన పరిమాణము సంపూర్ణ యౌవనలకు వలెగాక ఇంకను పెరుగుటకు అవకాశము కలదై ప్రకృతపు వయస్సునకును తారుణ్యావస్థకును తగిన పరిణామము కలదిగనే యున్నది. యౌవన ప్రాదుర్భావమునసే వాటంతట అవి వచ్చునట్టి ఆలోక భ్రూభంగ స్మితాది విలాసములు యౌవనమువలన వచ్చినవిగా కాక, ఇవి ఈమెకు సహజములా? అను శంకను కలిగించుచున్నవి. మధ్యలో వచ్చినవేయైనను మొదటినుండియు నున్నవే (సహజములే) అనుకొను నంతటి విలాసములు కలదిగా ఇట లక్ష్మీదేవి వర్ణింపబడినది. భోగమనేదే ఒకప్రవాహమైతే ఆ ప్రవాహమున ప్రవేశించుటకు సమర్థమైనదై అందు వలననే కాంతుని కరగ్రహణము చేసినదైన, ఈమెయొక్క శైశవ యౌవన మధ్యస్థమైన ఈ సంధివయస్సు ఆమెయొక్క గాత్రసౌరభమును చాటుచున్నది. ఇట్టి తన విలాసాదులను గ్రహించువాడు శ్రీమహావిష్ణువు. ఈ విధముగా తారుణ్యోదయము వలన స్తనోదంచనము భ్రూభంగ స్మితవిలాసాదులు గాత్రసౌందర్యము లక్ష్మికిట వర్ణితములు. మరియు ఒక(ముగ్ధా) నాయిక తన విలాసములతో ఒక నాయకుని కర గ్రహణముచేయుట అనునది ఇచట వ్యంగ్యమగుచున్నది.

సంస్కృత వ్యాఖ్య :- ఆమర్యాదమితి। హే శ్రీః। తేతవ స్తనయుగం ఆమర్యాదం యావత్పరిమాణమర్యాదం అద్యాపి అకంటకంన। కింతు సకంటకం సప్రతిబంధమేవ। స్తనపరిణామ పూర్తిరద్యాపి నజాతేతిభావః। పూర్ణయౌవన ఏవ పరిమాణ పూర్తిః స్యాదితిహృదయమ్। ఆలోకితభ్రూభేదస్మితవిభ్రమాః ఆలోకితస్య వీక్షణస్య భ్రూభేదస్య భ్రూభంగస్య స్మితస్య మందహాసస్య విభ్రమావిలాసావా వాశబ్దశ్చార్థః నైసర్గికత్వాయశః నజహాతి నముంచన్తి తారుణ్యప్రయుక్త నేత్రాదిలీలా స్త్వతిచంచలాః సత్యః స్వభావప్రయుక్తత్వ శంకామేవ ఆపాదయన్తి నతు యౌవనప్రయుక్తామ్ ఇతిభావః। భోగస్రోతసి క్రీడా ప్రవాహే కాన్త దేశికకరగ్రహేణ కాన్తః ప్రియ ఏవ దేశికః పరిజ్ఞాతాతస్యకరగ్రాహేణ హస్తావలంబేన కాన్తహ స్తం గృహీత్వేతియావత్ గాహే అవగాహనే క్షమేాయోగ్యః మౌగ్ధ్యాతిశయాత్ ఏవంభోగః కార్య ఇతి కాంతోపదేశ సాపేక్ష ఇత్యర్థః। శైశవ యౌవన వ్యతికరః శైశవస్య బాల్యస్య యౌవనస్య యువత్వస్యచ వ్యతికరః సన్ధిః తారుణ్యమిత్యర్థః। తే తవ గాత్రేషు అవయవేషు సౌరభం నిరతి శయ సౌగన్ధ్యం సూతే జనయతి। తారుణ్యోదయాత్ కుచోదంచన నేత్రవిలాస గాత్రసౌర భాణి సంజాతానీతిభావః।

అ :- శ్రియో దివ్యమంగళవిగ్రహం పుష్పదామత్వేన వర్ణయిత్వా తస్య హరి వక్షః పరిష్కారతామాసాద్య సుకుమారతమం వపుష స్తథావర్ణయంతం స్వాత్మాన ముపాలభతే।

శ్లో॥ ఆమోదాద్భుతశాలి యౌవనదశావ్యాకోచ మమ్లానిమత్
సౌన్దర్యామృతసేక శీతలమిదం లావణ్యసూత్రార్పితమ్।
శ్రీరఙ్గేశ్వరి! కోమలాఙ్గ సుమనః సన్దర్భణం దేవి! తే
కాన్తోరః ప్రతియత్న మర్హతి కవిం ధిఙ్మామకాణ్డాకులమ్ ॥ ౪౪

అ :- శ్రీరంగేశ్వరి=శ్రీరంగనాథవల్లభవైనట్టియు, దేవి=శ్రీరంగరాజ పట్టమహిషి వైనట్టియు ఓ లక్ష్మీదేవీ, ఆమోదాద్భుతశాలి=అద్భుతసౌందర్యముతో ప్రకాశించు చున్నదియు, యౌవనదశావ్యాకోచమ్=తారుణ్యముచేత వికసింపబడు చున్నదియు, అమ్లానిమత్=ఎప్పుడును వాడనిదియు, సౌందర్య=సౌందర్యమనెడి, అమృతసేక =అమృతముచే తడుపబడుటవలన శీతలమ్=చల్లనైనదియు, లావణ్యసూత్రార్పితమ్= లావణ్యమనెడి దారముతో గుచ్చబడినదియు అయిన, ఇదమ్=ఈ, తే=నీయొక్క, కోమలాంగసుమనః సందర్భణమ్=సుకుమార శరీరమనెడి పుష్పమాలిక, కాంతోరః ప్రతియత్నమ్=ప్రియునివక్షః స్థలమునకు అలంకారమగుటను, అర్హతి=తగియున్నది, అకాండాకులమ్ =అనావశ్యకముగా (హఠాత్తుగా) ఆకులమైన, కవిం మామ్=కవి యైన నన్నుగురించి (నాకు), ధిక్=నిందయగుగాక.

తా :- ఓ లక్ష్మీదేవీ, నీ సుకుమార శరీరమనెడి పుష్పమాల ప్రియుడైన హరి యొక్క వక్షఃస్థలమునకే తగియున్నది. వనమాల ఎట్లో నీవును అట్లే. ఆ సుకుమార శరీరమనెడి పుష్పమాల ఎట్టిదనగా అత్యంత సుగంధముతో కూడినది. తగిన సమయమున వికసించినది ఎల్లప్పుడును వాడనిది, సౌందర్యమనెడి అమృతపు జల్లుచేత చల్లగా చేయబడినది. లావణ్యమనెడి సూత్రముచేత కూర్చబడినది. అట్టి నీ అవయవ రూప సుమమాల హరియొక్క వక్షస్థలమునకే యోగ్యమైనది. అని ఈ విధముగా చెప్పెడి కవులైన మాబోటివారల వాక్కులకు నింద అగుగాక.

వి :- ఈ శ్లోకమున సుకుమారమైన లక్ష్మియొక్క శరీరము పూలమాలతో పోల్చబడినది. ఈమె శరీరము పుష్పమాలయు కూడ విష్ణు వక్షస్థలమునకే యోగ్య మైనవి. ఇచటి విశేషణములు ఉభయ సమానములు. 1). లక్ష్మియొక్క శరీరము పద్మసుగంధి కాబట్టి ఎక్కువ ఆమోదము (సువాసన, సంతోషము) తో కూడినది. అట్లే పుష్పమాల కూడ అద్భుత సౌగంధ్యము తో కూడినది. 2). లక్ష్మియొక్క శరీరము యౌవనదశలో అడుగుపెట్టుచు తత్తద్దశాను కూలముగా వికసించెడి అవయవ శోభ కలది. పుష్పమాల కూడ పూర్తిగా వికసించిన పుష్పములతో కూర్చబడినది. కావున ఆ విధముగా వికసించిన అవయవ శోభ అనగా పుష్పముల శోభగలది. 3). రెండును వాడనివే. నిత్య నూతనములు, నిత్య సుగంధులు. 4). పుష్పములు వాడకుండగ నీళ్ళు చల్లినచో అవి పరిమళముతో పాటు చల్లదనము కూడ నిచ్చును. లక్ష్మియొక్క

శరీరముకూడ సౌందర్యమనెడి అమృతసేకముచేత చల్లగా నుండునది. ఇక్కడ చల్లెడివి నీళ్ళుకాదు. అమృతమే. ఆ అమృతముకూడ సౌందర్య మనెడి అమృతము. జలసేకము పుష్పమాలకు చల్లదనము నిచ్చునట్లుగా సౌందర్య మనెడి అమృతసేకము ఆమె శరీరమునకు చల్లదనము నిచ్చుచున్నది. 5). పుష్ప మాలను గుచ్చుటకు దారము కావలయును. ఆ దారము దండలోని ప్రతిపుష్పమునకు ఆశ్రయముగా నుండును. అట్లే లక్ష్మీదేవి యొక్క శరీర శోభ లావణ్యమనెడి దారము ఆశ్రయముగాగలది. ప్రత్యవయవము సౌందర్యయుక్తము కాబట్టి అవయవ సముదాయశోభగా లావణ్యము సూత్రమువలె అంతటను వ్యాపించి ఆ శోభనంతటిని ఒకచోట చేర్చును. ఈ విధముగా ఇచటి విశేషములు లక్ష్మికిని పూలదండకును సమానములు. ఇట్టి సుకుమారమైన లక్ష్మియొక్క శరీరమును పూలమాలగా వర్ణించుట కఠినమైన విష్ణువుయొక్క వక్షః స్థలమునకు తగినదని వర్ణించుట, తగదను ఉద్దేశ్యము తో శ్రీభట్టరులు తమను నిందించు కొన్నారు. ఇందు అత్యంత కఠినమైనను హరియొక్క వక్షఃస్థలమునందు ఆశ్రిత లక్షణ చాపల్యము వలన అత్యంతానురాగమువలన సుకుమారమైన శరీరముగల దైనను లక్ష్మియొక్క ఉనికి అసమంజసముకాదు అను అభిప్రాయము వ్యక్తమగు చున్నది. ఇచట సువర్ణ కుంచికాకారులు ఇట్లు వివరించి యున్నారు. 'ఇట్లు మధురము గా వర్ణించిన గ్రంథకర్త మనస్సులో కొన్ని యాక్షేపణలుదయించినవి. పుష్పాదియే పాదములను బాధించు ననియు, హస్తమున పుష్పమును ధరించుట సాహస కార్య మనియు, పుష్పముకంటె మార్దవము కలదిగా వర్ణించిన మేమే యామె దేహమును పుష్పమాలగా వర్ణించుట విరుద్ధమగును కదా! అట్టి వర్ణనలతో నిలుపక అమాల అసుర రాక్షసుల బాణములకు గురియై గాయపడిన భగవంతుని కఠినమైన వక్షఃస్థలమునకు తగినదని వర్ణించుట ఎంత సాహసము. అవును!మేమిట్లు వర్ణించినది భ్రాంతిమూలకమే తప్పు చేసితివని 'కవిం ధిఙ్మా మకాండాకులం' అని తమ్ముతామే నిందించు కొనుచున్నారు' అని. మరియు ఇచట శ్రీరంగేశ్వరి, దేవి యను సంబోధనలు తరువాతి శ్లోకములో చెప్పబోయెడివారియొక్క పరస్పరానురాగమును సూచించునవిగా నున్నవి. దేవి యనగా కేవలము పట్టమహిషి అను అర్థమొక్కటియే కాదు. శ్రీసూక్తము లో వివరింపబడి నట్లుగా 'దేవయత్=క్రీడయతి కాంతమితి దేవీ' (విష్ణువుచేత ఆట లాడించునది) అను అర్థముకూడ చెప్పకొనవచ్చును. అందువలననే ఆమె హృదయేశ్వరియై విష్ణు వక్షః స్థలమును ఆశ్రయించి హృదయము నాక్రమించినది. లోకరక్షణ కార్యక్రమములో నున్నను శ్రీ మహావిష్ణువుయొక్క మనస్సునుతనవైపు ఆకర్షించుకొనుటకు తగిన అవయవ శోభకలదై వనమాలవలె వక్షఃస్థలమున నిత్య నివాస మేర్పరచుకొనినది అని సారాంశము. ఆమెయొక్క తారుణ్యము ఉపభోగ

క్షమత్వము కూడ 43వ శ్లోకములో వర్ణింపబడినవి. 45వ శ్లోకమునకూడ వర్ణింపబడు చున్నది.

సంస్కృత వ్యాఖ్య :- ఆమోదేతి। హే దేవి! ఆమోదాద్భుతశాలి ఆమోదాద్భుతేన అద్భుత సౌగంధ్యేన శాలత ఇతిశాలి । 'ఆమోదో గంధహర్షయోః' ఇత్య మరః । యౌవనదశావ్యాకోచం యౌవన దశయా తారుణ్యేన వ్యాకోచం వికాసి ఇత్థం భావే తృతీయా తారుణ్యాభిన్న వికాసమిత్యర్థః।

అమ్లానిమత్ అతాన్తం సౌందర్యామృత సేకశీతలం సౌందర్యం అవయవ శోభైవ అమృతం తస్యసే కేన వ్యాప్త్యేత్యర్థః శీతలం శిశిరం, లావణ్య సూత్రార్పితం లావణ్యం సముదాయ శోభైవ సూత్రంగుణః తస్మిన్నర్పితం గ్రథితం లావణ్యస్య సర్వావయవా ఽనుస్యూతత్వాత్ సూత్రత్వ రూపణమ్। తే తవ కోమలాంగ సుమనః సందర్భణం సుకుమారావయవ పుష్పమాలికా కాన్తోరః ప్రతియత్నం కాంతస్యహరేః ఉరసోవక్షసః ప్రతియత్నం పరిష్కారం అర్హతి । హరి వక్షోఽలంకరణార్థం భవతీత్యర్థః అకాండా కులం అకాండే అనవసరే ఆకులం వివశం కవింపూాం ధిక్ నిందనీయమ్ । పుష్పాపేక్షయా నిరతిశయ సౌగంధ్య సౌకుమార్య లావణ్యయుక్త లక్ష్మీ వపుషః పుష్పదామత్వ రూపణం తస్య దనుజ వృషవిషాణోల్లిఖిత కఠిన హరివక్షః పరిష్కరణత్వ కల్పనం చాయుక్తమితి స్వస్యాకాండాకులత్వం తతో నింద్యత్వం చేతి బోధ్యమ్ । కఠినతమేఽపి హరి వక్షసి ఆశ్రిత లక్షణ చాపల్యాత్ సుకుమారాయా అపి శ్రియః స్థితిరుపపన్నైవేతి మంతవ్యమ్ ।

అ :- అథ శ్రియో భగవతాసహ సంభోగశృంగారం వర్ణయతి ।

శ్లో ॥ మర్మస్పృశో రససిరా వ్యతివిధ్య వృత్తైః
కాన్తోపభోగ లలితైర్లులితాఙ్గయష్టిః
పుష్పావలీవ రసికభ్రమరోపభుక్తా
త్వం దేవి! నిత్య మభినన్దయసే ముకున్దమ్ ॥ ౪౫

అ:- హే దేవి= ఓ లక్ష్మీదేవీ, మర్మస్పృశః= మర్మములను స్పృశించునట్టి, రస సిరాః= రసనాడులను, వ్యతివిధ్య= ఉప్పొంగింపచేసి, వృత్తైః= జనించినట్టి. ( జరిగి నట్టి), కాంతోపభోగలలితైః= శ్రీమన్నారాయణుని అనుభవము యొక్క విలాసముల చేత, లులితఅంగయష్టిః= మర్దితమైన గాత్రయష్టికలదానవై, రసిక భ్రమరోపభుక్తా = రసాస్వాదన చతురమైన తుమ్మెదచేత అనుభవింపబడిన, పుష్పావలీ ఇవ= పుష్ప సముదాయము వలె, త్వమ్= నీవు, నిత్యమ్= ఎల్లప్పుడు, ముకుందమ్ = మోక్షప్రదాత యైన శ్రీమన్నారాయణుని, అభినందయసే= అంతటను ఆనందింప చేయుచున్నావు.

తా :- ఓ లక్ష్మీదేవీ, మర్మములను స్పృశించునట్లుగాను, నాడులుప్పొంగునట్లు గాను, లలితములైన ఉపమర్దములతో, తుమ్మెదచేత అనుభవింపబడిన పుష్ప సముదాయమువలె, కాంతుడైన శ్రీమన్నారాయణుని చేత అనుభవింపబడి, నీవు ఆ శ్రీహరికి నేత్ర హృదయాద్యానందములను కలుగచేయుచున్నావు.

వి :- ఇచటకూడ 'దేవి' అను సంబోధనకు 44వ శ్లోకములో వలెనే అర్థము చెప్పుకొనవలయును. ఈ శ్లోకమున లక్ష్మీనారాయణుల యొక్క సంభోగ శృంగారము వర్ణింపబడినది. లక్ష్మిని పుష్పసముదాయముగాను శ్రీమన్నారాయణుని తుమ్మెద గాను, వర్ణించుట జరిగినది. తుమ్మెదకు వాడబడిన 'రసిక' అను విశేషణము శ్రీమన్నారాయణునకు కూడ ఉపయోగించును. లక్ష్మిని పుష్పావళిగా వర్ణించుటవలన ఆమెయొక్క ప్రత్యవయవము ఒక్కొక్క పుష్పముగాను, తత్సముదాయము పుష్పసముదాయముగాను, వర్ణించినట్లయినది. మొదటి రెండు పాదములలోను వారిద్దరి యొక్క శృంగార పరాకాష్ఠ వర్ణింపబడినది. ముకుందపదము ఇచట సార్థకము. ఈ పదమునకు మోక్షము నిచ్చువాడు అని అర్థము. భక్తులను అనుగ్రహించు విధముగా విశ్వరక్షణ వ్యాపారములో నున్న శ్రీమహావిష్ణువునకు ఈ విధమైన ఆనందమును కూడ కలుగజేయుచు మనసునకు విశ్రాంతిని కలుగచేయుచున్నది ఈ లక్ష్మీదేవి అని ఈ శ్లోక సారాంశము. 'క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదాస్యాదేకరస్యాత్తయా' అని మొదటి శ్లోకము లోనే చెప్పికొని యుంటిమికదా. అంతియేకాని కేవలం సంభోగ శృంగారవర్ణన ఇచట ప్రధానము కాదు. కేవలము అట్టి శృంగారమును వర్ణించుట మాతాపితృ శృంగార వర్ణన వలెనే అనుచితము కూడ అగును. ఇచట విష్ణువునకు వక్షఃస్థలమునందే లక్ష్మియొక్క నిత్యనివాసముచేత నేత్రానందము. ఈ విధమైన అనుభవముచేత హృదయానందము. ఈ ఆనందములు అభినందయసే అను పదము ద్వారా చెప్పబడినవి. మరియు ఈ శ్లోకమున 'లలితైర్లలిత' అనుచోట యమకము, 'పుష్పావళీవ' అనుచోట ఉపమాలంకారము కూడ ప్రకృతరసరంజకములై తమ యలంకారత్వమును సార్థకపరుచుకొనుచున్నవి.

సం.వ్యా:- మర్మేతి హే దేవి! మర్మస్పృశో మర్మస్పర్శినీః రసశిరాః రసనాడీః వ్యతివిధ్య వేధితాః కృత్వా వృత్తైః ఉద్భూతైః కాంతోపభోగలలితైః సంభోగ విలాసైః లులితాంగ యష్టిః మృదితగాత్రయష్టి స్సతీ రసిక భ్రమరోపభుక్తా రసికభ్రమరేణ రసాస్వాద చతురేణ చంచరీకేణ ఉపభుక్తా నిపీతరసా। పుష్పావలీవస్థితా త్వం ముకుందం ప్రేయాంసం అభినందయసే ఆనందయసి, నయన హృదయానంద కందలితం కరోషీత్యర్థః.

అ :- శ్రియో దివ్యాభరణగణ యోగకృత కాన్తివిశేష మనుసంధత్తే।

శ్లో॥ కనకరశనా ముక్తాతాటఙ్క హార లలాటికా
మణిసర తులాకోటిప్రాయైః జనార్దనజీవితే ।

ప్రకృతి మధురం గాత్రం జాగర్తి ముగ్ధవిభూషణైః
వలయశకలై ర్దుగ్ధం పుష్పైశ్చ కల్పలతా యథా ॥ ४६

అ :- హే జనార్దన జీవితే=జనార్దనునకు జీవనౌషధివైన ఓ లక్ష్మీదేవీ! కనక... ప్రాయైః, కనకరశనా=బంగారు ఒడ్డాణము (మొలనూలు), ముక్తాతాటంక= ముత్యములతో చేయబడిన కర్ణాభరణములు, హార=ముత్యాలహారము, లలాటికా= ముఖమున వ్రేలాడునగ, (పాపటపట్టీ) లేదా తిలకము, మణిసర=మణులతో తయారుచేయబడిన హారములు, తులాకోటి=మణినూపురములు, ప్రాయైః= ప్రధానముగాగల (మొదలగు), ముగ్ధవిభూషణైః=సుందరములగు ఆభరణములతో, ప్రకృతిమధురమ్=స్వభావముగనే సుందరమైన, గాత్రమ్=నీయొక్క శరీరము, వలయశకలైః=శర్కరా ఖండములతో, దుగ్ధం యథా=పాలవలెను, పుష్పైః=పుష్పముల తో, కల్పలతా యథా చ=కల్పవల్లి వలెను కూడ, జాగర్తి=సర్వోత్కర్షగా ప్రకాశించు చున్నది.

తా :- ఓ లక్ష్మీదేవీ! బంగారు ఒడ్డాణము, ముత్యాల దుద్దులు, స్వర్ణ మణిహారములు అట్టిదే అయిన పాపటయందు వ్రేలాడు నగ, తిలకము నూపురములు మొదలైన ఈ ఆభరణములన్నియు స్వభావముగనే సుందరమైన నీ శరీరమునకు, పంచదార పాలకువలె పుష్పములు కల్పలతకువలె, మరింత ఉత్కర్షను కలుగచేయు చున్నవి.

వి :- ఇచట లక్ష్మియొక్క అవయవశోభ స్వభావముచేతనే సుందరమైనదిగా వర్ణింప బడినది. సహజసుందరమైన ఆ శోభను హిరణ్మయ మణిమయ ఆభరణములు వృద్ధి చేయుచున్నవి. ఈ అవయవశోభకు రెండు ఉపమానములీయబడినవి. ఒకటి పాలు రెండవది కల్పలత. అట్లే ఆభరణములకు రెండు ఉపమానము లీయబడినవి. ఒకటి శర్కరాఖండములు రెండవది పుష్పములు. పాలు స్వభావము చేతనే మధురమైనవి. వానికి శర్కరా ఖండములు మరింత మాధుర్యాపాదకములు. అట్లే కల్పలతయే సహజసుందరము. పుష్పములు కలిగియుండుట మరింత సౌందర్యాపాదకము. ఇచట దుగ్ధోపమ స్వచ్ఛతను మాధుర్యమును, కల్పలతోపమ సౌగంధ్యమును సౌ కుమార్యమును తెలియచేయుచున్నవి. శరీరము దుగ్ధతుల్యమైనపుడు ఆభరణములు శర్కరాఖండ తుల్యములు అగుచున్నవి. అట్లే శరీరము కల్పలతాతుల్యమైనపుడు ఆభరణములు పుష్పతుల్యములగుచున్నవి. ఈ విధముగా దివ్యాభరణ యోగముతో వచ్చిన లక్ష్మీదేవి యొక్క శరీరమునందలి కాంతి ఈ శ్లోకమున వర్ణింపబడినది.

సంస్కృత వ్యాఖ్య :- కనకేతి। హే జనార్దన జీవితే! శ్రీరంగరాజ జీవనౌషధి! కనకరశనా స్వర్ణమేఖలా స్వర్ణసూత్రంవా, ముక్తాతాటంకే మౌక్తిక కర్ణపత్రే హారో ముక్తాహారః, లలాటికా కనకమయం మాణిక్యమయంవా తిలకం లలంతీవా, మణి

మాలికాః తులాకోటి మణిమంజీరౌ ఏతే[ప్రాయాః [ప్రధానాని యేషాంతైః ముగ్ధ విభూషణైః సుందరరాభరణైః [ప్రకృతి మధురం స్వభావరమ్యం తే గా[త్రం వలయశకలై శర్కరా ఖండైః దుగ్ధం యథా క్షీరమివ పుష్పైః కల్పలతా యథా కల్పవల్లీవ చ జాగర్తి విశేషేణ [ప్రకాశతే ।

అ :- 'రూపాకార విభూతిభిశ్చ సదృశీమ్' ఇత్యుక్తరీత్యా భగవతః పరమ సామ్యాపన్నాయాః [శియః కౌస్తుభవైజయన్తీ పంచాయుధ ధారణస్య సాధారణ్యేఽపి తేషాం భగవదేకధారణే హేతు ము[త్ప్రేక్షతే ।

శ్లో ॥ సామాన్య భోగ్యమపి కౌస్తుభవైజయన్తీ
పఞ్చాయుధాది రమణః స్వయమేవ బి[భ్రత్ ।
తద్భార ఖేదమివ తే పరిహర్తుకామః
శ్రీరఙ్గధామ మణిమఞ్జరి! గాహతే త్వామ్ ॥ ४२

అ :- హే శ్రీరంగధామ మణిమంజరి= శ్రీరంగధాముని నివాసమునకు మణిదీప మైన ఓ లక్ష్మీదేవీ, సామాన్యభోగం అపి= మీ ఇద్దరును సమానముగా ధరించ వలసినవైనను, కౌస్తుభ...పంచాయుధాది, కౌస్తుభ= కౌస్తుభరత్నము, వైజయన్తీ = వనమాల, పంచాయుధాది= శంఖచ[క్రాద్యాయుధములను, తద్భారఖేదమ్ = వాటిని నీవు వహించినచో నీకు కలిగెడి ఖేదమును, పరిహర్తు కామః ఇవ= పోగొట్ట దలచిన వాడువలె, స్వయం ఏవ= తనంతటతానే, బి[భ్రత్= ధరించుచు, రమణః= నీ యొక్క కాంతుడైన శ్రీమన్నారాయణుడు, త్వామ్= నిన్ను, గాహతే= అనుసరించు చున్నాడు.

తా :- ఓ లక్ష్మీదేవీ, కౌస్తుభ వనమాలాద్యలంకారములును శంఖచ[క్రా ద్యాయుధము లున్ను, నీకును శ్రీమన్నారాయణునకున్ను సమానములే అయినను, సౌకుమా ర్యాతిశయముతో [ప్రకాశించుచున్న నీవు ఆయా అలంకార ఆయుధాలను ధరించినచో నీకు భారము కలుగుననెడి ఉద్దేశ్యముతో నీ[ప్రియుడైన శ్రీమన్నారాయణుడు ( శ్రీరంగ ధాముడు) ఆ భారమును తానే వహించి నిన్ను అనుసరించుచు తన లక్ష్మీరమణత్వము ను సార్థకము చేసికొనుచున్నాడు.

వి:- కౌస్తుభాద్యలంకారములున్ను శంఖచ[క్రాద్యాయుధములున్ను, లక్ష్మీనారాయణు లకు సమానములే, ఇచట ఆయుధములలో ఆది పదముచేత పాశ అంకుశ పరిఘ ముద్గరాదులను కూడ [గహింపనగును. 'శంఖచ[క్రగదాహస్తే' 'పాశాంకుశ ధరే దేవి' 'శ్వేతాంబరధరేదేవి నానాలంకార భూషితే' అని లక్ష్మీస్తవము లలో ఆమె అన్ని ఆయుధములను, అలంకారములను ధరించియున్నట్లుగా స్తుతించుట [ప్రసిద్ధము. ఇవి ఇద్దరకును సమానములే అయినను శ్రీమన్నారాయణు డొక్కడే వీనిని ధరించుటకు కారణము సుకుమార శరీరయైన లక్ష్మీదేవి వీనియొక్క భారమును

వహింపలేదని ఆమె యందలి ప్రేమాతిశయముచే ఆ విధముగా ఆమెను అనుసరించుచు శ్రీమన్నారాయణుడు లక్ష్మీ రమణుడైనాడు. అనగా సంతోష పెట్టు వాడైనాడు. ఆమె కూడ ఆ విధముగ శ్రీరంగనాథుని(శ్రీమన్నారాయణుని) నివాసము నకు మణిదీపమైనది. కావుననే ఆమెను అనుసరించుట అని ఉత్ప్రేక్ష. ఈ విధముగా ఇచట 'రమణ' పదమున్ను 'శ్రీరంగధామ మణిమంజరి' అను పదమున్ను సార్థకములు. లక్ష్మీనారాయణుల స్వరూపరూపగుణవిభవైశ్వర్యాదులు సమానములు గా వర్ణింపబడినప్పటికిని ఈ శ్లోకమున ఆభరణాయుధాది ధారణము శ్రీమ న్నారాయణునకు మాత్రమే చెప్పబడుట వలన లక్ష్మీదేవియొక్క స్వాధీన పతికాత్వము, సౌకుమార్యాతిశయము కూడ వ్యక్తములగుచున్నవి.

సంస్కృత వ్యాఖ్య :- సామాన్యేతి। హే శ్రీరంగధామ మణిమంజరి! శ్రీరంగధామ్నః హరేః దివ్యవిమానస్యవా మణిమంజరీ రత్నగుచ్ఛికా తస్యాః సంబుద్ధిః। సామాన్య భోగ్యమపి యువయోరితి శేషః। సామాన్యేన సాధారణ్యేన భోగ్యమపి భూషణతయా ప్రహరణతయా చ ధార్యమపి కౌస్తుభవైజయన్తీ పంచాయుధాది, కర్మ, ఆదిశబ్దేన పరకు పరిఘాది గృహ్యతే। త్వద్భారఖేదం త్వద్వహనాయాసం తే తవ పరిహర్తుకామ ఇవేత్యుత్ప్రేక్షా। స్వయమేవ బిభ్రత్ సన్। త్వాం గాహతే సంశ్లిష్యతి। దివ్యాభరణ దివ్యాయుధ గణం వహన్ ప్రియ స్త్వామనుసరతీతి భావః।

అ :- రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని।
అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ॥

ఇత్యుక్తరీత్యా భగవతః తత్తదవతారానుగుణం శ్రియోఽనవతార భగవతో లీలా నరోచిత ఇత్యాహ।

శ్లో॥ యది మనుజ తిరశ్చాం లీలయా తుల్య వృత్తే
రనుజను రనురూపా దేవి! నావాతరిష్యః।
అసరస మభవిష్య న్నర్మ నాథస్య మాతః!
దరదల దరవిన్దోదన్త కాన్తాయతాక్షి॥ ౪౮

అ:- దరదల...తాక్షి, దర=కొద్దిగా, దళత్=వికసించుచున్న, అరవింద= పద్మము యొక్క, ఉదంత=వృత్తాంతము (శోభ) వలె, కాంత=మనోహరములైన, ఆయత= విశాలములైన, అక్షి=నేత్రములు కలిగినట్టియు, దేవి=శ్రీమన్నారాయణుని పట్టమహిషి యైనట్టియు, మాతః=జగజ్జననివైనట్టియు ఓ లక్ష్మీదేవీ!, లీలయా= స్వేచ్ఛగనే, (కర్మాధీనము కాకుండగనే) మనుజ తిరశ్చామ్=మనుష్యతిర్యగాదులతో, తుల్యవృత్తేః =సమాన వ్యాపారముకల (సమానత్వమును పొందిన) నాథస్య=కాంతుడైన

శ్రీమన్నారాయణునియొక్క, అనుజనుః=ప్రతి అవతారము నందును, అనురూపా =తగినరూపమును ధరించినదానవై, న అవాతరిష్యః యది=(నీవు) అవతరించక పోయినచో, నర్మ=శ్రీమన్నారాయణుని ఆక్రీడయంతయు, అసరసమ్=సరసము కానిది (విరసమైనది), అభవిష్యత్=అయివుండెడిది.

తా :- పద్మగర్భముతో సమానములై మనోహరములు విశాలములును అయిన నేత్రములు కల ఓ లక్ష్మీదేవీ! కర్మాధీనముకాక స్వేచ్ఛగానే, మనుష్య తిర్యగాది భేద రహితముగా, నీపతియైన శ్రీరంగనాథుడు (శ్రీమన్నారాయణుడు) దాల్చు ప్రతి అవతారమునకున్ను, అనుకూలవముగా నీవుకూడ (స్వేచ్ఛగానే) అవతరించక పోయినచో నీపతి యొక్క ఆ లీల సరసముగా నుండెడిది కాదు.

వి :- భగవంతుడు స్వేచ్ఛగానే రామకృష్ణ మత్స్యకూర్మ వరాహాది రూపములలో అవతరించినాడు. లక్ష్మీదేవికూడ ఆయనతో సమానముగ స్వేచ్ఛగనే సీతా రుక్మిణీ మొదలగు అవతారములతో భూమిపై అవతరించి ఆయనను అనుసరించినది. చివరకు వామనావతారమునకూడ వక్షఃస్థలమున లక్ష్మీదేవి కనపడకుండగ యుండినట్లు ప్రసిద్ధికలదు. ఆ విధముగా ఆమె ఆయనను అనుసరించక పోయినచో భగవంతుని ప్రతి అవతారమునందలి లీల విరసమై యుండెడిది అని శ్రీభట్టరుల సూక్తి. భూమి యందు అవతరించుటలో శ్రీమన్నారాయణునకు ఒకరి యాజ్ఞలేదు. మానవ తిర్యగాది భేదమును లేదు. చివరకు సహకారాది వృక్ష రూపముగ స్థావరములలో కూడ అవతరించినాడు. ఆ విధముగా దేవమానవ తిర్యక్ స్థావర రూపములలో అవతరించిన ప్రతి అవతారము నందును లక్ష్మికూడ శ్రీమన్నారాయణుని వదలకుండగ తనంతటతానే దేవ మానవ తిర్యక్స్థావర రూపములలో అవతరించుట ఆమెయొక్క పాతివ్రత్యమునకును, అన్యోన్యతకును చిహ్నము. 'గృహిణీ గృహముచ్యతే' (కేవలము ఇల్లు ఇల్లుకాదు గృహిణియే ఇల్లు) అని 1వ శ్లోకమున చెప్పికొని యుంటిమి గదా. ఆ విధముగా లక్ష్మీదేవి అవతరించినచో 45వ శ్లోకములో చెప్పుకొనిన విధముగా మానసోల్లాసము కలుగు నవకాశములేదు కావున శ్రీమన్నారాయణుని లీల సరసము కానేరదు. దేవమానవ తిర్యగాది భేదము లేకుండగ శ్రీమన్నారాయణుడు అవతారము ను దాల్చినపుడు తత్సమానములైన రూపములతో లక్ష్మీదేవికూడ అవతరించక పోయినచో భగవంతుని అవతారములకు సార్థక్య సంపూర్ణతలు కలుగవని సారాంశము. ఈ శ్లోకమున 1) లక్ష్మియొక్క నేత్రములకు పద్మగర్భోపమానము సౌకుమార్య సౌందర్య వైశాల్యములను తెలుపుచున్నది. 2) 'విరసం' అని ప్రయోగించ కుండగ 'అసరసం' అని ప్రయోగించుట ఉచితముగా నున్నది. 3) 'తుల్య వృత్తేః' అనుపదము ప్రతిఅవతారమునందును ఆయా అవతారమునకు తగిన ధర్మమును చెప్పుచున్నదై

అర్థవంతమగుచున్నది. 4) 'దేవి' అను సంబోధన 'భూనీళాదులకంటె, ప్రతి అవతారము నందును శ్రీమన్నారాయణునితో అవతరించుటకు నీవే తగిన దానవు' అని అర్థము చెప్పుచు సార్థకమగుచున్నది. 5) 'మాతః' అను సంబోధన కూడ 52వ శ్లోకములో చెప్పుకొనబోవు విధముగా దయను వ్యక్తముచేయుచు సార్థకమగు చున్నది. 6) లీలాపదము ఇరువురి స్వేచ్ఛను వ్యక్తము చేయుచున్నది (చూ. శ్లో. 53). ఇచట

1. దేవత్వే దేవదేహేయం మనుష్యత్వేచ మానుషీ
రాఘవత్వేభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని
అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ ॥

(శ్రీమన్నారాయణుడు దేవదేహములో నున్నపుడు ఆ దేహముతోను, మానవుడుగా నున్నపుడు ఆ దేహముతోను అనగా విష్ణువుగానున్నపుడు లక్ష్మిగాను, రాముడుగా అవతరించినపుడు సీతగాను, కృష్ణుడుగా అవతరించినపుడు రుక్మిణిగాను ఈమె అవతరించినది. అట్లే మిగిలిన అవతారములలో కూడ ఈమె శ్రీమన్నారాయణుని విడవకుండగ అవతరించినది) అను విష్ణుపురాణమునందలి శ్రీస్తుతియు;

2. రూపశ్రియా గుణగణై ర్విభవేన ధామ్నా
భావై రుదార మధురైః చతురైః చరిత్రైః
నిత్యం తవైవ సదృశీం శ్రియ మీశ్వరీం తాం
త్వాం చాశ్రితః పరిచరేయ ముదీర్ణభావః ॥

(రూపగుణాదులతోను, విభవముతోను మధురములైన చరిత్రలతోను ఎల్లప్పుడును నీకు తగినదియు, అధీశ్వరియు అయిన లక్ష్మీదేవిని, నిన్నును కూడ సేవించెదను) అను వైకుంఠస్తవములోని (81వ) శ్లోకమున్ను;

3. ఆపన్నార్తి ప్రశమనవిధౌ బద్ధ దీక్షస్య విష్ణోః
అచఖ్యుస్త్వాం ప్రియసహచరీ మైకమత్యోపపన్నామ్॥

(ఆపన్నుల ఆర్తిని పోగొట్టుటలో బద్ధకంకణుడైన శ్రీమహావిష్ణువునకు ఐకమత్యము తో కూడిన ప్రియసహచరిగా నిన్ను చెప్పిరి) అను వేదాంతదేశికుల శ్రీస్తుతియు అను సంధేయములు.

పై రెండవ మూడవ శ్లోకములయందలి 'నిత్యం' ఈశ్వరీం 'ప్రియసహచరీం' అను పదములు- ఆమె ఎల్లప్పుడును స్వేచ్ఛగనే శ్రీమన్నారాయణుని అనుసరించు చున్నదని అర్థమును చెప్పుచు ప్రకృత శ్లోకమునకు ప్రోద్బలకములగుచున్నవి. ఈ శ్లోకమున సువర్ణకుంచికావ్యాఖ్య కూడ గమనించతగినది - భగవంతుడు ఉపేంద్రుడై దేవ

జన్మములోను రాముడై మనుష్యజన్మములోను మత్స్యాదులై తిర్యగ్జన్మములోను మామిడి వృక్షమై స్థావరజన్మములోను నవతరించి యుండుట గ్రాహ్యము. ఇట్లు జన్మములెత్తుట మనవలె కర్మముచేతగాదు తన ఇచ్ఛచేత నవి కావలసినవిధముగ గ్రహింపబడినవే యనుచు 'లీలయా' అనిరి. అవతరించిన జాతిధర్మమును 'తుల్య వృత్తేః' అనుటచేత చెప్పుచున్నారు. మానహీనమైన వరాహముగా జన్మించినపుడు తుంగముస్తెలను భుజించుట తుల్యవృత్తికాదా?' అనియు. 'అన్ని అవతారములలోను అనుటచేత శ్రీదేవిలేక భగవంతుడు అవతార మెత్తుటయే లేదని విశదమగును. వామనుడై తాను బ్రహ్మచారిగా నవతరించినపుడును, ఆ దశకు తగిన చిన్నదేహముతో వక్షః స్థలమున ప్రకాశించులక్ష్మిని జింకచర్మముతో చేయబడిన ఉపవీతముచేత కప్పి పెట్టినట్లుగా చెప్పబడియున్నది' అనియు. 'భగవంతునకు కలిసియుండు ఆటలాడు నీమె లేకపోయినచో' క్రీడేయం ఖలు నాన్యథాస్య రసదాస్యాత్' అనునట్లు సరసమై యుండదనుట' అనియున్ను.

సంస్కృత వ్యాఖ్య :- యదీతి। దరదలదరవిందస్య ఈషద్వికసిత పుండరీకస్య ఉదన్తో వృత్తాన్తః తేన గర్భపత్రం లక్ష్యతే తద్వత్ కాంతే శోభమానే ఆయతే విశాలే అక్షిణీ యస్యా స్తస్యాః సంబుద్ధిః మాతః జనని! లీలయా స్వేచ్ఛయా నతు కర్మణా మనుజతిరశ్చాం మనుష్య తిర్యగ్జంతూనాం ఇదముపలక్షణం సురనర తిర్యక్ స్థావర శరీర చతుర్విధాత్మనామపి, తుల్యవృత్తేః రామకృష్ణ మత్స్యకూర్మ కుబ్జామ్రాది రూపేణ సమానశీలస్య నాథస్య శ్రీరంగరాజస్య అనుజనుః ప్రత్యవతారం అనురూపా సీతా రుక్మిణ్యాది రూపేణానురూపాకారా నావాతరిష్యో యది నావతరసిచేత్ నాథస్య తస్య నర్మక్రీడా 'క్రీడాఖేలాచ నర్మచ' ఇత్యమరః। అసరసం విరసం అభవిష్యత్ తదవతారానురూప మవతీర్య త్వదభినందనే సత్యేవ తస్య తన్మర్మ ప్రీత్యై భవేత్ నచే న్నేతిభావః

అ :- సంశ్రితార్థం సముద్ర మథనాయాసం భజతో భగవతః శ్రమా పనయనాయ సముద్రా దావిర్భూతాసీ త్యాహ।

శ్లో॥ స్ఖలిత కటకమాల్యై ర్దోర్భి రబ్ధిం మురారే
ర్భగవతి! దధిమాథం మథ్నతః శ్రాన్తిశాన్త్యై ।
భ్రమదమృత తరఙ్గావర్తతః ప్రాదురాసీః
స్మిత నయనసుధాభిః సిఞ్చతీ చన్ద్రికేవ॥ ४४

అ :- హే భగవతి=షడ్గుణైశ్వర్య సంపన్నురాలైన ఓ లక్ష్మీదేవీ, స్ఖలితకటక మాల్యైః, స్ఖలిత=తొట్రుపడిన (జారుచున్న), కటక=వలయములు, మాల్యైః=పుష్పమాలలు కలిగిన, దోర్భిః=బాహువులతో, అబ్ధిమ్=పాలసముద్రమును, దధి మాథమ్= పెరుగును చిలికినట్లుగా, మథ్నతః=మథించుచున్నట్టి, మురారేః=శ్రీమహా విష్ణువు

యొక్క, శ్రాంతిశాంత్యై=అలసటను పోగొట్టుటకు, స్మిత నయన సుధాభిః=చిరునవ్వుతో కూడిన చూపులనెడి అమృతముతో, సించతీ= తడుపు చున్నదానవై చంద్రికా ఇవ=వెన్నెలవలె, భ్రమదమృత తరంగావర్తతః భ్రమత్= తిరుగు చున్న, అమృత తరంగ =అమృతతరంగములయొక్క, ఆవర్తతః=సుడినుండి, ప్రాదురాసీః= ఉద్భవించితివి.

తా :- ఓ లక్ష్మీదేవీ, అమృతముకొరకై అత్యంత శ్రమయుక్తముగా పాల సముద్రమును పెరుగును చిలికినట్లుగా చిలికి అలసిన శ్రీమహావిష్ణువునకు శ్రమను పోగొట్టుటకై అమృతతరంగముల మధ్యనుండి చంద్రికవలె చిరునవ్వుతో కూడిన చూపులనెడి అమృతమును చిలుకుచు పాలసముద్రమునుండి ఉద్భవించితివి.

వి :- ఇచట లక్ష్మీదేవి పాలసముద్రమునుండి ఉద్భవించుట కేవలము శ్రీమహావిష్ణువు యొక్క శ్రమను పోగొట్టుటకే అని చెప్పబడినది. భగవంతుడు పడినశ్రమ 'స్ఖలితకటక మాల్యైః' అను పదముద్వారా చెప్పబడినది. అది పాల సముద్రమే యైనను దానిని పెరుగును చిలికినట్లు చిలుకుట విశేషము. ఆ విధముగా చిలుకునపుడు బాహువుల యొక్క చలనముతో ఆ బాహువుల యందలి కటకములు పుష్పమాలలు కూడ జారిపోవుచున్నవి. సుకుమార శరీరులకు అది శ్రమయేకదా, మరియు పెరుగును చిలికిన ఎక్కువ శ్రమలేకయే వెన్నవచ్చును. పాలను చిలికినచో అందలి సారమును పొందుటకు ఎక్కువ శ్రమ పడవలసి యుండును. ఈ క్రియ సుకుమారులు కానివారికి కూడ శ్రమను కలిగించును. సుకుమారశరీరుల విషయమున వేరుగా చెప్పనక్కర లేదుగదా. కావున అట్టిశ్రమను పోగొట్టుటకు తగిన ఔషధము లక్ష్మియే. ఈ లక్ష్మి యొక్క చిరునవ్వు వెన్నెలతో పోల్చబడినది. కావున లక్ష్మియొక్క ముఖము చంద్రునితో సమానమని సూచితము. బాగుగా అలసట చెందినవారికి వెన్నెల ఆ అలసటను పోగొట్టును. అట్లే బాగుగా అలసిన శ్రీమహా విష్ణువుయొక్క అలసటను లక్ష్మీదేవి యొక్క చిరునవ్వు పోగొట్టును. లక్ష్మీదేవియు, చంద్రుడును కూడ సముద్రమునుండి అమృత తరంగములలో నుద్భవించినవారే. కావున శ్రమాపనోదకత్వము ఇద్దరకును సమానమే. మరియు అమృత తరంగముల నుండి ఉద్భవించుట తత్సారమగుటను తెలియచేయుచున్నది. అట్టి అమృతమయమైన చంద్రికతో సమానమైన చిరునవ్వుతో కూడిన లక్ష్మియొక్క ముఖమును చూడగనే శ్రీమహావిష్ణువుయొక్క శ్రమయంతయు మాయమైనదని సారాంశము. అమృతము కొరకు పడినశ్రమ తత్సారమైన లక్ష్మీముఖ దర్శనము వలన ఫలవంతమైనది. ఉదధిగ మందరాద్రి మథి మంథన లబ్ధపయో మధుర రసేందిరాహ్వసుధ సుందరదోః పరిఘమ్ ।( సముద్రమునందున్న మందర పర్వతముతో మథించుటవలన పొందబడిన లక్ష్మియనెడి అమృతముతో ప్రకాశించు అర్గళము వంటి బాహువులు కలవాడు) అను శ్రీవత్సాంకమిశ్రుల శ్రీసూక్తి ఇట అనుసంధేయము.

సంస్కృత వ్యాఖ్య :- స్థలితేతి। హే భగవతి। షడ్గుణైశ్వర్య సంపన్నే! స్థలితాని ప్రతిహతాని కటకాని వలయాని మాల్యాని మాలికాశ్చ యేషుతైః దోర్భిః బాహుభిః అబ్ధిం క్షీరార్ణవం దధిమాథం దధీవ ఉపమానార్థేణముల్ ప్రత్యయః మథ్నతః మథనం కుర్వతః అమృతార్థమితి భావః। మురారేః మాధవస్య శ్రాన్తిశాన్త్యై శ్రమా పనయనాయ స్మితనయన సుధాభిః స్మితం మందహాసః నయనాన్యవలోకనాని నయన శబ్దేన అవలోకితాని లక్ష్యన్తే। తాన్యేవ సుధాః తాభిః సించంతీసతీ చంద్రికేవ భ్రమ దమృత తరంగావర్తతః భ్రమతాం ఉల్లోలానాం అమృత తరంగాణాం సుధావీచీనామ్ ఆవర్తతః వలయాత్ తత్సారతయేతి భావః। తదుక్తం శ్రీవత్సాంకమిశ్రైః 'ఉదధిగ మందరాద్రి మథి మంథన లబ్ధపయో మధుర రసేందిరాహ్వసుధ సుందరదోః పరిఘమ్' ఇతి। ప్రాదురాసీః ఆవిర్భూతాసి। యథా జగత్ సుధాభిః సించతీ చంద్రికా పయోధే రావిర్భవతి తథా భగవన్తం స్మితనయన సుధాభిః సించతీ పయః పయోధ్యుల్లలత్ సుధా తరంగావర్తాత్ త్వమావిర్భూతాసీతి భావః।

అ :- అథ భగవత్ క్షమాయా అపి లక్ష్మీక్షమామతిశయితా ముదాహృత్య సా మహాపరాధినోఽస్మానానందయ త్విత్యాశాస్తే।

శ్లో ॥ మాత ర్మైథిలి! రాక్షసీ స్త్వయి త(థై)దైవార్ద్రాపరాధా స్త్వయా
రక్షన్త్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్యగోష్ఠీ కృతా।
కాకం తఞ్చ విభీషణం శరణమిత్యుక్తి క్షమౌ రక్షతః
సా నః సాంద్రమహాగస స్సుఖయతు క్షాన్తి స్తవాకస్మికీ ॥ ౫౦

అ :- మాతః=జననియు, మైథిలి=జనకాత్మజయు అయిన ఓ సీతాదేవీ, త్వయి =నీయందు, తదైవ=అప్పుడే, (అనగా హనుమంతుడు వచ్చుటకు కొద్దిగ ముందు గానే) లేదా, తథా+ఏవ=ఆ విధముగనే, (అనగా రావణుడు బ్రతికి యున్నప్పుడు వలెనే మరణించిన తర్వాత కూడ) ఆర్ద్రాపరాధాః=క్షమింపరాని అపరాధములుచేసిన, (రావణుని వినాశము తెలియదు కావున అతడు బ్రతికి యున్నప్పుడు వలెనే అతని మరణవార్తను తీసికొనివచ్చిన హనుమంతుని ఆగమనము వరకునుకూడ బాధించు చుండిన) రాక్షసీః=రాక్షస స్త్రీలను, పవనాత్మజాత్= హనుమంతుని నుండి, రక్షన్త్యా=రక్షించుచున్న, త్వయా=నీచేత, కాకమ్ =కాకా సురుని, తం విభీషణంచ= రావణుని సోదరుడైన విభీషణునికూడ, శరణ మిత్యుక్తి క్షమౌ=శరణమను పదమునకు తగిన వారలనుగా (రక్షణకు అర్హులైన వారలనుగా), రక్షతః=రక్షించుచున్నట్టి, రామస్య గోష్ఠీ=రామునియొక్క సభ, లఘుతరా= తక్కువైనదిగా, కృతా=చేయబడినది, సా= ఆ విధముగా కృపార్ద్రమైన, తవ=నీ

యొక్క, ఆకస్మికీ=కారణము లేకయే ఉద్భవించిన, క్షాన్తిః=సహనము, సాంద్ర మహాగసః=ఎల్లప్పుడును మహాపరాధములను చేయు నట్టి, నః=మమ్ములను, సుఖయతు=సంతోషపెట్టుగాక.

తా :- జగజ్జననివైన సీతామాతగా అవతరించిన ఓ లక్ష్మీదేవీ, నీయందు ఆర్ద్రాపరాధములను (క్షమించరాని నేరములను) చేయుచున్న రాక్షస స్త్రీలను హనుమంతుని బారినుండి రక్షించి నీయొక్క నిర్హేతుకజాయమాన కరుణా విశేషమును చాటుట ద్వారా కాకాసురుని విభీషణునికూడ రక్షించిన శ్రీరామునికరుణనే తక్కువ చేసితివి. అట్లు ఆకస్మికముగా ప్రవర్తిల్లునట్టి నీయొక్క (సహనము) కృప నిత్యము మహాపరాధములను చేయుచున్నట్టి మమ్ము మాబోంట్లను రక్షించి సుఖ పెట్టునుగాక.

వి :- ఈ శ్లోకమున రామావతారమునందలి విశేషములు వర్ణించబడినవి. లక్ష్మి యొక్క అవతారములలో సీతామాత సహనమునకు పరాకాష్ఠ. అందుకనియే వాల్మీకికూడ 'సీతాయాశ్చరితం మహత్' అని కొనియాడినాడు. ఆమె లంకలో నున్నప్పుడు రావణుడు జీవించియుండగాను, అతడు చనిపోయినట్లు తెలియనంత వరకు (చనిపోవు వరకు) కూడ రాక్షసస్త్రీలు త్రిజట హితబోధ చేసినను వినక ఆమెను బాధించుచునే ఉండిరి. రావణుడు చంపబడిన వార్తను హనుమంతుడు ఆమెకు చెప్పుటకు వచ్చినప్పుడు కూడ ఆమె రాక్షస స్త్రీలచేత బాధింపబడుచునే యున్నది. అప్పుడు హనుమంతుడు వారిపై కోపమును ప్రదర్శింపగా సీత అతనిని నివారించి అతని బారినుండి రాక్షస స్త్రీలను రక్షించినది. ఆమెయొక్క ఈ నిష్కారణ కరుణ శ్రీరాముని కరుణనే తక్కువ చేయుచున్నది. శ్రీరాముడు కాకాసురుని విభీషణుని కూడ రక్షించినాడు. అందు కాకాసురుడు ఆర్ద్రాపరాధముచేసి చివరకు శరణుపొంది రక్షింపబడినాడు. రావణుని తమ్ముడైన విభీషణుడు కూడ ఏ అపరాధమును చేయక యే శ్రీరామునే వరించి, శరణుపొంది రక్షింపబడినాడు. ఆసమయమున శ్రీరాముడు అభయమిచ్చుట, రక్షించుట, ఆతడు ధర్మాత్ముడను కారణమునకాదు. సుగ్రీవాదులు 'ఈతడు రావణుని సోదరుడు. ఈతనిని నమ్మరాదు' అని వ్యతిరేకాభిప్రాయమును వెలిబుచ్చినను, కేవలము తనను శరణుపొందిన కారణముననే అతనికి అభయమిచ్చి రక్షించినాడు.

సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతిచ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ ॥

(నేను నీవాడను అని నన్ను శరణుపొందిన వానిని సర్వభూతముల బారినుండి అభయమిచ్చి రక్షించుట నా వ్రతము) అను శ్రీరాముని వాక్యమును 'వధ్యం ప్రపన్నం న ప్రతి ప్రయచ్ఛన్తి' (చంపదగిన వాడైనను శరణు పొందినచో అతనిని చంపరాదు.)

అను శ్రుతియుకూడ నిట ప్రమాణములు. మరియు 'రావణుడేవచ్చి శరణుపొందినను రక్షించెదను' అని శ్రీరాముడు పలికిన పలుకులు కూడ నిట గ్రాహ్యములు. ఈ విధముగా కరుణా స్వరూపుడైనను శ్రీరాముడు ఆతని కరుణ ఏదో ఒక (శరణు పొందుట అను) కారణముతో కూడినది. సీతామాత కరుణ నిష్కారణమైనది అనగా ఏ కారణమును లేనిది. ఇచట కొంతమంది 'ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా' అను త్రిజట వాక్యములను అపార్థము చేసికొని 'సీతయొక్క కరుణగూడ కారణముతో కూడినదే ఆకస్మికముకాదు' అనిరి. అది సరికాదు. ఎట్లనగా త్రిజట రాక్షసస్త్రీలకు తనకువచ్చిన శుభస్వప్నమును గూర్చివివరించి 'సీతకు మంచిరోజులు వచ్చినవి. రావణునకు వినాశము తప్పదు కావున మీరు ఈమెను శరణువేడుడు. రావణుడు చనిపోయినను మిమ్ములను రక్షించును' అని బోధచేసినది. ఇంత వరకును క్షమించరాని నేరములను చేసిన తమను ఆమె ఎట్లురక్షించును అను సందేహమునకు తనకుతానే తనబుద్ధికి తోచినట్లుగ ఆ విధముగనైనను వారలను ఆ పనినుండి వారించ వచ్చునను ఉద్దేశ్యముతో 'ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీజనకాత్మజా' (జనకాత్మజ యైన ఈ మైథిలి శరణుపొందినవారిని రక్షించును) అని చెప్పినది. ఇది త్రిజటకు తోచిన అభిప్రాయమేకాని 'శరణు పొందిననే రక్షింప వలయుననెడిది జానకీమాత ఆశయముకాదు. అట్లే అయినచో మూడులోకములను తిరిగితిరిగి చివరకు శ్రీరాముని పాదకములకడనే పడిన కాకాసురుని రక్షించుమను నుద్దేశ్యముతో స్వామిపాదములకు మరింతదగ్గరచేర్చుట జరుగదుగదా. అట్లే త్రిజట అంతగా చెప్పినను వినక తనను బాధించుచుండిన రాక్షస స్త్రీలను వారు శరణు పొందకయే రక్షించినది. శ్రీరాముడు కాకాసురునైనను, విభీషణునైనను వారు శరణు పొందిన తర్వాతనే రక్షించినాడు. ఈమె అట్లుకాదు. కావున ఆమెయొక్క కరుణకు కారణము లేదనుట సమంజసమే, ఆ విధముగా ఆమె శ్రీరాముని కరుణనే తక్కువ చేసినది. ఇచట శ్రీరాముడు తక్కువచేయబడినాడు అనుటకంటె శ్రీరాముని గోష్ఠి తక్కువ చేయబడినది అని చెప్పుట ఉచితముగానున్నది. మరియు పవనాత్మజపదము 'ఆతని కోపము వారింప శక్యముకానిది' అను అభిప్రాయమును సూచించుచు సార్థకమగు చున్నది. లేదా ఒక మర్కటముగా నెంచినను వారింపరాని అట్టి మర్కటము యొక్క చేష్టలను కూడ సీత అరికట్ట కలిగినదను భావమున ఆమెకే ఉత్కర్షను కలుగచేయు చున్నది. ఈ విషయమున

శ్లో॥ రఘువర యదభూస్త్వం తాదృశో వాయసస్య
ప్రణత ఇతి దయాళు ర్యచ్చ చైద్యస్య కృష్ణ।
ప్రతిభవ మపరాద్ధు ర్ముగ్ధసాయుజ్యదోఽభూః
వద కిమపద మాగ స్తస్యతేఽస్తి క్షమాయాః॥

(రామావతారమున వాయసమునందును కృష్ణావతారమున శిశుపాలుని యందును కూడ క్షమను చూపి ప్రతిఅవతారమునందును అపరాధముచేసిన వారలకుకూడ మోక్షమునొసంగితివి. నీదయకు పాత్రముకాని అపరాధమేది? ఎంతటి అపరాధము ను చేసినవాడైనను నీదయకు పాత్రుడే) అనెడి స్తోత్రరత్నములోని శ్లోకమును;

వాత్స్య కులతిలక శ్రీ వీరరాఘవాచార్య కృతమైన శ్రీ గుణసుధాసారలహరీ స్తోత్రము నందలి

శ్లో ॥ తవ క్షాన్తిం భట్టారకగురు రవాదీత్తవనుతా
వకస్మాదుద్భూతా మిహజననిః కేచి జ్జడధియః ।
ప్రసన్నాహీత్యుక్తేః ప్రణిపతనతో మైథిలసుతా
సహేతు స్సాపి స్యాదితి జగదు రాపాతమతితః ॥

(జననీ, నీయొక్క స్తోత్రమునందు భట్టారకగురువర్యులు నీదయకు కారణము లేదనియు, అకస్మాత్తుగా జనించుననియు చెప్పియున్నారు. కాని కొంతమంది జడులు అలోచనలేనివారై 'ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీజనకాత్మజా' (జానకీవూత నమస్కారముతో ప్రసన్నురాలగును.) అను త్రిజట వచనమును అపార్థము చేసికొని నీ కరుణకూడ సహేతుకమే అని చెప్పిరి.)

శ్లో ॥ స్వబుద్ధ్యైవ ప్రోక్తం ప్రణతసుముఖీతి త్రిజటయా
నచైతద్ధర్మస్తే నళినదళ నేత్ర ప్రియతమే!
యదేకాక్షీ ప్రఖ్యాయత బహుళ హింసానవధిక
ప్రవృద్ధార్ద్రాగస్కాః పవనతనయా ద్రక్షితవతీ ॥

(ఓ జననీ, నీయందు మహాపరాధములను చేసిన 'ఏకాక్షి' మొదలైన రాక్షస స్త్రీలను వారు శరణు పొందకుండగనే హనుమంతుని బారినుండి రక్షించి, ఈమెను శరణుపొందుడు ఈమె మిమ్ము రక్షించును' అను త్రిజట వాక్యమును వమ్ముచేయుట నీకు తగదు) అనెడి ఈ రెండు శ్లోకుములున్ను;

మరియు శ్రీమద్రామాయణము నందలి

'త్రీన్లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణంగతః :'

(మూడు లోకములను తిరిగి తిరిగి మరల ఆ రామునే శరణు వేడెను) అను కాకాసుర ఘట్టమునందలి వాక్యమును;

*విభీషణస్తు ధర్మాత్మా నతు రాక్షసచేష్టితః ।*
*త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః ॥*

(రాక్షసస్వభావము లేక ధర్మాత్ముడైయున్న విభీషణుడు దారాపుత్రాదులను వదలి రాముని శరణుపొందెను.) అను విభీషణుశరణాగతి యందలి శ్లోకమును ఇచట

అనుసంధేయములు. అట్టి నిర్హేతుకజాయమాన కృపాకటాక్ష వీక్షణములను ప్రతిదినము నిరంతరము ఆర్ద్రాపరాధములను చేయుచున్న తమ (మన) బోట్లయందు ప్రసరింపజేసి తమ్ము(మనలను) ధ్ధరించి సుఖపెట్టి సంతోషపెట్టవలసినదిగా శ్రీపరాశర భట్టర్ లక్ష్మీదేవిని ప్రార్థించుచున్నారు.

ఇది వీరి వినయపరాకాష్ఠ.

సంస్కృత వ్యాఖ్య:- మాతరితి। హే మాతః నిరుపాధికజనని! మైథిలి కృపైక మూర్తితయా సీతావతారం కుర్వాణే। శ్రీరంగేశ్వరి! త్వయి త్వద్విషయే, తదైవ హనూమదాగమనా వ్యవహిత పూర్వసమయఏవ, రావణస్య తదానీమేవ నాశాదితి భావః తథైవేతిపాఠే తథైవరామ రాహిత్యేనే త్యర్థః। రావణ జీవనదశాయాం యథా తథైవ తన్నాశ దశాయామపీతి వార్థః। ఆర్ద్రాపరాధాః రావణ నాశ పరిజ్ఞానాత్ హనుమదాగమనపర్యన్త మవిరతాపరాధాః రాక్షసీః ఏకాక్ష్యాదికాః పవనాత్మజాత్ తిర్యగ్భూతాత్ స్వతో మర్కటాత్ రక్షన్త్యా పాలయన్త్యా ఏతేనబుద్ధి శూన్యత్వం దుస్సాధ్యత్వంచ వ్యంజితమ్। కాకం కాకాసురం తం 'విభీషణస్తు ధర్మాత్మా నతు రాక్షసచేష్టితః' ఇతి ప్రసిద్ధ విభీషణంచ। శరణమిత్యుక్తి క్షమా 'త్రీన్‌లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః' త్యక్త్వాపుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణంగతః ఇతి శరణవరణోక్తి క్షమా రక్షతః పాలయతః ఉభయోః శరణవరణం రక్షణ నిమిత్తం సూచితమ్। 'వధ్యం ప్రపన్నం న ప్రతిప్రయచ్ఛన్తి' ఇతిశ్రుతేః। రామస్య త్వత్ప్రియస్య గోష్ఠీ పరిషత్ లఘుతరాలఘీయసీ కృతా। రామోలఘూకృత ఇతివక్తవ్యే గోష్ఠ్యాంతదుక్తిః అపచారభియా। రామస్య గుణపరిషద్వా। మందబుద్ధేః దుస్సాధ్యాత్ నిర్నిమిత్త మార్ద్రాపరాధ రక్షణశీలయా త్వయా, నిమిత్తమపేక్ష్య రక్షతో రామస్య గుణగోష్ఠీ లఘూకరణం యుక్తమితి తాత్పర్యమ్। సా ఆర్ద్రాపరాధ సహత్వరూపేణ ప్రసిద్ధా ఆకస్మికీ నిర్హేతుకా। తవక్షాన్తిః సాంద్రమహాగసః నిరంతర మహాపరాధాన్ అస్మాన్ సుఖయతు సుఖినః కరోతు। సా క్షమైవాస్మాక మాశ్వాసహేతు రితిభావః।

అత్ర కేచిత్ - 'ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా' ఇతి శ్రీరామాయణ వచనేన లక్ష్మీక్షమాయా అపి ప్రణిపాత హేతుకత్వ ప్రతీతేః ఆకస్మికత్వం నాస్తీతి వదన్తి। తదాపాత ప్రతీతి విలసితమ్। తథాహి: కళ్యాణ స్వప్నదర్శిన్యా త్రిజటయా 'మైథిల్యాః శ్రేయఃకాలః సమాగతః, తదేనాం మాపీడ్యత। ప్రత్యుత శరణం గచ్ఛత। రావణే హతేఽపి యుష్మానియం రక్షిష్యతీ' త్యుక్త్వా 'మహాపరాధకారిణీః అస్మాన్కథం రక్షిష్యతీతి తదాశంకాం 'ప్రణిపాత ప్రసన్నాహి మైథిలీ' ఇత్యౌచిత్యాత్ స్వబుద్ధ్యైవ పరిహృతవతీ। నతు ప్రణిపాత ప్రసన్నతా మైథిలీధర్మః। అతఏవ రావణవధానంతరమపి తద్వధాపరిజ్ఞానేన హింసమానాః రాక్షసీః హనూమతో రక్షితవతీ। అతఏవ స్వవిషయే

మహాపరాధం కాకాసురం విముఖ పతితం భగవత్పాదారవిందయో ర్యోజితవతీ। అత స్సాధూక్తమేవ క్షాన్తి స్తవాకస్మికీతి। ఏతచ్ఛంకాపరిహారావస్మదుక్త శ్రీగుణ సుధాసార లహరీ స్తోత్రే ప్రదర్శితా।

1. తవక్షాన్తిం భట్టారకగురు రవాదీత్తవనుతా
వకస్మాదు ద్భూతా మిహజనని! కేచిజ్జడధియః।
ప్రపన్నాహిత్యుక్తేః ప్రణిపతనతో మైథిలసుతా
సహేతుస్సాపి స్యాదితి జగదు రాపాత మతితః॥

2. స్వబుద్ధ్యైవ ప్రోక్తం ప్రణత సుముఖీతి త్రిజటయా
నచైతద్ధర్మస్తే నళినదలనేత్ర ప్రియతమే।
యదేకాక్షీ ప్రఖ్యాయత బహుళహింసానవధిక
ప్రవృద్ధా ర్ద్రాగస్కాః పవనతనయా ద్రక్షితవతీ॥ ఇతి।

అ :- అస్మాకం భగవదుద్దేశ్యత్వం త్వత్సంబంధ నిబంధనమ్। అత స్తద్దర్శన తదాశ్రయణ తత్కైంకర్యకరణ తజ్జనితానన్ద బాష్పాదీ న్యస్మాకముపపద్యన్త ఇత్యాహ।

శ్లో॥ మాతర్లక్ష్మి యథైవ మైథిలజన స్తేనాధ్వనా తే వయం
త్వద్దాస్యైక రసాభిమాన సుభగై ర్భావై రిహాముత్రచ।
జామాతా దయిత స్తవేతి భవతీ సమ్బన్ధ దృష్ట్యా హరిం
పశ్యేమ ప్రతియామ యామచ పరీచారాన్ ప్రహృష్యేమచ॥ ౫౧

అ:- మాతః=జగజ్జననివైన, లక్ష్మి=ఓ లక్ష్మీదేవీ, తే=నీకు, మైథిలజనః= మిథిలా నగరవాసియైన జనము, యథా=ఎట్లో, తేన అధ్వనా=అదే మార్గమున (అట్లే), వయం అపి=మేముకూడ, (స్వజనులము), త్వద్దాస్యైక...సుభగైః, త్వత్= నీ యొక్క, దాస్య=దాస్యమునందలి, ఏకరసాభిమాన=ముఖ్యమైన ప్రీతి అభిమానము లతో, సుభగైః=సుందరములైన, భావైః=భావములతో, జామాతా ఇతి= అల్లుడుఅని (జనక విష్ణుచిత్తులకు శ్రీరామ శ్రీరంగనాథరూపముగా), తవ దయితః ఇతి=నీకు భర్తయు అనెడి, భవతీసంబంధదృష్ట్యా=నీకు సంబంధించిన వాడను దృష్టితోనే, హరిమ్= విష్ణువును (శ్రీరామ శ్రీరంగనాథులను), ఇహ=ఈ లోకము నను, (లీలా విభూతి యందును) అముత్రచ=వైకుంఠముననను (నిత్యవిభూతి యందును), పశ్యేమ= చూచుచుందుము, ప్రతియామ=శరణు పొందుదుము, పరీచారాన్=కైంకర్యములను, యామ=చేయుదుము, చ=మరియు, ప్రహృష్యేమ=సంతోషించెదము.

తా :- ఓ లక్ష్మీదేవీ, నీకు మిథిలావాసులు (సీతగా అవతరించినపుడు) ఎట్టి స్వజనమో మేమును అట్లే. నీసేవ చేయుచుంటిమను భావముతోనే శ్రీరామ శ్రీరంగ నాథాది రూపములలో నున్న శ్రీమన్నారాయణుని ''జామాత'' అనియు, 'శ్రీకాంతు'

డనియు, ఇహలోకమునను, పరలోకముననుకూడ, చూచుచు, శరణు వేడుచు, కైంకర్యముచేయుచు, సంతోషించు చుంటిమి.

వి :- ఇచట శ్రీరాముని విషయమున లీలావిభూతియు శ్రీరంగ రాజవిషయమున నిత్యవిభూతియు చెప్పబడినవి. మిథిలానగరవాసులు శ్రీరాముని జనకమహారాజు యొక్క అల్లుడుగాను, సీతామాత భర్తగాను చూచి కైంకర్యాదులుచేసి ఆ విధముగా లక్ష్మీదేవిని సేవించిన యానందము ననుభవించుటయే గాక, ఇహపర సౌఖ్యములను కూడ పొందిరి. అట్లే శ్రీభట్టరులుకూడ శ్రీరంగనాథుని విష్ణుచిత్తుల యల్లుడుగాను, శ్రీరంగనాయకి (గోదాదేవి) భర్తగాను, చూచుచు సేవచేయుచు ఇహలోకమునను పరలోకమునను కూడ సంతోష సౌఖ్యము లనుభవించునట్లు అనుగ్రహించుమని లక్ష్మీదేవిని ప్రార్థించుచున్నారు. ఇచటకూడ పైవలెనే శ్రీరంగనాథుని యొక్క సేవచేసిన లక్ష్మీదేవియొక్క సేవ చేసినట్లే యగును. అందువలననే ఇచట వర్ణింపబడినది శ్రీరామావతారములోని విషయమే అయినను 'లక్ష్మి' అను సంభోధనము సార్థక మగు చున్నది. ఆమె సీతామాతగా మిథిలానగరవాసులను ఎట్లు స్వజనముగా స్వీకరించినదో, అట్లే శ్రీరంగనాయకిగా తమను కూడ స్వజనముగా చూడుమని ప్రార్థించుట ఇట గ్రంథకర్త యొక్క ముఖ్యోద్దేశము. తాము శ్రీరంగనాయకి యొక్క స్వజనముగా గ్రహింపబడినపుడు తమయందు దోషములున్నను ఆమె వాటిని (తరువాతి శ్లోకములో చెప్పుకొన బోవువిధముగా) దోషములుగా స్వీకరింపనీయ దని భావము. ఆ విధముగా 'మాతః' అను సంబోధన విశేషణము కూడ సార్థక మైనది. ఇచట 'అంతఃపురమునకు సంబంధించిన వారు నేరముచేసినను దానినేదో వ్యాజమిడి రాజులు సహించునట్లు, మనము శ్రీదేవి సంబంధులమగుటచే మన గొప్ప యపరాధములను భగవంతుడు క్షమించుననుట- ఈ శ్లోకమునందలి యాంతరంగి కాభిప్రాయమని వేదాంతదేశికులు తమ రహస్యత్రితయసారమున ద్వయాధికారము నందు చెప్పియున్నారు ' అని సువర్ణ కుంచికాకారుల వ్యాఖ్య.

సంస్కృత వ్యాఖ్య :- మాతరితి। హే మాతః హే జనని! లక్ష్మి! తే తవ మైథిలజనః యథాస్వీయ ఇతిశేషః తేనాధ్వనా మార్గేణ తద్వదిత్యర్థః। వయమపి స్వీయా ఇత్యర్థః । తతః కిమిత్యత్రాహ- త్వదితి। త్వద్దాస్యైక రసాభిమాన సుభగైః త్వద్దాస్యే త్వత్కైంకర్యే ఏకరసః ముఖ్యప్రీతిః త్వదభిమానేన భగవత్కైంకర్యేఽపి త్వత్కైంకర్య బుద్ధ్యై త్యర్థః।

సుభగైః భావైః శోభనైః అభిప్రాయైః, జామాతేతి జనకవిష్ణుచిత్తయో రితిశేషః। మైథిలజనాభిప్రాయేణ జనకోక్తిః। అస్మదభిప్రాయేణ శ్రీ విష్ణుచిత్తోక్తిః। తవ త్వదీయ ఇతి, భవతీసంబంధదృష్ట్యా భవత్యా స్సంబంధజ్ఞానేన, 'భూసత్తాయా' మితి ధాతోః,

'లటఃశతృశానచా' వితిశత్రాదేశే 'ఉగితశ్చేతి' జీపి 'భవతీ' ఇతిరూపమ్। హరిం శ్రీరామం శ్రీరంగనాయకంచ ఇహాముత్రచ లీలావిభూతౌ నిత్యవిభూతౌచ । పశ్యేమ సదాదర్శినో భవేమ । ప్రతియామ శరణం గచ్ఛేమ। పరీచారాన్ కింకరవృత్తీః యామ భజేమచ । ప్రహృష్యేమ ప్రకృష్టానందభావా భవేమ। మైథిలజనః స్వప్రభు జనక జామాతేతి తవప్రియ ఇతిచ శ్రీరామం యథోపచరన్తి తథా ప్రపన్నజనకూటస్థ, త్వత్పితృ విష్ణుచిత్తజామాతేతి, త్వత్ప్రియ ఇతిచ, శ్రీరంగరాజం వయముపచరామ ఇతిభావః।

అ :- 'చంద్రమా మనసో జాతః' ఇత్యుక్తరీత్యా శీతాశయేఽపి భగవతి యావత్కాల మవిచ్ఛిన్న మహాపరాధానస్మానవలోక్య మనాజ్ఞ్నిగ్రహాభిముఖం మనః కుర్వతిసతి, తదనుచితమితి తం తతః కర్మణో నివర్త్య వాత్సల్యాతిశయాత్ త్వమస్మాన్ స్వజనయసీత్యాహ।

శ్లో ॥ పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే
హితస్రోతో వృత్త్యా భవతిచ కదాచిత్ కలుషధీః ।
కిమేత న్నిర్దోషః క ఇహ జగతీతి త్వముచితైః
ఉపాయై ర్విస్మార్య స్వజనయసి మాతా తదసి నః ॥ ౫౨

అ :- హే జనని= ఓ మాతా! లక్ష్మీదేవీ, త్వత్ప్రేయాన్= నీ వల్లభుడైన శ్రీరంగ నాథుడు, పరిపూర్ణాగసి= సంపూర్ణాపరాధములుకల, జనే= మాబోటి చేతనుల యందు, పితాఇవ= కుమారునియందు తండ్రివలె, హితస్రోతో వృత్త్యా= హితైక పరుడగుటవలన, కదాచిత్= ఒకానొకప్పుడు, కలుషధీఃచ= కోపమును పొందినివాడు కూడా, భవతి= అగుచున్నాడు, ఏతత్= ఇది, కిమ్= ఏమిటి? (కోపము ఎందులకు?), ఇహజగతి= ఈ ప్రపంచమున, నిర్దోషః= దోషరహితుడు, కః= ఎవడు? ఇతి= అని, త్వమ్= నీవు, ఉచితైః= తగిన, ఉపాయైః= ఉపాయములతో, విస్మార్య= అతనిని మరపించి, (కోపమును తగ్గింపచేసి), స్వజనయసి= శ్రీహరికి స్వజనులనుగా చేయు చున్నావు, తత్= అందువలననే, నః= మాకు, మాతా అసి= తల్లివైతివి.

తా :- ఓ జననీ! జనకుడైన శ్రీహరి, నిత్యము విపరీతముగా దోషములు చేయుచున్న మాయందు, హితముచెప్పు సందర్భమున, అప్పుడప్పుడు కోపమును వహించు చుండును. ఇది తాత్కాలికము, సహజముకాదు. అయినను ఆ సమయమున నీవు 'ప్రభూ! ఎందులకు మీకీకోపము? ఈ ప్రపంచమున దోషములు లేని మనుజు లుందురా? శాంతింపుడు' అనియు, ఇంకను అనేకరకములైనట్టియు అనునయ వాక్యములతోను, ఆలోకనాలాపాది విభ్రాస విన్యాసములతోను శ్రీహరిని శాంతింప

చేసి, మమ్ములను నీతోపాటు వారికికూడ స్వజనులనుగాచేసి, నీ మాతృ కృత్యమును నెరవేర్చుచున్నావు. అందువలననే నీవు మాకు తల్లివైతివి.

వి :- తండ్రి హితమును చెప్పును, తల్లి ప్రియమును కలుగచేయును. హితము తాత్కాలికముగా కష్టమును కలిగించినను చివరకు మంచిని కలుగచేయును. 'హితం మనోహారిచ దుర్లభం వచః' (హితమైనదియు మనస్సునకు నచ్చునదియు అయిన వాక్కు దుర్లభము) అని భారవికవి సూక్తి. ప్రియము తాత్కాలిక సుఖమును కలుగ చేయును. కుమారుడు ఏదైన తప్పు చేసినచో తండ్రికోపపడగా, తల్లి అతనిని శాంతింపచేయును. అదియే ఈ శ్లోకమున చెప్పబడినది. శ్రీహరియొక్క హృదయము అతిశీతలము. శీతకరుడైన చంద్రునికే పుట్టినిల్లు. 'చంద్రమా మనసోజాతః' అని శ్రుతి. అట్టి శీతలమైన హృదయమునందు కోపము పుట్టదు. అయినను ప్రతిదినము ఈ లీలావిభూతియందు జనులు చేయు వేలకొలది మహాపరాధములను సహించలేక వారికి హితమును కలుగచేయు నుద్దేశ్యముతో శ్రీహరికి తాత్కాలికముగా కోపము రావచ్చును. 'యాచితోఽపిసదాభక్తై ర్నాహితం కారయేత్ హరిః' (భక్తులుకోరినను శ్రీహరి వారికి అహితమును చేయడు) అని గదా ప్రసిద్ధి. ఆ విధమైన హితమును చెప్పుటలో వచ్చిన కోపమును శాంతింపచేయుటకు తల్లియే తగినది. ఇచట లక్ష్మీదేవి ఆ ప్రయత్నమును చేయుచున్నది. ఆ ప్రయత్నములో భాగముగా ముందుగా 'ప్రభూ, మీకెందులకీ కోపము? దోషభూయిష్ఠమైన ఈ లీలాభూతిలో దోషములు లేని వారెవరు? కావున మీభక్తులైన వారలయందు కోపమునుమాని శాంతిని పొందుడు. లేనిచో ఏతత్సంబంధము వలన హేయమైన కోపమును పొందిన దోషము మీకుకూడ సంక్రమించగలదు' అని అనునయించును. అప్పటికిని శాంతించనిచో తన యొక్క శృంగార చేష్టలతో శ్రీహరి మనస్సు నాకర్షించి కోపశాంతిని కలిగించి పుత్రస్థానీయులైన ఈ జనులనందరను శ్రీహరికి స్వజనులనుగా చేయును. ఆ విధమైన ప్రయత్నమును కలుగచేయునది కనుకనే ఆమె తల్లియైనది.

ఇచట 'హిత స్రోతో వృత్త్యా' అను పదమునందలి 'స్రోత' శబ్దము 'శ్రీహరి కేవలము హితము చెప్పుటకే కోపపడు ననియు, ఆ కోపము తాత్కాలికమైనదియు, సహజము కాదనియు, మనస్సు కరుణార్ద్రమనియు' సూచించుచున్నది. క్రిందటి (51) శ్లోకములో చెప్పబడిన స్వజనత్వము తత్సాధనకై లక్ష్మియొక్క పురుషకారము ఇందు ఉదాహరణ పూర్వకముగా వివరింపబడినవి.

సంస్కృత వ్యాఖ్య :- పితేతి । హే జనని! శ్రీః । త్వత్ప్రేయాన్ తవ ప్రియః శ్రీరంగరాజః పరిపూర్ణాగసి సంపూర్ణాపరాధే జనే చేతనవర్గే పితేవ పుత్ర ఇతిశేషః। హితస్రోతోవృత్త్యా తత్కాలాప్రియం పథ్యపరవసాయిచ హితం తదేవ స్రోతః ప్రవాహః

తత్రవృత్త్యా వర్తనేన హితైకపరత్వా దిత్యర్థః । 'యాచితోఽపి సదాభర్త్రా నాహితం కారయేద్ధరిః' ఇత్యుక్తేః । కదాచిత్ కదాపి సన్తత మనుకూల ఏవసన్ మహాపరాధ దర్శనేన కదాపి సమయే కలుషధీః కుపితమనాః భవతిచ భవత్యపి । నతు కుపితమనస్త్వం తస్య నైజమితి భావః । తద్దర్శిన్యాః శ్రియో వ్యాపారమాహ । కిమేతదితి । ఏతత్ ఇదం కాలుష్యం కిం కింనిబన్ధనమ్? అనుచిత మిత్యర్థః । అనుచితత్వ ముపపాదయతి - నిర్దోష ఇతి । ఇహ దోషైకాశ్రయే జగతి లీలావిభూతౌ నిర్దోషః కః? నకోఽపీత్యర్థః । ఏతద్విభూతి సంబంధేన హేయప్రతిభటస్య తవాపిదోషః ప్రసజ్యేదితి భావః । అతో దోషదర్శనేన తవ మనః కాలుష్యం నయుక్తమిత్యేవం ప్రకారేణ ఉచితైః అపరాధ క్షమాపణయోగ్యైః, ఉపాయైః ఆలోకాలాప నీవీశ్లథనాదిభిః విస్మార్య, తస్య దోషా దర్శిత్వమాపాద్య నః అస్మాన్ స్వజనయసి । భగవతః స్వత్వాభిమాన గోచరాన్ కరోషి । తత్ తస్మాత్ కారణాత్ ప్రియైకపరతయేత్యర్థః । త్వం మాతాసి । పితుః హితపరత్వం మాతుః ప్రియపరత్వంచ సుప్రసిద్ధం యువయోః దృష్టమితిభావః॥

అ:- 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే'।'అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ'। ఇతి ప్రమాణద్వయోక్త ప్రకారేణ సంశ్రిత రక్షణాయ శ్రీ శ్రీశౌ కృపా స్వాతంత్ర్యాభ్యాం హేతుభ్యాం లీలావిభూతావవతీర్య సుకుమార వపుర్లపన విరహక్లేశాదిక మనుభూత వన్తా వత ఏతత్కృపా స్వాతంత్ర్యే ధిగితి తద్విగ్రహ ప్రేమపార వశ్యాదాహ।

శ్లో॥ నేతు ర్నిత్యసహాయినీ జనని నస్త్రాతుం త్వమత్రాగతా
లోకే త్వన్మహిమావబోధ బధిరే ప్రాప్తా విమర్దం బహు ।
క్లిష్టం గ్రావసు మాలతీమృదు పదం విశ్లిష్య వాసో వనే
జాతో ధిక్ కరుణాం ధిగస్తు యువయోః స్వాతన్త్ర్య మత్యఙ్కుశమ్॥53

అ :- హే జనని= ఓ లక్ష్మీదేవీ, నేతుః= జగన్నాయకుడైన శ్రీమన్నారాయణు నకు, నిత్యసహాయినీ= అన్ని అవతారములలోను సహాయభూతురాలవై, త్వమ్= నీవు, నః= మమ్ములను, త్రాతుమ్= రక్షించుటకు, త్వన్మహిమావబోధబధిరే= నీయొక్క మాహాత్మ్యమును తెలిసికొనలేనట్టి, అత్ర= ఈ లోకమున (లీలావిభూతియందు) ఆగతా= (సీతగా) అవతరించినదానవై, బహు= గొప్పదైన, విమర్దమ్= క్లేశమును, ప్రాప్తా= పొందితివి, మాలతీమృదు= జాజివలె మెత్తనైన, పదమ్= పాదద్వయము, గ్రావసు= రాళ్ళయందు, క్లిష్టమ్= క్లేశపెట్టబడినది, వనే= వనమునందు, విశ్లిష్య= విరహమునుపొంది, వాసః జాతః= నివసించబడినది, అత్యంకుశమ్= హద్దులేని, యువయోః= మీ ఇద్దరియొక్క, (లక్ష్మీనారాయణుల యొక్క) కరుణాంప్రతి=

కరుణను గురించి, ధిక్ అస్తు=నిందఅగుగాక, అత్యంకుశమ్=నిరంకుశమైన, స్వాతంత్ర్యమ్=స్వాతంత్ర్యమును గురించి కూడ, ధిక్ అస్తు=నిందఅగుగాక.

తా :- జగజ్జననివైన ఓ లక్ష్మీదేవీ! దుష్టశిక్షణ శిష్టరక్షణ కార్యక్రమమున శ్రీమన్నారాయణుని ప్రతిఅవతారమున నీవుకూడ మమ్ములను రక్షించుటకై అవతరించితివి. కాని నీయొక్క మహిమను లోకము తెలిసికొనలేక పోయినది. పాషాణములయందు నీ సుకుమార పదద్వయము బాధపెట్టబడినది, కాంతునితో విరహము కూడ అనుభవింపబడినది. ఇదియంతయు మీయొక్క అపార కరుణకు నిరవధిక స్వాతంత్ర్యమునకును నిదర్శనములు. అట్టి క్లేశమునకు కారణములైన ఈ కరుణాస్వాతంత్ర్యములకు నిందఅగుగాక.

వి:- 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥'

అని గీతలో చెప్పినట్లుగా శ్రీమహావిష్ణువు భూమియందు అవతరించిన ప్రతి అవతారమునందును లక్ష్మీదేవికూడ వారితో అవతరించి మనలను రక్షించుచున్నది. ఈ దుష్టశిక్షణ శిష్టరక్షణ కార్యక్రమము వారిద్దరికిని కర్మాధీనము కాదనియు వారు స్వేచ్ఛగా కల్పించుకొన్నదనియు ఇదివరలోనే తెలిసికొని యుంటిమి. అటువంటి పరిస్థితులలో కూడ కష్టముల ననుభవించుట పరస్పర విరహము ననుభవించుట వారిద్దరి యొక్క స్వాతంత్ర్యమునకును నిరుపమాన కరుణావిశేషమునకును నిదర్శనము.

ఆ విధమైన కరుణయు అధిక స్వాతంత్ర్యమున్ను ఇన్ని అవతారములకు ఇన్ని కష్టములకు కారణములు కాబట్టి అట్టి కరుణాస్వాతంత్ర్యము లకు నిందయగుగాక అని. ఇచట ఆ కరుణా స్వాతంత్ర్యములను నిందించుట ప్రధానముకాదు. అటువంటి స్థితిలోకూడ జనులు మీ మహిమలను తెలిసికొన లేక పోయిరను బాధ ప్రధానము. ఆ బాధను 'బధిర' పదము వ్యక్తము చేయుచున్నది. ఆ విధముగా జననీజనకులైన లక్ష్మీనారాయణుల యొక్క సుకుమార దివ్యమంగళ విగ్రహములయందు గ్రంథకర్తృ ప్రేమాతిశయము వ్యక్తమగుచున్నది.

'గట్టెక్క తెలియని మాబోటివారిని కాపాడుటకై కష్టములను సరకుగొనక సౌకుమార్యమును కనుగొన లేని ఈ పాడుభూమిలో అవతరించినది చాలదా? ఆపైని పడిన కష్టము లెన్నియో? బండరాతిపై మృదువైన పాదములతో నడచుట సంభవించినదే, అయ్యో! ఇట్లవతరించి పడరాని కష్టములు పడుటకుకారణము కరుణయేగదా! అట్టి కరుణ ఎందులకు? అట్టి కరుణ యుండిన నుండుగాక.

అచ్చటనుండియే రక్షింపరాదా? ఇచట నవతరించియే కావవలయునా? 'ఏల వచ్చితివి? మమ్ముల నడుగు వారెవరు? అను స్వాతంత్ర్యమే ఇందులకు కారణము. అదలించువారులేని స్వాతంత్ర్యము త్యాజ్యమే అని భావము. కరుణయుండినను స్వాతంత్ర్యము లేనిచో రక్షణ విషయమై ప్రవృత్తిలేక యుండును. కనుక స్వాతంత్ర్యము కూడ నిందార్హమనుటయు తగును'. అని ఈ శ్లోకమున సువర్ణకుంచికవ్యాఖ్య.

మరియు శ్రీస్తుతిలోని :-

శ్లో ॥ 1. భృగోఃఖ్యాతాం సముత్పన్నా శ్రీః పూర్వముదధేః పునః ।
దేవదానవయత్నేన ప్రసూతామృతమంథనే ॥

2. ఏవం యదా జగత్ స్వామీ దేవదేవో జనార్దనః ।
అవతారం కరోత్యేషా తదా శ్రీః తత్సహాయినీ ॥

3. పునశ్చ పద్మా సంభూతా హ్యాదిత్యోఽభూ ద్యదాహరిః ।
యదాచ భార్గవోరామః తదాభూ ద్ధరణీ త్వియమ్ ॥

4. రాఘవత్వేఽభవత్సీతా రుక్మిణీ కృష్ణజన్మని ।
అన్యేషు చావతారేషు విష్ణోరేషానపాయినీ ॥

5. దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ ।
విష్ణోర్దేహానురూపాంవై కరోత్యేషా త్మనస్తనుమ్ ॥

(మొదట భృగువంశమున జనించిన లక్ష్మి తరువాత దేవదానవ యత్నముచేత సముద్రము నుండి పుట్టినది. అట్లే శ్రీమన్నారాయణుడు ఏయే అవతారమును దాల్చిన అయా అవతారమున లక్ష్మికూడ ఆయనకు సహాయురాలైనది. హరి ఆదిత్యుడుగా అవతరించినపుడు 'పద్మ' యైనది. పరశురాముడుగా అవతరించినపుడు 'ధరణి' యైనది. రాముడుగా జన్మించినపుడు 'సీత' యైనది. శ్రీకృష్ణుడుగా జన్మించినపుడు 'రుక్మిణి' యైనది. ఇతరములైన అవతారములయందు కూడ ఈమె విష్ణువును విడువనిదై, ఆయనయొక్క 'దేవత్వమున' దేవదేహమును, మనుష్యత్వమున 'మనుష్యదేహమును' దాల్చి శ్రీమహావిష్ణువునకు అనురూపముగా అనుకూలముగా నున్నది) అనెడి శ్లోకములు అనుసంధేయములు.

సంస్కృత వ్యాఖ్య :- నేతురితి । హే జనని! శ్రీః । నేతుః నాయకస్య నిత్యసహాయినీ త్వం నః అస్మాన్ అకించనాన్ త్వత్స్థలా సన్నిహితాన్వా త్రాతుం రక్షితుం త్వన్మహిమావబోధబధిరే త్వద్వైభవజ్ఞానశూన్యే అత్ర లోకే లీలావిభూతౌ అగతా సమవతీర్ణాసతీ బహుఅధికం విమర్దం ఆయాసం ప్రాప్తా గతవతీ । ఆయా సప్రాప్తి ముపపాదయతి । క్లిష్టమితి । మాలతీమృదు జాతికుసుమ సుకుమారం పదం

పదద్వయం గ్రావసు పాషాణేషు క్లిష్టం క్లేశం ప్రాప్తవత్। వనే విశ్లిష్య విరహం ప్రాప్య వాసో జాతః వర్తనం జాతం। నిత్యానపాయినోః యువయోః పృథగ్వర్తసంజాతమ్। అత్యంకుశం అమర్యాదం విగ్రహసౌకుమార్య విరోధినీం యువయోః కరుణాం ప్రతి ధిగస్తు నిందా భవతు। అత్యంకుశం స్వాతంత్ర్యం చ ప్రతి ధిగస్తు నిందా భవతు తదుభయ ప్రయుక్తత్వా దుభయో రేతాదృశస్య క్లేశస్యేతి భావః।

సుకుమార భగవద్దివ్యమంగళ విగ్రహే ప్రేమపారవశ్యాత్ ధిక్ కరుణాం ధిక్ స్వాతంత్ర్యమితి స్తోతు స్తదుభయనిన్దా యుక్తైవేతి మంతవ్యమ్॥

అ :- సంశ్రితరక్షణోపయుక్తం శ్రియః స్వాధీనపతికాత్వం ఆహ।

శ్లో॥ అధిశయితవానబ్ధిం నాథో మమన్థ బబన్ధ తం
హరధనురసౌ వల్లీ భఞ్జం బభఞ్జచ మైథిలి! ।
అపి దశముఖీం లూత్వా రక్షః కబన్ధ మనర్తయత్
కిమివ న పతిః కర్తా త్వచ్చాటు చుఞ్చు మనోరథః॥ ౫౪

అ :- హే మైథిలి= జానకీ మాతవైన ఓ లక్ష్మీదేవీ, అసౌ నాథః= నీ వల్లభుడైన శ్రీరంగనాథుడు, త్వచ్చాటు చుంచు మనోరథః(సన్)= నీకు ప్రియమును కలుగ చేయుట యందే ఆసక్తమైన మనస్సుకలవాడై (నీకు ప్రియమును చేయకోరువాడై), అబ్ధిమ్= సముద్రమునందు, అధిశయితవాన్= శయనించెను, తమ్= ఆ సముద్రమునే, మమంథ= మథించెను, చ= మరియు, బబంధ= బంధించెను, హరధనుః= శివ ధనుస్సును, వల్లీభంజమ్= లతను విరచినట్లుగా, బభంజచ= విరచెను కూడ, దశముఖీమ్= పది తలల సమూహమును, లూత్వా= నరికి, రక్షః కబంధమ్= రావణుని శరీరమును, అనర్తయత్=(యుద్ధరంగమున) నాట్యమాడునట్లు చేసెను, పతిః= నీ భర్త, కిమివ న కర్తా= ఏమిచేయలేడు? (దు)?

తా :- ఓ లక్ష్మీదేవీ! (జానకీ), నీకు ప్రియమును కలుగచేయవలయు ననెడి ఉద్దేశ్యముతోనే నీ భర్తయైన శ్రీ మహావిష్ణువు 'నీయొక్క పుట్టినిల్లు' అను ఉద్దేశ్యముతో పాలసముద్రమున శయనించియున్నాడు, మరియు నీకొఱకే ఆ సముద్రమునే మథించినాడు బంధించినాడుకూడ। శివ ధనుస్సును కూడ తీగను విరచినట్లుగా (అవలీలగా) విరచినాడు. రావణుని పదితలల సముదాయమును కూడ నరికి అతని శరీరమును రణరంగమున నాట్యమాడునట్లు చేసినాడు. ఇంతియేగాక అశక్యమైన ఏపనినైనను నీయందు ప్రీతితో చేయగలడు.

వి :- ఈ శ్లోకమున కూడ లక్ష్మియు జానకియు ఒకటే అయినట్లును శ్రీమన్నారాయణుడు రామాదులు ఒకటే అయినట్లును లక్ష్మియొక్క అనుసరణకొరకే

శ్రీమన్నారాయణుడు సముద్రశయన మథన బంధనాది కార్యములను చేసినట్లును వర్ణింపబడినది. ఆ విధముగా లక్ష్మియొక్క స్వాధీనపతికాత్వము వ్యక్తమగుచున్నది. ప్రతిఅవతారమునందును తనను అనుసరించుచున్న లక్ష్మిని తాను కూడ అనుసరించి ఆమెకు ప్రీతిని కలుగచేయుట శ్రీమన్నారాయణుని పరమధర్మము, తన్నిర్వహణకై ఆతడు అనేకరకములైన అశక్యములైన కార్యములనే అతిప్రీతితో చేసినాడు. ఇంతను ఏమైనను చేయగలడు కూడ. మరియు హనుమంతునిచే చెప్పబడిన

'యదిరామ స్సముద్రాన్తాం మేదినీం పరివర్తయేత్।
అస్యాహేతో ర్విశాలాక్ష్యాః యుక్తమిత్యేవ మేమతిః ॥'

(శ్రీరాముడు సముద్రపర్యంతము ఉన్న ఈ భూమిని ఒకవేళ తలక్రిందులు (మార్పు) చేసినను అది ఆ జానకి కారణముగా యుక్తమనియే భావింతును) అను ఈ శ్లోకముకూడ ఇట జ్ఞాపకము చేసికొనతగినది. ఇచటనే ఒక సందేహము కలుగ వచ్చును, 'సముద్రమునందు శయనించుట, ఆ సముద్రమునే మథించుట, శివునివిల్లు విరచుట, సముద్రమును బంధించుట, రావణుని వధించుట అనెడి కార్యములు క్రమముగా జరిగినను ఈ శ్లోకమున ఆ క్రమము పాటింపబడక ముందు వెనుకలుగా చెప్పబడినవేమి?' అని। 'మహాభక్తులైన వారి విషయమున శాస్త్రము తోను, క్రమముతోను కూడ పనిలేదు'-అని దీనికి సమాధానము.

'అత్యంత భక్తియుక్తానాం నైవశాస్త్రం నచక్రమః' అను వాక్యమిచట ప్రమాణము. అట్లే స్తోత్రరత్నమునందలి 'యదర్థ మంబోధి రబంధ్యమంథిచ' (ఎవరి కొరకైతే సముద్రము బంధింపబడెనో, మథింపబడెనో' అను వాక్యముకూడ ఇట్టిదేయని తెలియనగును.

సంస్కృత వ్యాఖ్య :- అధీతి 'హే మైథిలి' సీతావతారాభేదానుసంధానేన శ్రీరంగనాయక్యా మైథిలీతి సంబోధనమ్ , అసౌ నాథః త్వత్ప్రియః త్వచ్చాటు చుంచుమనోరథః సన్ త్వచ్చాటునా త్వత్ప్రియాచరణేన విత్తః సంపన్నో మనోరథో యస్య స తథోక్త స్సన్ 'తేనవిత్త శ్చుంచుప్చణపౌ' ఇతి చుంచుప్ప్రత్యయః। అబ్ధి మధి అబ్ధౌ 'అధిశీఙ్ స్థాసాంకర్మ' ఇతిసప్తమ్యర్థే ద్వితీయా శయితవాన్ శయనం కృతవాన్। త్వజ్జననభవన ప్రీత్యేతిభావః। తం అబ్ధిం మమంథ మథితవాన్। బబంధ చ సేతునా బద్ధవాంశ్చ। హరధనుః శివకోదండం వల్లీభంజం వల్లీమివ ఉపమానార్థేణముల్ ప్రత్యయః బభంజచ। భంగంకృతవాంశ్చ। దశముఖీం దశానాం ముఖానాం సమాహారం దశాపిముఖానిత్యర్థః। లూత్వాఛిత్వా। రక్షఃకబంధం రావణశరీరం అనర్త యదపి నర్తితవాంశ్చ। అపిశ్చార్థః। రణరంగ ఇతిశేషః। సర్వత్ర తద్వల్లభాయేతి యోజ్యమ్।

అబ్ధిశయన తన్మథన హరధనుర్భంజ నాబ్ధిబంధన రక్షః కబంధనర్త నానాం క్రమేణ వక్తవ్యత్వేఽపి 'అత్యంతభక్తియుక్తానాం నైవశాస్త్రం నచక్రమః।' ఇతి ప్రమాణానుసారేణ భక్త్యతిశయాదత్ర క్రమో నానుసంహితః। నపరమిదమేవ కింత్వశక్యమపి కుర్యాదిత్యాహ- కిమివేతి। పతిః త్వత్ప్రియః కిమివ నకర్తా కింవా నకుర్యాత్? ఇవ శబ్దోవార్థః। అఘటితం సర్వమపి కుర్యాదేవేత్యర్థః।

అత ఏవోక్తం హనుమతా 'యది రామ స్సముద్రాన్తాం మేదినీం పరివర్తయేత్। అస్యాహితో ర్విశాలాక్ష్యాః యుక్తమిత్యేవ మేమతిః॥' ఇతి। కర్తేతి 'డుకృఞ్ కరణే' ఇతిధాతోః కర్తరిలుట్।

అ :- భగవత స్సర్వప్రకార విభవోఽపి లక్ష్మీవిలాస లవానుభవే నపర్యాప్త ఇత్యాహ।

శ్లో॥ దశశత పాణిపాద వదనాక్షి ముఖైరఖిలై
రపి నిజవైశ్వరూప్య విభవై రనురూపగుణైః।
అవతరణై రతైశ్చ రసయన్ కమితా కమలే!
క్వచన హి విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి తే॥ ౫౫

అ:-హే కమలే= ఓ లక్ష్మీదేవీ, తే= నీయొక్క, కమితా= వల్లభుడైన శ్రీహరి, దశ..ముఖైః, దశశత= వేలసంఖ్యలోనున్న, పాణి= చేతులు, పాద= పాదములు, వదన= ముఖములు, అక్షి= నేత్రములు, ముఖైః= మొదలైన, అను రూపగుణైః= నీ గుణములకు అనురూపములైన, అఖిలైరపి= సమస్తములైన, (ఏమియు మిగల్చక యున్న,) నిజవైశ్వరూప్యవిభవైః= నిత్యములు స్వకీయములు అయిన విశ్వరూపమునకు సంబంధించిన గుణములతోను, అతైః= విశ్వరూపముకంటె భిన్నములైన, అవతరణైః చ= రామకృష్ణాద్యవతారములతోను, రసయన్= నిన్ను ఆనందింపచేయుచు, క్వచన= ఎక్కడనో (సముద్రములో నీటి బొట్టువలె), తే= నీయొక్క, విభ్రమ భ్రమిముఖే= విలాసములనెడి సుడి గుండముయొక్క గుహయందు, వినిమజ్జతి = మునిగిపోవుచున్నాడు. (పూర్తిగా అనుసరించలేక పోవుచున్నాడు.)

తా :- ఓ లక్ష్మీదేవీ! విశ్వరూపమును ధరించియున్న నిన్ను శ్రీమహావిష్ణువు సహస్ర శీర్ష వదనాక్షి పాణిపాదములతోను, రామకృష్ణ మత్స్య కూర్మా ద్యనేకావతారములతోను అనుసరించుచున్నప్పటికిని సముద్రములో జల బిందువువలె నిన్ను అందుకొనలేక పోవుచున్నాడు. (శ్రీమహావిష్ణువుయొక్క విశ్వరూపమును కూడ మించిన విశ్వరూపము కలదానవు నీవు, అతడు తన విశ్వరూపముతోను రామకృష్ణాద్యవతారములతోను కూడ ఎంతప్రయత్నించినను నీకంటె తక్కువదనమునే పొందుచున్నాడు).

వి :- ఇచటకూడ శ్రీమన్నారాయణుని లక్ష్మీ అనుసరణము మరియొక

విధముగా వర్ణింపబడినది. మరియు ఇద్దరియొక్క అవయవ సౌభాగ్యము అవతార వైభవముకూడ వర్ణింపబడినవి. ఈ స్తోత్రమునందలి 4వ శ్లోకములో 'భోగోపోద్ఘాత కేళీ చుళుకిత భగవద్వైశ్వరూప్యానుభావా' అనెడిపాదముతో చెప్పబడిన విషయమే ఇందు వివరింపబడినది. 'సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్' అనంత బాహూదర వక్త్రనేత్రమ్' అని శ్రుతులలోను, స్మృతులలోను చెప్పినట్లుగా శ్రీమన్నారాయణుడు వేయితలలు, వేయిముఖములు, వేయికళ్ళు, వేయిచేతులు, వేయి పాదములు, కలవాడైనను, లక్ష్మియొక్క స్వరూపము శ్రీమన్నారాయణుని స్వరూపమును మించినదిగా వర్ణింపబడినది. భగవంతుని అంతటి వైభవముకూడ లక్ష్మి యొక్క వైభవమున చాలలేదు అని తాత్పర్యము.

4వ శ్లోక విశేషములో చెప్పుకొనబడిన 'స్వవైశ్వ రూప్యేణ సదానుభూతయా ఉప్యపూర్వవ ద్విస్మయ మాదధానయా' అను శ్రీయామునాచార్యుల వాక్యమున్ను; 'విష్ణోర్దేహానురూపాంవై కరోత్యేషా త్మనస్తమమ్' అను శ్రీస్తుతిలోని వాక్యముకూడ ఇచట జ్ఞాపకము చేసికొన తగినవి. ఆమెయొక్క రూపవిలాసములు ఒక సుడి గుండముగ వర్ణింపబడి శ్రీమహావిష్ణువు అందు తిరుగువాడుగ వర్ణింపబడినది. 'నమోఽస్త్వనంతాయ సహస్ర మూర్తయే సహస్రపాదాక్షి శిరోరుబాహవే' అను వాక్యముకూడ ఇట స్మరణీయము. ఇచట 'కమలే' అనుసంబోధనకూడ సాభిప్రాయము. కమలమనగావేయిరేకులు కలది. 'సహస్రపత్రం కమలం' అని నిఘంటువు. లక్ష్మీనారాయణుల అవయవ సౌందర్యము కమలముతో సమానమైనదిగా వర్ణింపబడుట ప్రసిద్ధము. ఇందు అవయవములన్నింటి యందున్న వేయిసంఖ్యా రేకులయందున్న వేయి సంఖ్యచే సూచింపబడుచున్నది.

సంస్కృత వ్యాఖ్య :- దశశతేతి। హే కమలే! తవ కమితా నాయకో హరిః। 'సహస్రశీర్షాపురుషః' అనంత బాహూదరవక్త్రనేత్రమ్। ఇతి శ్రుతి స్మృత్యుక్త ప్రకారేణ దశశతాని సహస్ర సంఖ్యాః పాణయో హస్తాః, పాదాశ్చరణాః వదనాని ముఖాని అక్షీణి నయనాని, ముఖాని ఆదిని యేషాంతై స్తథోక్తైః అనురూపగుణైః త్వద్గుణాను రూపైః అఖిలైః అన్యూనైః నిజవైశ్వరూప్య విభవైః నిజం స్వకీయం నిత్యంవా 'నిజం నిత్యే స్వకేత్రిషు' ఇత్యమరః। విశ్వరూపమేవ వైశ్వరూప్యమ్। విశ్వరూప సంబంధివా। తస్య విభవైః అతిశయైరపి। అపిశ్చార్థః।

అత్రైః తద్భిన్నైః వైశ్వరూప్య విభవ భిన్నైరిత్యర్థః। అవతరణైః వాసుదేవాది చతుర్వ్యూహ విరించి గిరీశ మధ్యవర్తి విష్ణూపేంద్ర మత్స్యకూర్మాది రూపైశ్చ, రసయన్ అనుభవన్ త్వద్విభ్రమ మితిశేషః। క్వచన క్వాపి సముద్రేతుషారవదేకదేశే ఇత్యర్థః। విభ్రమ భ్రమిముఖే విలాసావర్త గహ్వరే వినిమజ్జతి నిమగ్నో భవతి। నత్వేకదేశమపి

ప్రయాతీత్యర్థః । వినిపూర్వాత్ 'టుమస్జో శుద్ధౌ' ఇత్యస్మాద్ధాతోః సస్యజ్శ్వేన దత్వే ఖ్చుత్వే వినిమజ్జతీతి రూపమ్।

అ :- శ్రియో దుగ్ధార్ణవ పరమపద శ్రీరంగేషు నిత్యవాసే హేతుమహ॥

శ్లో॥ జననభవనప్రీత్యా దుగ్ధార్ణవం బహుమన్యసే
జనని! దయితప్రేమ్ణా పుష్ణాసి తత్పరమం పదమ్ ।
ఉదధి పరమవ్యోమ్నో ర్విస్మృత్య మాదృశ రక్షణ
క్షమమితి ధియా భూయః శ్రీరఙ్గధామని మోదసే ॥ ౫౬

అ:- జనని= ఓ మాతా! లక్ష్మీదేవీ, జననభవనప్రీత్యా=పుట్టింటియందలి ప్రీతితో, దుగ్ధార్ణవమ్=పాలసముద్రమును, బహుమన్యసే=గొప్పగా తలచుచున్నావు (గౌరవించుచున్నావు) తత్=ప్రసిద్ధమైన, పరమంపదమ్=వైకుంఠమును, దయితప్రేమ్ణా=నీవల్లభుడైన శ్రీహరియందలి ప్రేమతో, పుష్ణాసి=పోషించుచున్నావు (అక్కడనే నిత్యము నివసించుచున్నావు) ఉదధి పరమవ్యోమ్నాః=పాలసముద్ర వైకుంఠములను, విస్మృత్య=మరచి, మాదృశరక్షణ క్షమం ఇతి=మాబోంట్లను రక్షించుటకు తగినదను, ధియా=బుద్ధితో, భూయః=మరల, శ్రీరంగధామని=శ్రీరంగ నగరమున, మోదసే=సంతోషించుచున్నావు.

తా :- జననీ! పుట్టినిల్లని పాలసముద్రమును, మెట్టినిల్లని వైకుంఠమును అభిమానించి గౌరవించుచున్నావు. అది సహజమే అయినను ఆ రెండింటిని వదలి మాదృశా కించనుల రక్షణకొరకై 'నీవు ఎల్లప్పుడును ఇచటనే ఉన్నావు' అను భావము మాకు కలుగునట్లుగను, క్షీరాబ్ధి వైకుంఠవాసములను మరచిన విధముగను నీవు ఎల్లప్పుడును శ్రీరంగమునందే నిత్యనివాసమును ఏర్పరచుకొని ఇచ్చటనే ఉన్నావు.

వి :- లక్ష్మీదేవికి పుట్టినయిల్లని పాలసముద్రమునందు అభిమాన ముండుటయు, మెట్టిన ఇల్లని తద్విష్ణోః పరమం పదం అని చెప్పబడిన వైకుంఠమును గౌరవించుటయు సామాన్యస్త్రీగా సహజమే అయినను పుత్రస్థానీయులైన భక్తులయందలి వాత్సల్యము తో తద్రక్షణ కొరకై శ్రీరంగమునందు నిత్యనివాసము చేయుట భక్తపరాధీనతను సూచించుచున్నది. మరియు శ్రీరంగనివాసము వైకుంఠమును మరపించునదిగా వర్ణించుట వలన శ్రీరంగమునకు వైకుంఠముకంటె ఒకవిధమైన ఆధిక్యముతోపాటు సులభగమ్యతయు గోచరించుచున్నది. ఈ విధముగా లక్ష్మీదేవికి భక్తజనుల యందు స్వత్వము సూచింపబడినది. అంతియే గాక లౌకికముగా కూడ నాలోచించినచో ప్రతిగృహిణియు నేర్చుకొనదగిన మూడుగుణములు-1) పుట్టింటి అభిమానము, 2) ఆ అభిమానముతో అత్తవారింటిని చులకన చేయకుండగ దానియందు కూడ

గౌరవము, 3) సంతానమును వలెనే బంధుజనమునంతను స్వజనముగా చూచుట, అనునవి ఇందు సూచింపబడినవి. మొత్తముమీద పుట్టినింటిని మెట్టినింటిని భక్తకోటిని అందరను సమానముగా చూచునదే యైనను 'బహుమోదసే' అనుపదముద్వారా 'భక్తకోటి సులభముగా సేవించుకొనుటకు వారిని రక్షించుటకు వీలుగా శ్రీరంగమున నివసించుట ఆమెకు పరమానందదాయకము- అని తెలియుచున్నది. పుత్రప్రేమ అన్నిటిని మించినది కదా. భక్తులుకూడ పుత్రస్థానీయులే, ఈ విషయమున 'అధరీకృత సర్వస్నేహేన గురుణా అపత్యప్రేమ్ణా' (అన్నింటిని తక్కువ చేయునట్టిదియు, గొప్పదియు నైన పుత్రప్రేమతో) అను బాణమహాకవి వాక్యము ప్రమాణము.

సంస్కృత వ్యాఖ్య :- జననేతి। హే జనని। శ్రీరంగేశ్వరి! జననభవన ప్రీత్యా జన్మగృహప్రణయేన దుగ్ధార్ణవం క్షీరాబ్ధిం బహుమన్యసే మానయసి। తత్ర వాసం విధత్సే ఇత్యర్థః । బహుపూర్వాత్ దివాదిపాఠాత్ 'మనుఅవబోధనే' ఇత్యస్మాద్ధాతోః। 'దివాదిభ్యః శ్యన్' ఇతిశ్యన్ ప్రత్యయే 'బహుమన్యసే' ఇతి లణ్మధమ పురుషైకవచనమ్। తత్ ప్రసిద్ధం 'తద్విష్ణోః పరమం పదం' ఇతి వేదాన్త విదితం పరమం పదం పరమవ్యోమ దయితప్రేమ్ణా ప్రియప్రీత్యా ప్రియగృహ ప్రీత్యేత్యర్థః। పుష్ణాసిపోషయసి । తత్ర సాన్నిధ్యం కురుషే ఇత్యర్థః। పుషపుష్టౌ ఇతిధాతోః। పరస్మైపద పఠితాత్ శ్నా ప్రత్యయే పుష్ణాసీతి రూపమ్ । ఉదధి పరమవ్యోమ్నోః దుగ్ధార్ణవ పరమపదయోః విస్మృత్యా విస్మరణం కృత్వా తత్రస్థానాం నిత్యం సన్నిహితేయ మితి బుద్ధి ముత్పాద్యేత్యర్థః। 'అధీగర్థ దయేశాం కర్మణి' ఇతి కర్మణిషష్ఠీ। మాదృశ రక్షణక్షమ మితిధియా మాదృశాకించన పాలనయోగ్యమితి బుద్ధ్యా భూయః పునః అతిశయేనవా శ్రీరంగధామని శ్రీరంగనగరే దివ్యవిమానేవా మోదసే మోదంభజసి। అత్ర దుగ్ధార్ణవం బహుమన్యసే, పరమపదం పుష్ణాసీత్యుక్త్వా శ్రీరంగధామని మోదస ఇత్యానందభజనోక్త్యా సంశ్రిత రక్షణోప యుక్తత్వేన శ్రీరంగధామ్నస్తదుభయా దప్యానందా వహత్వవ్యతిరేకో వ్యజ్యత ఇతి వ్యతిరేకాలంకారధ్వనిః వాక్యగతో ద్రష్టవ్యః।

అ:- 'అర్చావతార విషయే మయాప్యుద్దేశత స్తవ। ఉక్తాగుణా నశక్యన్తే వక్తుం వర్షశతైరపి' ఇత్యుక్త ప్రకారేణ సర్వావతారాపేక్షయా శ్రియః శ్రీరంగధామ న్యర్చావతారే సర్వగుణానా మతిశయితత్వ మాహ।

శ్లో॥ ఔదార్య కారుణికతాశ్రితవత్సలత్వ
పూర్వేషు సర్వమతిశాయిత మత్ర మాతః ।
శ్రీరఙ్గ ధామ్ని యదుతాన్య దుదాహరన్తి
సీతావతారముఖ మేత దముష్య యోగ్యా॥ ౨౭

అ:- హే మాతః= ఓ జననీ! ఔదార్య..పూర్వేషు, ఔదార్య=ఔదార్యము, (స్వార్థ చింతలేకుండగ పరార్థప్రాపణము), కారుణికతా=ఇతరులయందు జాలి, (ఇతరుల దుఃఖమును సహింపలేకపోవుట), ఆశ్రితవత్సలత్వ=ఆశ్రితవాత్సల్యము, (ఆశ్రితులయందలి దోషములను తనవిగా భావించి క్షమించుట), పూర్వేషు=మొదలైన గుణములయందు, సర్వమ్=అంతయు (అన్నియు), శ్రీరంగధామని=శ్రీరంగము నందలి, అత్ర=ఈ అర్చావతారమునందు, అతిశాయితమ్=ఎక్కువగా వ్యాపించి యున్నది, ఉత=అట్లుగాక, అన్యత్=ఇతరమైన, (ఈ అర్చావతారము కంటె భిన్న మైన,) సీతావతారముఖం యదేతత్='సీత' మొదలగు అవతారములు అతిశయిత గుణములుకలవి అని చెప్పబడుట, అముష్య=ఈ అర్చావతారము యొక్క, యోగ్యా=అభ్యాసము మాత్రమే.

తా :- ఓ జననీ! లక్ష్మీదేవీ! లోకమున సర్వాతిశయములుగానున్న ఔదార్య కారుణికతాది గుణములు ఎన్నైతే చెప్పబడినవో అవి అన్నియు శ్రీరంగమున నీ అర్చావతారమున నున్నవి. ఈ గుణములన్నియు ఇంతకుముందు సీతాద్యవతారముల యందు కూడ ఎక్కువగా ఉన్నట్లు వర్ణింపబడినవి. అయినను అవి ఈ అర్చావతారము నకు అభ్యాస రూపములు మాత్రమే.

వి :- ఈ శ్లోకమున శ్రీరంగమునందు అర్చావతారములోనున్న లక్ష్మీదేవికి (శ్రీరంగనాయకికి) సమస్తగుణ పరిపూర్ణత్వము వర్ణింపబడినది. ఇంతకు ముందు సీతాద్యవతారములలోను ఈ గుణములన్నియు ఉన్నట్లు వర్ణింపబడినది. అయినను సీతాద్యవతారములు లీలావిభూతిని తెలియచేయునవి- శ్రీరంగనాయకిగానున్న అర్చావతారము నిత్యవిభూతిని తెలియచేయునది. సీతాద్యవతారములయందు పరమ కారుణికత్వౌదార్యాది గుణాతిశయ వర్ణనము ఈ అర్చావతారమునందలి గుణాతిశయ వర్ణనకు అభ్యాసరూపమైనది. అనగా మనమేదైన బొమ్మ గీయవలసి వచ్చినప్పుడు గాని, ఏదైన వ్రాయవలసి వచ్చినపుడుగాని ముందుగా ఒకటిరెండు పర్యాయములు దానిని అభ్యాసముచేసి చివరకు సంపూర్ణరూపమును తయారుచేయుదుము. ఆ విధముగానే సీతాదులయందలి గుణములు అట్టి అభ్యాసరూపములుగను, ఈ అర్చావతారమునందలి గుణములు సంపూర్ణ రూపములుగను వర్ణింపబడినవి. ముందుగా సీతాద్యవతారములయందలి గుణములను ఎక్కువగానున్నట్లు వర్ణించి ఆ గుణములుకంటె ఈ అర్చావతారమునందలి గుణములు ఎక్కువగా ఉన్నట్లు వర్ణించుట వాటికంటె శ్రీరంగనాయకియందు ఆధిక్యమును వ్యక్తము చేయుటకు మాత్రమేకాని, సీతాద్యవతారములను తక్కువ చేయుటకు మాత్రముకాదు. మొత్తముమీద శ్రీరంగధామమునందలి 'శ్రీరంగనాయకి' యొక్క అర్చావతారము సర్వోత్కృష్టమని

సారాంశము. అందువలననే ఈ అర్చావతారము 56వ శ్లోకములో చెప్పబడినట్లుగా భక్తకోటికి అచ్చటనే స్థిరనివాస మేర్పరచుకొనవలయుననెడి ప్రీతిని కలుగచేయు చున్నది.

సంస్కృత వ్యాఖ్య :- ఔదార్యేతి । హే మాతః! శ్రీరంగేశ్వరి! ఔదార్య కారుణికతా శ్రితవత్సలత్వ పూర్వేషు, ఔదార్యం స్వార్థనైరపేక్షేణ పరేష్టప్రాపకత్వం కారుణికతా పరదుఃఖాసహిష్ణుత్వం, ఆశ్రితవత్సలత్వం ఆశ్రిత దోషభోగ్యత్వమ్, తాని పూర్వాణి ప్రధానాని యేషాం తేషు గుణేష్వితి శేషః। సర్వం గుణజాతం శ్రీరంగధామ్ని శ్రీరంగనగరే దివ్యవిమానేవా, అత్ర త్వదీయార్చావతారే అతిశాయితం అతిశయం ప్రాప్తమ్। మాతర్మైథిలీత్యాదినా సీతావతారే క్షమాదయాద్యతిశయ వర్ణనా దత్ర కథం తతోఽప్యతిశయ ఇత్యాహ। యదుతేత్యాదినా। అన్యత్ అర్చావతారాదిత రత్ సీతావతార ప్రభృత్యవతారం అతిశయిత గుణముదాహరన్తీతి యదేతత్ అముష్య అర్చావతారస్య యోగ్యం(గ్యా) అభ్యాసః । సర్వావతారేషు కారుణ్యాది గుణవ్యసనేన సర్వగుణాతి శయవాన్ అయమర్చావతారః పరిణత ఇతి భావః।

అ :- శ్రియో వాఙ్మనసాగోచర మౌదార్యం వర్ణయతి ।

శ్లో ॥ ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా
కస్మైచి దఞ్జలిభరం వహతే వితీర్య ।
అస్మై నకిఞ్చిదుచితం కృతమిత్యథామ్బ
త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః? ౫౮

అ:- హే అంబ=జననివైన ఓ లక్ష్మీదేవీ, అంజలిభరమ్=కరయుగమును జోడించుటయను భారమును, వహతే=వహించుచున్న, (నమస్కరించుచున్న) కస్మైచిత్=ఎవరికో, (తెలియని వానికికూడ) ఐశ్వర్యమ్=ఇహలోకమునందలి ఐశ్వర్యమును, అక్షరగతిమ్=మోక్షమును, పరమం పదంవా=పరమపదమునుకూడ, (వైకుంఠమును శ్రీరంగనాథకైంకర్యమును కూడ) వితీర్య=ఇచ్చి, అథ=తరువాత, అస్మై=ఈ భక్తునికొరకు, ఉచితమ్=తగిన ఉపకారము, కించిత్=కొంచెముకూడ, నకృతం ఇతి=చేయబడలేదు అని, త్వమ్=నీవు, లజ్జసే=సిగ్గుపడుచున్నావు, అయమ్ =ఈ, ఉదారభావః=ఔదార్యము, కః=ఏది? (ఎక్కడిది?) కథయ=చెప్పుము.

తా :- జననీ! శ్రీరంగనాయకీ! నీకు కేవలము నమస్కరించుచున్న ఎవరికో అజ్ఞాతభక్తునకే ఇహపరసౌఖ్యములను శ్రీవిష్ణుపదకైంకర్యమును పూర్తిగా నొసంగి కూడ 'అయ్యో! ఇతనికి నేనేమియు చేయలేకపోతినే' అని సిగ్గుపడుచున్నావు. అమ్మా! ఇదెక్కడి ఔదార్యము?

వి :- ఆమెకు అపరిచితుడైనను ఒక్కసారి లక్ష్మీదేవికి నమస్కరించినంత మాత్రము ఆమె అతనికి సమస్తసౌఖ్యములు కలుగచేయును అనగా ఇక పరిచితుల విషయమున వేరే చెప్పునది లేదు.

'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే ।
అభయం సర్వభూతేభ్యో దదామ్యేతత్ వ్రతం మమ॥'

(ఒక్కమారు శరణుపొంది 'నేను నీవాడను' అని యాచించి నంత మాత్రమున ఆతనికి సర్వభూతములనుండి అభయమిచ్చెదను. ఇది నావ్రతము) అను శ్రీరాముని వాక్యమిచట కూడ స్మరణీయము మరియు 'శ్రియం లోకే దేవజుష్టా ముదారాం' అను శ్రుతిలోని శ్రీయొక్క ఉదారత్వము ఇచట వివరింపబడినది. ఆమె అన్నియు ఇచ్చికూడ 'అయ్యో! ఏమీ ఇవ్వలేదే' అని సిగ్గుపడుట ఆమెయొక్క ఔదార్య పరాకాష్ఠకు నిదర్శనము. నమస్కరించుచున్న ఆ అజ్ఞాత భక్తుని యొక్క అంజలియే ఆమెకు చాల బరువైనదిగా తోచుచున్నది. అతడు పెద్దబరువు మోయుచున్నట్లు, తనపై పెద్ద భారముంచినట్లు కూడ ఆమె భావించుచున్నది. అట్టి ఆతనికి ప్రత్యుపకృతిగా సమస్తసుఖముల నిచ్చినను ఆమెకు తృప్తి కలుగకపోవుటయే గాక సిగ్గుకూడపడుట ఆమెయొక్క ఔదార్యాతిశయము చాటి చెప్పుచున్నది. ఇది లోకవిలక్షణమును, వాక్కులకతీతము. 'వితీర్య' అను ధాతు రూపము కూడ దీనిని బలపరచుచున్నది. విష్ణుసహస్రనామములోని ఈక్రింది నామములకు శ్రీపరాశరభట్టర్ భాష్యము శ్రీమన్నారాయణునకు సంబంధించినదే యైనను ఇచట లక్ష్మీదేవికి కూడ అన్వయించు కొనవచ్చును. 1.'కృతజ్ఞః' (83) కృతం జానాతీతి కృతజ్ఞః । తాను చేయు నుపకారమునకు ప్రత్యుపకార మపేక్షింపనివాడు. 2. 'అనలః' (294-716) న అలః అనలః। భక్తులకు తాను సమస్త కార్యములను చేసియు తృప్తినొందని వాడు, ఇత్యాదులు. ఎవరి విషయముననో ఇంత ఔదార్యము చూపించుచుండగా నిత్యము ఆమెనే స్తోత్రము చేయుచు సేవించుచున్న తమ విషయములో లక్ష్మీదేవి యొక్క ఉపేక్షాభావము పనికిరాదని సారాంశము. ఈ విషయమే తరువాతి రెండు శ్లోకము లలో (59-60) చెప్పబడినది.

సంస్కృత వ్యాఖ్య :- ఐశ్వర్యమితి । హే అంబ! శ్రీరంగేశ్వరి! అంజలి భరం అంజలిరేవ కరతలయుగల యోజనమేవ భరం త్వదభిప్రాయేణ గురుతరభారం వహతే, నతు తదధికతయా కించిదస్తీతి భావః । కస్మైచిత్ కులగోత్ర వృత్తిశూన్యాయ జంతవే ఐశ్వర్యం ఐహలౌకికం పారలౌకికంచ అక్షరగతిం కైవల్యం పరమంపదం పరమ పురుషార్థ లక్షణ భగవత్కైంకర్యంవా, వాశబ్దశ్చార్థః కైంకర్యం చేత్యర్థః । అథ కార్త్స్న్యేన వితీర్యదత్వా అస్మై అంజలిభరవాహినే ఉచితం తద్భారవహ నానుగుణం కించిత్ కిమపి

నకృతమితి నోపకృతమితి త్వం లజ్జసే। వ్రీడావినమ్ర వదనాసి। 'ఓ లసీవ్రీడా యామ్' ఇతి ధాతో ర్లడాత్మనేపద మధ్యమపురుషైకవచనమ్ । అయ ముదారభావః కః? లోకవిలక్షణో వాచామగోచరవైభవశ్చేత్యర్థః।

అ :- ఇతః పరం శ్లోకద్వయేన స్వనైచ్య మనుసంధత్తే।

శ్లో ॥ జ్ఞాన క్రియా భజన సమ్పదకిఞ్చనోఽహ
మిచ్ఛాధికార శకనానుశయానభిజ్ఞః ।
ఆగాంసి దేవి! యువయోరపి దుస్సహాని
బధ్నామి మూర్ఖచరిత స్తవ దుర్భరోఽస్మి ॥ 58

అ :- హే దేవి= ఓ జననీ! ఇచ్ఛా=పురుషార్థముల యందలి కోరిక, (మోక్షేచ్ఛ) అధికార= అర్హత, శకన= కర్మానుష్ఠాన సామర్థ్యము (శక్తి), అనుశయ= పశ్చాత్తాపము లను, (చేయవలసినది చేయకపోవుట వలనవచ్చెడి పశ్చాత్తాపము) అనభిజ్ఞః= తెలియని వాడనై, జ్ఞాన... దకించనః, జ్ఞాన= జ్ఞాన యోగము, క్రియా= కర్మయోగము, భజన= భక్తిప్రపత్తులు అనెడి, సంపత్= సంపదలచేత, అకించనః= దరిద్రుడనైన, (శూన్యుడ నైన) అహమ్=నేను, యువయోః అపి= మీ ఇద్దరకుకూడ, దుఃసహాని= సహించుట కు శక్యముకాని, ఆగాంసి= మహా పాపములను, (భగవదపచార భాగవతాపచారాదు లను) బధ్నామి= చేయుచున్నాను, (మూటగట్టుకొనుచున్నాను) మూర్ఖచరితస్సన్= మూర్ఖులయొక్క చరిత్రవంటి చరిత్ర గలవాడనై, తవ= నీకు, దుర్భరః అస్మి= భరింప శక్యముకాని వాడను అయితిని.

తా :- ఓ జననీ! పురుషార్థములయందు, అందునను ప్రధానమైన మోక్షము నందు కోరికలేనివాడను, అర్హతలేనివాడను, కర్మాద్యనుష్ఠానము లేకపోగా ఆ కర్మ చేయుట లేదను పశ్చాత్తాపముకూడ లేనివాడను, ఇవేమియు నాయందు లేవు గనుకనే జ్ఞాన కర్మ మార్గములుగాని, భక్తిప్రపత్తులుగాని, లేనటువంటి నేను ఎట్టి దోషముల నైనను సహించు వాత్సల్యముకల మీరుకూడ క్షమించరాని పాపములను ప్రతిదినము చేయుచు మూర్ఖచిత్తుడనై దయాస్వభావురాలవైన నీకుకూడ భరింపశక్యము కానివాడనై యున్నాను.

వి :- 59-60 శ్లోకములలో గ్రంథకర్త తమ నైచ్యమును గురించి చెప్పుకొను చున్నారు. ఈ శ్లోకమున లక్ష్మీదేవియొక్క అనుకూల్యాభావమే గాక ప్రాతికూల్య ప్రభావముకూడ బాగుగా చెప్పబడినది. మోక్షేచ్ఛలేదు. కర్మానుష్ఠానములేదు. చేయుటలేదనెడి పశ్చాత్తాపముకూడ లేదు, అందువలన జ్ఞానకర్మ భక్తి ప్రపత్త్యాదులు శూన్యములు. అట్టివారిని క్షమించు సహనశక్తి వారిద్దరియందును కూడ లేదనియు,

అందువలననే వారలకు కూడ దుర్భరులమైతిమనియు, అయినను లక్ష్మీదేవి యొక్క దయ ఆకస్మికముగా కలుగునది కావున, తమయందు పైన చెప్పినవి ఏమియు లేక పోయినను, దయతోపాటు వాత్సల్యమునుకూడ చూపి తమకు మోక్షమును ప్రసాదించుమనియు శ్రీభట్టరుల అభిప్రాయసారాంశము.

ఇది వీరియొక్క వినయాధిక్యమును, అహంకార రాహిత్యమును సూచించు చున్నది.

సంస్కృత వ్యాఖ్య :- జ్ఞానేతి । హే దేవి । 'అర్థీ సమర్థో విద్వాన్ ఇత్యుక్త ఇచ్ఛాధికార శకనాను శయానభిజ్ఞః । ఇచ్ఛాపురుషార్థస్పృహా అధికారో నియోజ్యత్వమ్, శకనం కర్మానుష్ఠాన సామర్థ్యమ్ । అనుశయో విహితాకరణ కృతానుతాపః । తేషామనభిజ్ఞః అత ఏవ జ్ఞానక్రియాభజన సంపద కించనః జ్ఞానం జ్ఞానయోగః, క్రియా కర్మయోగః, భజనే భక్తిప్రవత్తీ, తా ఏవ సంపదైశ్వర్యం తేనాకించనో దరిద్రో ఽహం యువయోరపి అపరాధైకోపహారయోర్భవతోరపి దుస్సహాని సోఢుమ శక్యాని ఆగాంసి భగవదపచార భాగవతాపచార అసహ్యాపచారరూపాణి బధ్నామి సమూహరూపేణ సంచినోమి । నకేవలం త్వద్విషయానుకూల్యాభావః । ప్రాతికూల్య పరిపూర్ణ శ్చాస్మీ త్యాశయః । తతః కి మిత్యత్రాహ। మూర్ఖేతి । మూర్ఖ చరితః బాలిశ వ్యాపారః । ఇదం హేతుగర్భ విశేషణమ్ । మూర్ఖచరితత్వాదహం వాత్సల్యాతిశయ భాజోఽపి తవ దుర్భరోఽస్మి సోఢు మశక్యో భవామి । రక్షణ విషయో నాస్మీత్యర్థః॥

అ :- ఉక్తనైచ్యమపి పూర్వాచార్య నైచ్యానుకరణ మాత్రం సమనః పూర్వకం తతో నిర్హేతుక కృపయైవ త్వం శరణమసీ త్యాహ।

శ్లో ॥ ఇత్యుక్తి కైతవ శతేన విడమ్బయామి
తానమ్బ! సత్యవచసః పురుషాన్ పురాణాన్ ।
యద్వా న మే భుజబలం తవ పాదపద్మ
లాభే త్వమేవ శరణం విధితః కృతాసి ॥ ౬౦

అ:- హే అంబ=జననివైన ఓ రంగరాజేశ్వరీ, ఇతి=పైనచెప్పిన విధము గాను, ఇంకను అనేకవిధములుగాను, ఉక్తికైతవశతేన=కపటనైచ్యవచన పరంపరలతో, తాన్=ప్రసిద్ధములైన, సత్యవచసః=యదార్థవాక్కులైన, పురాణాన్ పురుషాన్ =ప్రాచీను లైన పరాంకుశ పరకాల యామున యతివరాదులను, విడంబయామి= అనుకరించు చున్నాను, యద్వా=అట్లుకానిచో (లేదా) తవ=నీయొక్క, పాదపద్మ లాభే=చరణ పంకజలాభమున, మే భుజబలం న=నాశక్తి ఏమియులేదు, విధితః= అకారణ కృపామాత్రమున, త్వం ఏవ=నీవే, శరణమ్=ఉపాయముగా( రక్షకు

రాలివిగా) కృతా అసి=చేయబడితివి. (కృప అను అర్థమున విధిశబ్దము ద్రావిడ ప్రబంధము లలో ప్రయోగింపబడుట గమనించదగినది.)

తా :- జననీ! పైనచెప్పిన విధముగా భక్తిలేకపోయినను భక్తిని సూచించు కపటవాక్యములతో, మాకంటె పూర్వులు భగవన్నిర్హేతుక జాయమాన కటాక్షలబ్ధ విశదతమ జ్ఞానులు, సత్యవాక్కులునైన పరాంకుశ పరకాల యామున యతివరాదుల ననుకరించుచున్నాను. ఈ అనుకరణ నీవు నన్ను రక్షించుటలో ఒక ఉపాయము. లేదా మాతా! ఈ కృత్రిమ అనుకరణలతో ప్రయోజనమేమి? నీ పాదపద్మ సేవకు తగిన శక్తిసామర్థ్యములు నావద్దలేవు, నీయొక్క అపార కృపావశమున మనయొక్క ఈశేశితవ్య సంబంధమే నిన్ను నాకు రక్షకురాలినిగా చేసినది.

వి :- ఈ శ్లోకములో కూడ శ్రీ పరాశరభట్టారకులు తమదంటూ ఏమియు లేదనియు తామేదైనా చెప్పినచో అది కేవలము భగవంతుని కరుణవలననే విశదతమ జ్ఞానులై ప్రామాణికులైన పూర్వుల అనుకరణమే అనియు, అదియును కృత్రిమమే గాని, మనఃపూర్వకము గాదనియు ఆ విధముగానైనను తమను రక్షించుమనియు, భగవతిని ప్రార్థించుచున్నారు. ఇది లక్ష్మీదేవి తమను రక్షించుటలో ఒక కారణము. మరొక విధముగా భగవతియొక్క పాదపద్మలాభమున తమశక్తి సామర్థ్యము లేమియు లేవనియు, తమ నైచ్యమును కూడ తాము స్వయముగా చెప్పుకొనలేని అసమర్థుల మనియు, నిరుపాధికమైన స్వస్వామిభావ సంబంధముద్వారా లక్ష్మీదేవినే శరణు వేడుకొనుచున్నామనియు, ఆకస్మిక జాయమాన భగవతీ కృపయే తమకు శరణ మనియు చెప్పుకొనుచున్నారు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ' (అన్ని ధర్మములను వదలి నన్నొక్కనినే శరణు వేడుము) అని గీతా వాక్యము. (ఇదియే శరణాగతి) ఇది ఇచట లక్ష్మీదేవికికూడ అన్వయించును. 58వ శ్లోకములో చెప్పినట్లుగా ఎవరో తెలియని మనుజునియందే ఆకస్మిక కృపను చూపు స్వభావముగల లక్ష్మీదేవి నిత్యము సేవించు తమ్ము తప్పక రక్షించగలదు అని వారి అభిప్రాయము. ఇచట పూర్వుల నైచ్యానుసంధానము యొక్క అనుకరణకు :-

1. మనోవాక్కాయైః (గద్యత్రయం)
2. సత్కర్మ నైవకిల కించన సచినోమి (శ్రీవైకుంఠస్తవం 44)
3. నధర్మనిష్ఠోఽస్మి నచాత్మవేదీ (స్తోత్రరత్నం 22)
4. వృత్త్యావపు ర్నరవపుః (యతిరాజవింశతి 8)
5. కాలత్రయేఽపి కరణత్రయ (యతిరాజవింశతి 18)
6. అమర్యాదః క్షుద్రః (స్తోత్రరత్నం 62)
7. జనిత్వాహం వంశే మహతి (స్తోత్రరత్నం 61)

8. ననిందితం కర్మ యదస్తిలోకే (స్తోత్రరత్నం 23)
9. ప్రేమార్ద్రావిహ్వలగిరః (శ్రీవైకుంఠస్తవం 10)
10. హా హన్త హన్త (యతిరాజవింశతి 10)

ఇత్యాదులున్ను, ఇంకను అనేకవిధములుగా ద్రావిడ ప్రబంధములలో కూడ చెప్పబడినవియున్ను, అయిన వాక్యములును గ్రాహ్యములు, మరియు -

'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ।
తస్మాత్ కారుణ్యభావేన రక్షరక్ష జనార్దన' ॥

(నీవు తప్ప వేరుదిక్కులేదు. కావున కారుణ్యభావముతో నన్ను రక్షించుము) అను ఈ శ్లోకమును, 'నీవేతప్ప నితఃపరంబెరుగ మన్నింపందగున్ దీనునిన్' అను పోతన మహాకవి వాక్యములను ఇచట లక్ష్మీదేవియందుకూడ అన్వయించుకొన వచ్చును. పూర్వశ్లోకమునందు వలెనే ఇచటకూడ శ్రీభట్టరుల వినయపరాకాష్ఠ అహంకార రాహిత్యములు సూచితములు. ఇంతవరకు లక్ష్మీదేవిని ఆమెయొక్క గుణవైభవ మును స్తుతించి శ్రీపరాశర భట్టరులు తరువాతి శ్లోకములో తమస్తోత్రము (గ్రంథము) ను ముగించుచున్నారు.

సంస్కృత వ్యాఖ్య :- ఇత్యుక్తీతి। హే అంబ! శ్రీరంగేశ్వరి।ఇతి పూర్వోక్త ప్రకారేణ ఏతత్సజాతీయతయా వా ఉక్తిద్వైతవశతేన కపట నైచ్యవచన సహస్రేణ తాన్ భగవన్నిర్హేతుక కటాక్షైకలబ్ధ విశదతమజ్ఞానతయా ప్రసిద్ధాన్ సత్య వచనః యథార్థవాచః ప్రామాణికా నిత్యర్థః। పురాణాన్ పురుషాన్ పూర్వాచార్యాన్ పరాంకుశ పరకాల యామున యతివరాదీన్ విడంబయామి అనుకరోమి। 'నధర్మనిష్ఠోఽస్మి' మనోవాక్కాయైః 'సత్కర్మ నైవకిల కించన సంచినోమి' ఇత్యాది తత్తన్నైచ్యాను సంధానవత్ అహమపి నైచ్యానుసంధానం కరోమీత్యర్థః। పరాంకుశాది నైచ్యాను సంధానం భాషాన్తరత్వాత్ న సూచితమ్। తన్నైచ్యానుకరణ మాత్రేణ మద్రక్షణం కార్యమిత్యాశయః। రక్షణే హే త్వన్తర మాహ-యద్వేతి। యద్వా నోచేత్ తవ పాదపద్మలాభే త్వచ్చరణారవింద సంప్రాప్తౌ మే భుజబలం న మత్సామర్థ్యం కించిదపి నాస్తి। కింతు విధితః త్వన్నిర్హేతుక కృపయా 'శేషశేషితవ్య సంబంధా దనిదం ప్రథమాదపి' ఇత్యుక్త నిరుపాధిక శేషశేషితవ్య సంబంధ నియతేర్వా త్వమేవ శరణం ఉపాయః కృతాసి। విధితః కుతోఽపీతి పాఠే నిర్హేతుకాదిత్యర్థః। తదా శరణమిత్యనంతర మితి శేషః। విధిశబ్దః కృపావాచిత్వేన శ్రీపరాంకుశైః ద్రావిడోపనిషత్పంచమశతకాద్యగాథా తృతీయచరణే ప్రయుక్తః। వ్యాఖ్యాతశ్చ తథా కలిమథన దేశికైః॥

అ :- దృష్టాదృష్టే ఉభేఽపి శ్రీముఖతః ప్రార్థయన్ స్తోత్రం పరిసమాపయతి।

శ్లో ॥ శ్రీరఙ్గే శరదశ్శతం సహ సుహృద్వర్గేణ నిష్కణ్టకం
నిర్దుఃఖం సుసుఖంచ దాస్యరసికాం భుక్త్వా సమృద్ధిం పరామ్।
యుష్మత్పాద సరోరుహాన్తర రజః స్యామ త్వమమ్బా! పితా
సర్వంచ త్వమసి త్వమేవ భవ నః స్వీకు ర్వకస్మాత్కృపామ్ ॥౬౧

అ:- హే శ్రీరంగేశ్వరి= ఓ శ్రీరంగనాయకీ!, శ్రీరంగే=శ్రీరంగ దివ్యనగరము నందు, శతం శరదః=నూరుసంవత్సరములు, (శతాయుః పురుషః అన్నట్లుగా పూర్తిగా వందసంవత్సరములు), సుహృద్వర్గేణసహ= బంధు మిత్రాదులతో కలసి, నిష్కంటకమ్ = ఏ ఉపద్రవములు లేనట్లుగాను, నిర్దుఃఖమ్= దుఃఖ స్పర్శలేనట్లుగాను, సుసుఖంచ= మిక్కిలి సౌఖ్యము కలుగునట్లుగాను, దాస్యరసికామ్= నీయొక్క కైంకర్యముతో కూడిన, పరామ్=సర్వోత్కృష్టమైన, సమృద్ధిమ్= ఐశ్వర్యమును, భుక్త్వా= అనుభవించి, యుష్మత్= మీయొక్క, పాదసరోరుహ= పాద పద్మముల యొక్క, అంతర=మధ్యభాగమునందలి, రజః=పరాగముగా, స్యామ= అగుదుము, నః= మాకు, త్వమ్=నీవే, అంబా=తల్లివి, త్వమ్=నీవే, పితా=తండ్రివి, సర్వంచఅసి= మిగిలిన సమస్తము, త్వమేవ=నీవే, భవ=అగుము, అకస్మాత్= నిర్హేతుకముగనే, కృపామ్=దయను, స్వీకురు=స్వీకరించుము.

తా:- శ్రీరంగరాజేశ్వరివైన ఓ లక్ష్మీదేవీ! శ్రీరంగమున పుత్రపౌత్రశిష్య ప్రశిష్య బంధుమిత్రాదులతో, కంటకరహితముగా దుఃఖస్పర్శలేకుండగా కేవలము సుఖమే కలుగునట్లుగా నిండునూరేళ్ళు మీయొక్క దాస్యమనెడి సంపదతో ఇహలోక సుఖమును అనుభవించి ఆ తరువాత మీపదపద్మములయందే రజస్సుగామారి పరలోక సుఖమునుకూడ ఇచటనే అనుభవించెదము. నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే సర్వస్వమున్ను కావున ఓ జననీ! మాయందు ఆకస్మికమైన కృపనుచూపుము.

వి:-

శ్లో ॥ శ్రీరంగయాత్రా శ్రీరంగ యియాసాచైవ నారద।
ఉత్తారయతి సంసారాత్ నిత్యవాసస్తు కింపునః॥

(శ్రీరంగయాత్రగాని, శ్రీరంగమునకు వెళ్ళవలయుననెడి కోరికగాని సంసారము నుండి జీవుని ఉద్ధరించును. అచటనే నిత్యము నివసించినచో ఇకవేరుగా చెప్పనక్కర లేదు.)

అని అన్నట్లుగా శ్రీరంగములో నిండునూరేళ్ళు పుత్రపౌత్ర శిష్యప్రశిష్య బంధు మిత్రాదులతో నివాసమును శ్రీపరాశరభట్టారకులు కోరుకొనుచున్నారు. 'శ్రీరంగే శరదశ్శతం తత ఇతః పశ్యేమ లక్ష్మీసఖమ్' అని ఈ గ్రంథకర్తయే శ్రీరంగరాజ స్తవమునకూడ చెప్పియున్నారు. శ్రీకులశేఖరాళ్వారులు కూడ ప్రతిదినము

శ్రీరంగయాత్రకు బయలు దేరుచుండెడి వారని 'ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినేదినే అను శ్లోకము చెప్పుచున్నది కదా। ఆ నివాసము లక్ష్మీ నారాయణుల శ్రీపాద కైంకర్యము అనెడి సంపదను అనుభవించుచునే కోరబడినది. ఇచట శ్రీపాదకైంకర్యమే సంపదగా చెప్పబడినది. అంతకు మించిన వేరే సంపదతో పనిలేదు.

'త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ' (నీయొక్క భృత్యులలో చివరివానిగా నన్ను స్మరింపుము) అని శ్రీకులశేఖరాళ్వారును;

'తవదాస్య సుఖైక సంగినాం భవనేష్వస్త్వపి కీటజన్మమే ।
ఇతరావసథేషు మాస్మభూత్ అపి మే జన్మ చతుర్ముఖాత్మనా'॥

(నీయొక్క దాస్యమను సుఖమును అనుభవించు వారి ఇంట కీటకముగ పుట్టినను మంచిదే, కాని ఇతరుల గృహములయందు బ్రహ్మగానైనను జన్మించను.) అని శ్రీ యామునార్యులును కోరుట గమనించదగినది. అందువలన భగవత్పాద దాస్యమే భక్తులకు సంపద. ఆ తరువాత ఈ పుత్ర పౌత్రాది వర్గముతో సహా లక్ష్మీనారాయణుల యొక్క పాదరజస్సుగామారి పరలోక సౌఖ్యమునుకూడ అచ్చటనే (శ్రీరంగముననే) అనుభవించు అవకాశము కోరబడుచున్నది. అనగా అప్పుడుకూడ వారి కైంకర్యమునకు లోటురాకుండ నుండుటకై వారి పాదపద్మములయందే పరాగముగా మారుటకు కోరుకొనుచుండిరి. తమతోడిబృందము అంతయుకూడ ఆ పరాగమున ఒక్కొక్కరు ఒక్కొక్క రేణువు అగుదురు. ఈ విధముగా దృష్టప్రయోజమైన ఇహలోక సుఖము అదృష్ట ప్రయోజనమైన పరలోక సుఖముకూడ శ్రీరంగముననందే శ్రీరంగనాయకి ద్వారానే కోరబడినవి. ఇచట 'స్వయంతీర్ణః పరాం స్తారయేత్' (తాను తరించి ఇతరులను తరింప చేయవలయును.) అనెడి సూక్తి శ్రీభట్టరుల విషయమున సార్థకమైనది. అంతేగాక ఇచట లక్ష్మీదేవియే తల్లిగా, ఆమెయే తండ్రిగా, ఆమెయే మిగిలిన సమస్తముగా పైన వివరించబడిన ప్రయోజనములకు ఆమెయే హేతువుగా చెప్పబడినది కావున తమను తత్పాదసన్నిధికి చేర్చుకొను ధర్మము, అలౌకిక శ్రేయః సాధనము, కర్మ, జ్ఞాన, భక్తి ప్రపత్త్యాదికము, వాని ప్రవృత్తికి సాధనము. అన్నియు ఆమెయే. అందువలననే తమయందు ఏ అర్హతయు లేకపోయినను నిర్హేతుక జాయమాన కృపను తమపై ప్రసరింపచేసి తన పురుషకారము ద్వారా శ్రీరంగనాథుని తమ యభీష్టములను నెరవేర్చునట్లు చేయవలసినదిగా శ్రీభట్టరుల ప్రార్థన. అప్పుడే లక్ష్మీదేవియొక్క కృపకు కారణము లేదను ఖ్యాతి సార్థకమగును.

ఇచట భగవంతునకు సంబంధించినవే యైనను-

'త్వమేవ మాతాచ పితా త్వమేవ త్వమేవ బంధుశ్చ గురు స్త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవదేవ॥'

'నీవే తల్లివి, నీవే తండ్రివి, బంధువు, గురువు, విద్య, ధనము, అన్నియు కూడ నీవే' అను ఈ శ్లోకమును, అట్లే క్రిందటిశ్లోకములో చెప్పుకొనిన 'అన్యథా శరణం నాస్తి' అను శ్లోకమునుకూడ లక్ష్మీదేవియందుకూడ అన్వయించుకొన వచ్చును. 'జనన భవన ప్రీత్యా' అను (56) శ్లోకముతో చెప్పబడినట్లుగా పాల సముద్రము పుట్టినిల్లు, వైకుంఠము మెట్టినిల్లు అయినను శ్రీరంగధామము కేవలము భక్త రక్షణ కొరకై ఎన్నుకొనబడిన లక్ష్మీదేవియొక్క నిత్యనివాసము కావున శ్రీభట్టరులచే కూడ ఆ శ్రీరంగమునందే నిత్యనివాసము కోరబడినది. అదియే మానవజన్మకు సార్థకత నిచ్చునది. పరమ పురుషార్థమైన మోక్షమునకుకూడ హేతువు. అది కేవలము శ్రీపరాశరభట్టారకులకే గాక అందరకును కోరతగినది.

ఇచట 'సుహృద్వర్గము శ్రీరంగనాథుని ముంగిటిలోనుండు ఆనందపరవశులగు దాసుల సమూహము' అనియు నిత్యముక్తులును శ్రీరంగమునందే వచ్చి కైంకర్యము చేయుటచేతను, ఇది ప్రత్యక్షమైన పరమపదముగా నుండుటచేతను, పరమ పదమును దిగద్రోసి వచ్చెదమని చెప్పునట్లు అంతటి భోగ్యముగా ఉండుటచేతను ఇహముతో పాటు పరనముకుకూడ శ్రీరంగక్షేత్రముననే వేడుకొని ఈ స్తోత్రమును ముగించిరి''. అనియు సువర్ణ కుంచికా వ్యాఖ్య. రత్నదీపికా వివరణము ముగిసెను

సంస్కృత వ్యాఖ్య :- శ్రీరంగ ఇతి । హే శ్రీరంగేశ్వరి! శ్రీరంగే దివ్య నగరే శతంశరదః 'శతాయుః పురుషః' ఇతి శ్రుత్యుక్త ప్రకారేణ శతవపి వత్సరాన్ 'కాలాధ్వనో రత్యంతసంయోగే' ద్వితీయా । సుహృద్వర్గేణసహపుత్ర పౌత్ర బంధు శిష్య ప్రశిష్యాదిభిః సమంనిష్కంటకం నిరుపద్రవం నిర్దుఃఖం సుతరాం సౌఖ్యంచ యథా భవతి తథా దాస్యరసికాం త్వత్కైంకర్య రసజ్ఞాం పరాం సర్వోత్కృష్టాం సమృద్ధిం శ్రీరంగశ్రియం భుక్త్వా అనుభూయ - ఏవం దృష్టముక్త్వా అదృష్టమాశాస్తే యుష్మదితి । యుష్మత్పాద సరోరుహాన్తరరజః యువయోః పాదపద్మగర్భరేణుః స్యామభవేమ । యుష్మచ్చరణ కమలకైంకర్యభోగా భవేమేత్యర్థః । ఏవం శ్రియో దృష్టాదృష్టప్రదానే హేతుమాహ। త్వమిత్యాదినా ।

త్వమంబా త్వమేవమాతా, త్వమేవపితా త్వమేవజనకః । అబ్భక్షో వాయుభక్ష ఇతివత్ । త్వమిత్యవధారణార్థః । త్వమేవభవ ఇత్యుపరితన ఏవకారో వా అనుకృష్యతే । సర్వ విధోఽపి బంధుః త్వమేవేత్యర్థః । నను మమ సర్వ బంధుత్వేఽపి మత్ప్రాప్త్యుపాయా ననుష్ఠానే తవ కథం మత్ప్రాప్తి సిద్ధిః ఇత్యత ఆహ। సర్వమితి । త్వమేవ నః అస్మాకం సర్వమపి ధర్మమలౌకిక శ్రేయస్సాధనం కర్మజ్ఞాన భక్తి ప్రపత్త్యాదికం భవ । 'స్యాద్ధర్మ మస్త్రియాం పుణ్యం' ఇత్యమరః ।

సర్వ ధర్మ స్థానే పురుషకారతయా త్వమేవస్థిత్వా సిద్ధోపాయేన భగవతా మదిష్టం ప్రాపయే త్యాశయః॥ త్వయి గుణలేశాభావే కథం మమ తథాభావ ఇత్యత ఆహ। స్వీకుర్వితి । అకస్మాత్కృపాం నిర్హేతుకదయాం స్వీకురు అంగీకరుష్వ । మద్గుణలవనిరీక్షణే కృపాయా నిర్హేతుకతా నసిద్ధ్యేదితి తదనుపేక్షమేవ మాం రక్షేతి భావః ॥

ఇతి శ్రీవత్సకులతిలకస్య వీరరాఘవాచార్యస్య కృతిషు

'శ్రీ గుణరత్నకోశ' వ్యాఖ్యానమ్ ॥

సర్వేజనా స్సుఖినో భవన్తు

శ్రీః

# మంగళాశాసనము

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు ॥

1. ఈశానాం జగతోఽస్య వేంకటపతే ర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షఃస్థల నిత్యవాస రసికాం తత్ క్షాన్తి సంవర్ధినీమ్ ।
పద్మాలంకృత పాణిపల్లవయుతాం పద్మాసనస్థాం శ్రియం
వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్ ॥

2. ఆకారత్రయ సంపన్నాం అరవింద నివాసినీమ్ ।
అశేషజగదీశిత్రీం వందే వరదవల్లభామ్ ॥

వ. ఓమ్ భగవన్నారాయణాభిమతానురూప స్వరూప రూపగుణ విభవైశ్వర్య శీలా ద్యనవధికాతిశయా సంఖ్యేయ కల్యాణ గుణగణాం పద్మవనాలయాం భగవతీం శ్రియం దేవీం నిత్యానపాయినీం నిరవద్యాం దేవదేవ దివ్యమహిషీం అఖిల జగన్మాతరం అస్మన్మాతరం అశరణ్యశరణ్యాం అనన్యశరణః శరణమహం ప్రపద్యే।

3. లక్ష్మీం క్షీరసముద్రరాజ తనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూత సమస్తదేవవనితాం లోకైక దీపాంకురామ్ ।
శ్రీమన్మంద కటాక్ష లబ్ధవిభవ బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్ ॥

4. మాతర్నమామి కమలే కమలాయతాక్షి !
శ్రీవిష్ణు హృత్కమలవాసిని! విశ్వమాతః ।
క్షీరోదజే కమల కోమల గర్భగౌరి!
లక్ష్మి ! ప్రసీద సతతం నమతాం శరణ్యే! ॥

5. మాదృశా కించన త్రాణ బద్ధకంకణ పాణయే ।
విష్ణుచిత్త తనూజాయై గోదాయై నిత్యమంగళమ్ ॥

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ

శ్లోకానుక్రమణికా

# భారత సావిత్రి

శ్లో॥ మాతాపితృ సహస్రాణి, పుత్ర దార శతాని చ।
సంసారేష్వనుభూతాని, యాన్తి యాస్యన్తి చాపరే ॥ 1

శ్లో॥ హర్షస్థాన సహస్రాణి, భయస్థాన శతాని చ।
దివసే దివసే మూఢ మావిశన్తి న పణ్డితమ్ ॥ 2

శ్లో॥ ఊర్ధ్వ బాహు ర్విరౌమ్యేష , న చ కశ్చి చ్ఛృణోతి మే ।
ధర్మాదర్థశ్చ కామశ్చ, స కిమర్థం న సేవ్యతే॥ 3

శ్లో॥ న జాతు కామా న్న భయా న్న లోభాత్
ధర్మం త్యజే జీవితస్యాపి హేతోః ।
నిత్యోధర్మః సుఖదుఃఖే త్వనిత్యే
జీవోనిత్యో హేతు రస్య త్వనిత్యః ॥ 4

శ్లో॥ ఇమాం భారత సావిత్రీం ప్రాతురుత్థాయ యః పఠేత్।
స భారతఫలం ప్రాప్య పరంబ్రహ్మాధి గచ్ఛతి ॥ 5

(మొదటి శ్లోకమున వైరాగ్యబోధ, రెండవ శ్లోకమున ఆత్మజ్ఞానఫలము, మూడవ శ్లోకమున సాధనమగు ధర్మాచరణ, నాలుగవ శ్లోకమున నిత్యశాంతిని పొందుటయే కర్తవ్యమని జీవునకు ఉపదేశము చేయబడెను.)

* * * *

162

చీరాల, కొత్తపేట వాస్తవ్యులైన
శ్రీమతి రావి కృష్ణకుమారి గారు
చేసిన ఆర్థిక సహాయముతో ముద్రింపబడిన
'శ్రీగుణరత్నకోశము'
అను ఈ సంస్కృతాంధ్ర వ్యాఖ్యాన గ్రంథము
శ్రీరంగ శ్రీరంగనాయికీ సమేత శ్రీరంగనాథస్వామి వార్ల
పాదపద్మములకు భక్తితో సమర్పితము.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | RMR01A132 | Date | 4/8/22 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 161 | | |
| Missing Pages | No | | |
| Prepared By | pradhyusha | Cutting By | pradhyusha |
| Scanned By | Sandhya | Pages | 165 |